శ్రీమత్పరదేవతాయై నమః.

# గుంటూరిసీమ, ఉత్తరరంగము.

ఇది

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే,

రచింపఁబడి,

బ్రహ్మశ్రీ మల్లంపల్లి భైరవమూర్తి గారిచే

స్వకీయమగు

భైరవముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

మొదటికూర్పు, కాపీలు 1000

వెల రు'



1914.

బందరు.



తిరుపతి వేంకటేశ్వరులు,

శతావధానులు.

# ఉపోద్ఘాతము



చదువరులారా?

ఇప్పుల మగుపూర్వరంగపీఠికయు, వేమవరాగ్రహారశతావధానపీఠికయుఁ జదివియున్నమీకుఁ బ్రకృతవివాదమునకు సంబంధించిన సోదరులయుఁ దదభిమానులయుఁ గుకల్పనలు చాలవఱకు బోధించి యుండును. 119 వపుటలోని శ్రీసోదరుల తప్పడు రిజిస్టరుత్తరముకూడఁ బైవిషయమును బలపఱచుచునట్టిదియే, అదియటులుండె, ఈక్రింది సూత్తరమును దిలకింపుఁడు.

నెకరికల్లుపోష్టు, నర్సారావుపేటతాలూకా 6-12-13, కుంకులగుంట.

...నేను ఏతగుపాటియో కావ్యపరిచితిగలవాడను సుకవిపాదపద్మ విధేయుపరమాణువును...నన్నునేమహాలాభము నభిలషించియో యే యోర్పులేనియోగ్యులో తమరాశిలోఁ జేర్చికొనుటకు అక్టోబరునెలలోఁ బ్రచురించిన సువర్ణలేఖిలో తమ్మును దమయవధాననిందను గూర్చి వ్రాసినయవాచ్యోపన్యాసములో నన్నుదన్కృతుదాగునిగా జేర్చి, "ఫోర్జరీ"యనియేని వెరవకప్రకటించియున్నారు ఆసాహసచాకచక్యములు వారికేతగును నిజమునకు నేనింతవరకు తమపుస్తకములలోని ఫోటోలనుజూచిన భాగ్యవంతుడనేకాని తమసాక్షాద్దర్శనము చేసినధన్యుఁడను కాను ఇట్టిస్థితిలో అవధాన మెప్పుడుచూచితినో యాయసత్యవాదియుపన్యాసమెప్పుడు వ్రాసితినో పరమాత్మునకెరుకయగు, ఈజాల్మప్రజ్ఞలు తాము యెరింగియేయున్నను కాలౌచిత్యమునుబట్టి తమకునేనిట్లనపరాధినని విశదపరచికొనుటయుక్తమని వ్రాసికొంటిని, తమయనుగ్రహపూర్వకపుజాబు వచ్చువరకు నిరీక్షించుచుందును.

క॥ టక్కరులల్లెడి టక్కులు,టక్కున గ్రహియించునాకడంకయుఁదమకే
చిక్కెను వెంకటకవివర?, యిక్కలికాలంబునం దనేకవిధాలన్.

చిత్తగింపుడు. వరెం,నృసింహయ్య,

ఇట్టితప్పుడు సృష్టిసేయఁగలమహానుభావులు చేతులోఁగలసోదరులకు నై
వరు దీటు గాఁగలరు?, పైయుత్తరమువలన వారిపక్షమున నుంకువారితత్త్వము
నుంత దెలిసియుండుటచే గానఁ దావృశులు* ప్రల్లదములను నిత్యమును బ్రకటించుచు

---

(*హితకారిణి చేయు నధికప్రసంగము దిఙ్మాత్రము.)

'మీలో వెంకటకవియా?, తిరుపతికవియా?, 'వెఱ్ఱివెంకటాయ'' నిజముగా శ్రీతిరుపతి వెంకటేశ్వరుల ప్రజ్ఞావిశేషమున కుపమింపఁదగినది యొక్కఁడే మేడిపండే, గంగిరెద్దులయాటలోఁ గొనంకిదాసుఁడు అను వేషధారి అమ్మల్లారా నావీపెండ్లి, అయ్యల్లారా నావీపెండ్లి, అన్నల్లారా నావీపెండ్లి, అని కేకలు వేయునట్లుగా మేము శతావధానులమని ప్రకటించుకొనుట మిగులఁ బరిహాసపాత్రముగా నున్నది, ''వారిపూర్వక్రియలఁదెలుపు గుంటూరిసీమపూర్వరంగము... ఉత్తరక్రియల నెఱిఁగించు గుంటూరిసీమ, ఉత్తరరంగము, 'వీరి కండాలపుబని నేలచేయవలెను, చిత్తుకుల అప్పయశాస్త్రుఁట?... మనోరంజనిమీద మామిడికేసు,,. తురకదాసరికి ఈతమజ్జిగన్నట్లు, అప్పయ్యశాస్త్రితురక తెలుగుకు,, వెఱ్ఱప్పయ్యా, ...తిరుపతివేంకటేశ్వర్ల మేళంలో యితడో హంగుదారుడు,- ఛీ వాట్లు తినకు ''వేశ్యవిధమున... వీరు నిందవ్యలగుట చాలశోచనీయముగా నున్నది, నియోగిశిఖామణులవియు...యు... యు దెబ్బొగడుచుంటిరి... గంగిరెద్దులవాండ్రు... పైన..., యిచ్చిన ఎట్టియర్థముఁదైనను వాసిని మహారాజు...అని పొగడుచుండురు, అట్టిమతమునే తమకవలంబించుట చాలశోచనీయము,, 'ప్రాతలంజలు వీరమాతలైరి, ''తిరుపతివేంకటేశ్వరులు... వేశ్యమాత కప్పరో చెల్లెలోయైన ప్రజ్ఞచే నిరసించుచు... యనుకూలురైన వారిని బెద్దఁబొగడుచు 'గంజాయిపోకురా, సారాయిపోకురా, బాపనోండ్లందర్లో పెద్దోడు తాగలేద,, అను పాటను పాడుచున్నారు ''ఛీ, ఛీ, యనినిరసింప శోభ్యస్థితిలోనున్న యభినవసరస్వతిని,, ఆయన (విర్భూరిసుబ్బయ్యగారు) తి॥ వెం॥ ల, నెక్కించి యనృతమహిషమ్ములంబూనిచి పాపపుబండిదోలుచున్న మహానుభావుఁడు, అయ్యా! గంగరాజుగారు 2 గంగరాజుగారూ, ఓహో గంగరాజుగారూ!!! మురిగిన కాలును మూసిపెట్టుకొని 'మిగుఁడూరుసీమ,, సలాములు చేయుచున్నాను క॥ మస్తాను నామకుండ... మహామనుష్యుఁడఁట' 'గానిస్వయంపాకివానిసర్వశూన్యశతకము,'

☞ ఇట్టితప్పుడుకూఁతలు కుప్పతెప్పలు, ఈస్వయంపాకివాఁ,, డెవరో

యుక్తాయుక్తజ్ఞానము నవలకు నెట్టి పాటుపడుచున్న 'హితకారిణి' మనోరంజ నుల,యందలి పర్వతప్రాయములగు దబ్బఱల నిందుదాహరించి ఖండించుటకు మీ రేసమ్మతింపరు, లోకులహృదయమునందవి యేపేరున నెక్కియున్నవో సుం త తెల్పుటవలన నాపత్రికాద్వయమునకుఁ గొంతొక వివేకమబ్బవచ్చునని యెం చి దిఙ్మాత్ర మందులకు సాధకములగునంశములు గొన్ని యుదాహరించెదము.

12th August 13.

(1)...... మఱియు హితకారిణి,మనోరంజని,యీరెండుపత్రికలు మీ కపయశస్సును గలిగించుటకై గంకణముఁగట్టికొన్నట్లు దోచుచున్నది. జూలైనెలలో వెలువడిన మనోరంజనిలో పత్రికాధిపతిగారు తమ గుం టూరుసీమ గ్రంథమునంతను, విమర్శింతుమని వ్రాసియున్నారు. చూ చుకొనెదముగాక "యతో ధర్మస్తతో జయః", చూడఁజూడఁగొందఱు

---

యెఱుఁగుదురా? స్వయంపాకుల లక్ష్మీనారాయణశాస్త్రికివచ్చినపాట్లివి.

(మనోరంజనిచేయునధికప్రసంగముదిఙ్మాత్రము.)

ఓయెందుగండికవులారా' జైలులనరయుఁడయ్య, భరణంబునకు దావసై పుఁడయ్య,ఒడలెరుంగనిసిని మిప్పుడుండఁదగునె, "ఛీఛీ! యనిప్రజ్ఞాతిశయులేదగిం పఁగ నేతావున సభయటన్నసికనేగకుఁడీ, 'వారు (తిరుపతి వెంకటకవులు) వ్యర్థముగామాపైమిడుకుదురు, నీయిజారులో నాపైజారన్నట్లు వారిపుస్తకములో వీరిపద్యమెట్లో,, "వారి (తిరుపతివేంకటేశ్వరుల) యీతలవంపుచైదముల,, "అ మ్మదగ్గఱఁగ్రిందఁ దొంగున్ననేమి అయ్యదగ్గఱనేలఁ దొంగున్ననేమి,, "లేని మగతనము నాశించియెగదరి తమలో నొకరు మీసముంచికొనిరి,, "పాగా, పంచా చూచి పావరాజువనుకొన్నాను, పేర్రాజువఁటోయ్- యీ(రాజా, "ఛీ! వహ్వా! యెంతబిడ్డ ఈబిడ్డెనువీరు (తి॥ వెం॥కవులు) మాయింటిపొరుగుబుచ్చమ్మకడనేర్చు కొని యుండవలెను మాచిన్ననాఁడు మాపొరుగున నొకసద్బ్రాహ్మణుఁడు నివసిం చెడివాఁడు' ఆయనభార్య బుచ్చెమ్మ కొంచెంపైయాటకత్తె...,, "పండితరాయలు తిట్టెఁగాని తమవలెబూతులు తిట్టితన్నులు తిని......"

☞ ఇట్టివెన్నో కలవు, పాకముముదురుచున్నది, ఇందుమొదటివేవో

మీయమూల్యమగుకాలమును వ్యర్థపుచ్చఁజేయుటకై పూనినట్లున్నది.
ఇంతకునిదికలి కాలమహిమ....,,          ఎ, యస్, రామకృష్ణులు,
5489 Regimental Bazaar
Secunderabad Deccan

---

అమరావతి 10- 2- 14.

,,హితకారిణి,,యనుపలూరులో ప్రచురింపబడుచుండువారపత్రికలో యిప్పటిక్కి వారమునుంచి అనగా ది 14 - 12-13 తారీఖుపత్రికలో యున్నూ, ది 1-2-14 తారీఖుపత్రికలో యున్నూ ,పాతగోడకుపూతచక్కన, అనుహెడ్డింగుపెట్టి వ్రాయుచుండుఅవాచ్యపువ్రాతలను తమరుపత్రికాముఖమునచూచియేయుందురు. యిట్టియప్రస్తుత ప్రసంగమును జరుపుచుండుఘనుండెవడో ,స శేష,మనివ్రాయుచుండుటచేదెలియకుండానున్నది. యింతమాత్రపుకారుకూతలు వ్రాసినంతనే...యిట్టితప్పుడువ్రాతలు వ్రాయుచుండు మహానుభావుడెవడో తమకు తెలిసినయెడల తెలుపవేడెద*          జానపాటి వెంకటప్పయ్యశాస్త్రిలు

---

యేలూరు, 6-8-13

...మనోరంజని దుడుకుగ వదరుచున్నది. చూచితిరా?.
మై, కృష్ణమూర్తి.

---

జానపాడు 7- 9- 13.

...,,హితకారిణి మీరుచూచుటలేదా, వాగుడెక్కువయినదే.
జా॥ పట్టాభిరామశాస్త్రి.

---

కొన్ని తప్పందక్కినవి పత్రికాప్రవర్తకుని స్వహస్తలిఖితములు సుండీ ఇతఁడుగూడ నొకసత్య నివేదకుఁడే, ఇతఁడును విమర్శనకర్తయే, ఇతఁడునుమానిసియే!!! ఔరా! కాలమహిమ, శాంతంపాపమ్

లోకులయభిప్రాయముల నటుంచి తోడిపత్రిక లగు సుదర్శిని మొదలయినప
త్రికలపోకడల నెట్లు నిరసించుచున్నదో చూపుటకుఁ బ్రస్తుతము కాకపోదు.
(1911 సం॥ జనేవరి 1వ తేది సుదర్శినీ పత్రికనుండి)

## విజ్ఞప్తి.

ఆర్యులారా! దేశము చేసుకొన్న పాపము చొప్పున నిపు డె న్నఁటఁ జూచినను «మనోరంజని, కవులు మిక్కుటముయి గురుకులవాస పాఠపఠనాది వృథా శ్రమము లక్కఱ లేకుండనే సులక్షణసార నామక గ్రంథమాత్ర శరణ్యులయి తగుదుమని ముందునకు వచ్చుచున్నారు. తమ రాఁకొనుమాటలనే గణములను పరిస్తరించుకొని యందిమిచ్చి పద్యముగా పొదుపుపెట్టిన వాఁడెల్ల కవియగుచున్నాఁడు. ఇంతంతగాఁ దప్పులేదు కాని తానా స్థితిలోనే యుండి తనతోడిబాలిశుల తోడనే సల్లాపములాడికొనక విశేషించి పెద్దకుండలకెసల్లు పెట్టఁజూచుచు భాషావ్యవసాయమున గడిదేరిన నెట్టిపండితకవులనేనియుఁ బూచిక పుల్లలవలెఁ దీసివేయుచు నొడలెఱుంగని నివము లాడుచున్నారు! ఇందుకుఁగారణ మిప్పుడీ తెగ యెక్కువగుటయునా తెగ తక్కువగుటయే! వినీత వాణి కిప్పుడు కాలదోషముపట్టినది. ఈపత్రికలో నప్పుడప్పుడు తిరుపతివెంకటేశ్వరకవులంగూర్చి చర్చించఁబడుచు వచ్చినది. తత్సందర్భమునఁ గొప్పరపుగవులను గూర్చి కూడ నొండు రెండు సారులు వ్రాయఁబడినది. ఈపత్రికయుద్దేశము పాండిత్యము నభిలంపిచుటయే కాని వేఱుకాదు. ఈ తిరుపతివెంకటకవు లెట్టివారో కనులనైనఁ జూడలేదు. కొప్పరపువారి సంతకమునువే చూడలేదు. పరిచయ మున్నప్పుడుగదా స్నేహావిరోధము లేర్పడుట, అదిలేనప్పు డవియు నుండవుగదా? ఇట్టి విషయములో డిసెంబరు 14వ తేదీ హితకారిణిలో «సుదర్శినీ పత్రికాధిపతి సోదరకవులను దిట్టినట్లుగా" అను నీ మొదలయిన వాక్యములు కొన్ని సశేష వ్యాసములో నెవ్వరో వ్రాసిరి, ఇదేటి యన్యాయ

ము? సోదరకవులను దిట్టినదెవ్వఁడు? తారతమ్యపర్చ చేయుటయెల్లఁ దిట్టుటయేనా? ఈసోదరకవులెవ్వరు?వీరి నెందుకుఁ దిట్టవలెను, ఎందుకు గౌరవించ వలెను?, గౌరవా గౌరవము లెప్పుడుపుట్టును! తదనుభవము మీఁదఁ బుట్టును. ఆయనుభవ మెట్టిది? తద్గ్రంథపఠనరూప మయినది. తిరుపతి వేంకటకవులమీఁద గౌరవభావమేల గుదురవలెను? వారిగ్రంథములను బఠించుటవలన, ఆగ్రంథములలోఁ గవిత్వవస్తు వుండుటవలన. కవిత్వవస్తువన నేమో?ప్రత్యేక మొకగ్రంథమువ్రాసినఁగాని యిక్కడ స్ఫుటపఱుపఁజాలము. అట్లే కొప్పరపువారుఁగూడ పదిగ్రంథములు రచించి మన కనుగ్రహించనిండు. అప్పుడు గౌరవాగౌరవములు స్థిరపఱుతము. రెండు బంగారు కణికలు వన్నె గట్టవలసి వచ్చినప్పుడు నికషోపలము (గీటురాయి) పైనొక్క రేఖయే కానవచ్చుచుండెను. రెండవది స్వరూపశూన్య మయి యుండెను. అప్పట్లఁ జేయవలసినదెద్ది? గీటురాతిపై రెండవకణికగూడ నొకింతగీసి చూపరాదా? అప్పు డేతగవులు నుండవుగా! అదియేలొకో రహస్యముగ దాఁచిపెట్టిఊరక ‘‘నాకణిక పదియార్వన్నెవచ్చును, తక్కినవన్నియు దీనికిదిగదుడుపు” అని బూకరించనేల? వారికవిత్వము విన్నవారికిఁ జాలదా? యని చెప్పవత్తురేమో? ‘‘వారువిన్నారు వీరువిన్నా” రని యీ మూజివానీ సాక్ష్యములెందుకు? నాల్గుగ్రంథములీవలఁ బాఱవేయరాదా? అవియేపోరాడునుగా. కావున నోప్రాజ్ఞులారా!, సుదర్శినీపత్రికాధిపతి తిరుపతివెంకట కవులను ఆకాశమున కెత్తుచున్నాఁడనియుఁ గొప్పరపువారిని దిట్టుచున్నాఁడనియు;, నిత్యాదులువ్రాసి స్వచ్ఛపత్రములఁగళంకపఱచవలదు. దైవసాక్షిగా నిందెవ్వరును నాకు హితులుగాని అహితులుగాని కారు. ఇదిగాకనే నొక్కఁడను ఆకాశమున కెత్తినంతమాత్రమున నిస్తేజస్కులు ప్రకాశవంతు లగుదురా? లేక తృణీకరించినంతమాత్రమునఁ బ్రకాశవం

తులు నిస్తేజస్కులగుదురా? ప్రాజ్ఞలోకమున నేదియో స్థిరడి యుండనే
యుండినది. ఇంతకును లోకమంతయుఁ బక్షపాత మయమై యున్నది
తారతమ్యజ్ఞానము పోయినది. సత్పాండిత్యమునకుఁ గాలదోషము పట్టి
నది. నేతి బీఱకాయలలోని నేతితో సంతర్పణములు చేయుచున్నారు
అయిన నోయధునాతనకవినాయకులారా! దైవపదార్థము తన విలా
సమును దెలిసికొనఁ దగిన ప్రాజ్ఞులను మచ్చునకైన నచ్చటచ్చటఁ డాఁచి
యుంచకపోలేదు. వాణియొకరిసొమ్ము గాదు. ముఖేముఖే సరస్వతీ, కా
ని, విభక్తిప్రత్యయజ్ఞానమయినను లేక నామశబ్దమైనను దెలియక
యొండురెండు తెలుఁగు పొత్తములు చూచి యందందలి ముక్కల నే
రితెచ్చి యతుకఁబెట్టుచునుండువారు, వ్రాయుటకుఁ బత్రిక లందుఁబా
టుగా నున్నవిగదా? యని ఉభయభాషా నిరాఘాట పాండిత్యమును
సంపాదించి యీ వ్యవసాయములోఁ దలలు చితుకఁగొట్టుకొని వ్రణకి
ణాంకదేహు లయి యున్న విద్యాకర్షకులను గుడ్డిగవ్వలక్రిందఁ దీసి
వేయుచున్నపుడు మానవసామాన్యవ్యక్తికి నూఱట గలుగదు. కా
వున నవధారుఁడు. ఎంత చచ్చు కవిత్వముఁ జెప్పఁ బూనినను అకారా
కారసకారాంత భేదములు, ధర్మధర్మి భేదములు, మున్నగు సామాన్య
విషయము లయినను దెలియ వలసి యుండెను. అందుకుఁ బంచకావ్య
జ్ఞాన మయిన నుండవలెను. అంతమాత్రపు శ్రమకైనను ఓర్వలేక తీ
రి కూరుచుండి యూరక తేరగా విద్యా ప్రాముఖ్యత సంపాదింప వలె
ననెడు దురాశచే వికటనాదములు చేయుచు బొల్లి కవిత్వములు చె
ప్పుచు వాణీప్రసన్నుల గడ్డి పఱకలవలెఁ దీసివేయు చుందురేని అట్టి
వారి ముక్కులు పిండి తద్రుధిరబిందువులచే భూదేవికిఁ దర్పణము చే
యుటకై సజ్జీకృతాంగుళిపుటులు కొందఱు అప్రమత్తులయి యున్నార
ని యిప్పటి యనఘసత్కృత్య ప్రసవలాభాభిలాషు లెఱింగి యుండ్రుగా

క. లజ్జ యనునది నిఘంటువులలోనైన దర్శన మిచ్చునుగాక. "మహారాజ సుతావాపి న సాక్షే— వినా" మహారాజసుతశ్చాపి న కవిః పాండితీంవినా.

(1914 సం॥ జనవరి అభినవసరస్వతినుండి.)

## నీతిబోధ.

మనోరంజనీపత్రికాసంపాదకుఁడగు ...... రావుగారు తమ మృషావచనంబులు గుంటూరునీమ, ఆర్యమతబోధిని. సుదర్శిని, పత్రికలలోనవి శేషముగఁ జప్పింపఁబడుటాది, కనిపోకమనిఁబూసికొనినట్టుబ సరసముగుమార్గమున విమర్శింపఁజాలకకెకసు వాక్యయముఁజేయుచున్నారు......పత్రికలో మూఁడువాళ్లు తెల్లుతప్పుమజేయేమికానవచ్చుటలేదు......వీరికిసద్బుద్ధి గలుగునా దనేకులు గలరు గాని వారు కులాభిమాను లని యపలాపింతురేమో యని మతాంతరుల(వైష్ణవుల)ముగు మేమే వీరి కీవిధమున నీతిగఱపుచున్నారము......

క॥ మునుబ్రహ్మద్వేషంబునఁ। జనినాఁడవుకొన్నినాళ్లు సత్యంబును గ
న్గొనఁజాలక నేఁడకటా। ఘనుఁ దిరుపతివెంకటేశు గర్హించెదవే॥

ఉ॥ పత్రికచేతనుండెనని వ్రాయఁగఁబోకు మసత్యముల్ సదా
పత్రపహీన ధీవరులఁ బైకొనఁబోకుము చేతిమీఁదుగాఁ
గృత్రిమముల్ లిఖింపకుము కింకవిమత్తగజేంద్రసింహము లో
కత్రయభాసమానవర గర్జితముల్ విని మిన్న కుండుమా॥

చ॥ తెలిసియు నిద్రఁబోవకుము దేవుఁడొకండుఁగలాఁ డటంచు చెడగా
దలఁపుము పుణ్యపాపముల ధ్యానముఁజేయుము కూలికిన్ విసం
బెలమినిఁ గ్రోలఁబోకుము కవీశ్వరవైరముదాల్పఁ బోకు మీ
తెలివిడిఁగూర్చుముమ్ముఁ బడఁదిట్టకుమయ్య? గుణంబెఱుంగుమా॥

శేషాద్రిరమణకవులు.

మునుపు 'దర్బారుపత్రిక' చాల నవ్యక్తముగాఁ బ్రబలపించుచుండెడిది, కర్మ వశమున నది యంతరించినది, పదపడి దానిభారమును వహించి నియతముగా బ్రోఁగుచున్నవి 'హితకారిణీ' మనోరంజనులు, వీనియందలితప్పుడు ప్రసంగము నకు రోసి కొందఱు ప్రాజ్ఞులు మందలింపులను వ్రాసి ప్రవర్తకుల పేరనే పంపుచుండి రఁట! కాని వానినిగూడ స్వీకరింపవలసినభార మీపత్రికల కుండుట న్యాయసిద్ధ మైనను నివి *స్వీకరించుట లేదఁట!, సోదరపక్షీయులు దేనిని, తి॥ వెం॥ కవులప క్షపుఁబత్రికగా నపలపించుచున్నారో, ఆయభినవసరస్వతిగూడఁ బ్రచురించుటలే దఁట! హితకారిణీమనోరంజనులలో నేయే పేరులతోఁ దప్పుడుప్రసంగము వెలువడు చున్నదో, అందుఁ గొందఱయోగ్యతను నిర్ణయింపఁ దగునంశములను లోకమున కుఁ దెల్పినచో వారివ్రాఁతలతత్త్వము తెలుపకయే బోధపడవచ్చునని యెంచి కొం దఱట్టిసందర్భములను దెల్పుచుఁ గడు మృదులముగా వ్రాసిపంపుచువచ్చిరఁట!, వ్రాసినవిషయములు యథార్థము లనుటకు లవమును సందియము లేదఁట! అందుల కితరులసాక్ష్యము లక్కఱయే లేదఁట! ఎవరినిగూర్చి వ్రాసిరో వారే యొప్పుకొనఁ దగియుందురఁట! ఆయాసంగతులు పదిమంది పెద్దమనుష్యులు గలవివాహపుసభలు లోనగుప్రదేశములకు సంబంధించినవి కాని పరమరహస్యములు గావఁట! అట్టి బహిరంగసందర్భములను గూడ నభినవసరస్వతి ప్రచురించుటకుఁ గొంకి 'యేకర్త నుసిప్పన్న నదియే కాలు నని యుపేక్షించుచున్నదఁట!, వ్యాసప్రేషకులీతత్త్వ ము 'నెఱుఁగక మా పేర వానిని బ్రకటింపవలసిన దని ప్రార్థనాపూర్వకముగాఁ బంపుచున్నారు. సత్యనిర్ధారణాతత్పరు లగున వ్వారికి మాకృతజ్ఞతాపూర్వక నమస్కారముల నర్పించుచు గ్రంథవిస్తరభీతిచే నవ్వారివిపులవ్యాసములను వద లి యయ్యనఘుల నామములలోఁ గొన్ని మాత్రమిట నుదాహరించుచున్నారము.

(1) చింతామణిరాజగోపాలకవి (2) చేపూరి లక్ష్మణకవి, లోనగువారు

వీరిలోఁ గొంద ఱభినవసరస్వతియం దారోపించినదోషమును దెలుపఁ దగు

---

*'...దీనిని హితకారిణికిఁ బంపించియుంటిని. కాని యది ప్రచురపడలేదు. తిరిగి వ్రాయలేక యీచిత్తునే తమకు పంపించితిని. చిపుకుల అప్పయ్య.

☞ ఈయన దేని మాకడ నంపెనో దానిని విస్తరభీతిచే వదలితిమి,

నుత్తరములలో నొకటి రెండిట నుదాహరించెదము.

"అయా... రావుయిదివరకుతమనోటీసులోనికివచ్చినవాడె. యీతడు మూఁడుల్లెటూళ్ళలో మిగుల గప్పాలుకొట్టుచూ వారనగనెంత వీరనగ నెంతయనుచుండును. ఇట్టివానికి నేటికితగిన ప్రాయశ్చిత్తము జరిగినది. యీసంగతి పత్రికాముఖమున నెల్లరకు నెఱిగించుట సర్వోత్తమమ ని నాయభిప్రాయము ... పట్టాభి రామశాస్త్రిగారు యిట్టివిషయ లలో శ్రద్ధవుచ్చుకొనరు. అనేక పిచ్చిపత్రిక లీకాలమందు ఓంకారం గురవరాజు మొదలగువారి పిచ్చివ్యాసములచే నిండుచున్నను ... అభినవసరస్వతి సాహసింపకున్నందులకు చింతిల్లుచున్నవారము. యీ గాథను...తమ గుంటూరు సీమయందుగాని ప్రచురింపబార్థించుచు చున్నాను. చేపూరి లక్ష్మణకవి 6-2-14

---

"చింతామణిరాజగోపాలం వ్రాసుకున్న విజ్ఞాపన ......ప్రస్తుత కాలమున గాకవులెందరో తమయశస్సునకు లోటుగలిగింపయత్నించి నోటికివచ్చినయట్లు పత్రికలలో గీకుచున్నారు అట్టిపిచ్చివ్రాతలనేని బె రుగనిచ్చు టంత మంచిదిగాదనుట జగద్విదితమేకదా. కావునటువంటి త ప్పుడువ్రాతలకు మీరు జవాబు నొసంగుట సమంజసము కాదు గను కనన్ను బోట్లందులకు తగియుందురుగదా? యీసంగతినెరిగియో యెరుగ కయో పట్టాభిరామశాస్త్రిగారేదేని వ్యాసమునుగాని, పద్యములను గాని, సహేతుకముగ వ్రాసి పంపినను ప్రచురింపకమిన్నకొనుచున్నా రు. అందుచే హితకారిణి, మొదలగుపిచ్చిపత్రికలకు జవాబులు రాక నిలవయున్నవి. యింతయేల యీమధ్య......గారికి ... వలన కలిగి నవరాభవమును క్లుప్తముగా వ్రాసిపంపుకొనియున్నాను. అదియే మగునో తెలియదు...,, చింతామణిరాజగోపాలం 14-1-14

పత్రికయనఁగా వివేచనాజ్ఞానము కలదియే గాని యన్యము కానేరదు, ఆంధ్ర, కృష్ణ, సువర్ణరేఖ, లోనవైనవి మొదట నీశాఖాభిమానులతత్త్వము నెఱుఁకరో, అభిమానులలోనిపురుషులలోఁ గొందఱు కార్యస్థానముల నుండుటంబట్టియో మోసపడి పదపడి కన్నుఁదెఱచి యిప్పు డిప్పు డీగోడవనుండి విరమించినవి, కాని విరమించునప్పుడు నైపత్రికలలోఁ గొన్ని చాల నయుక్తికముగా విరమించిన వని వ్రాయక తప్పదు, ఆయాసందర్భము, వేమవరపుపీఠికలో వారివారిస్వహస్తలిఖితములగుజాబులవల్లనే తెలిసికొనవచ్చును, అదియటులుండె, ప్రకృతము

క॥ ... మఱియెఱిఁగి యెఱుఁగనేరని, కఱటిం దెలుపంగఁ గమలగర్భునివశమే॥ (భార- ఆది- ౪ ఆ॥)

అనుతెఱఁగున వర్తించుపత్రికలరీతిం దెలుప నందలివ్యాసమొకటియే నుదాహరింపక "నీటిలో గేదెను బెట్టి బేరము చెప్పుట యుక్తము" కాదని స్థాలీపులాకన్యాయమున నాయయుక్తప్రసంగము కొంచెము దాహరించి చూపుచున్నారము.

(1914 సం॥ 4-11వజనవరి తేదీల హితకారిణీ నుండి.)

...మరినాల్గు దినములకు కవుల కంకణముల పభజరిగెను. ముతకసామ్యచండంబున "ఎక్కడో కొడితే ఎక్కడో రాలినవన్నట్లు" ఎక్కడ వేమవరఁ? ఎక్కడ గుంటూరు? ఎప్పటి అవధానం! ఆహా గుంటూరుసీమను పడతిట్టిన దిట్టకవులకు తిర్గి గుంటూరునందు నిట్టికంకణములు దగిలించుట చిత్రము, చివరకు ఋట్టి గుంటూరేదిక్కయ్యెగా యీకవులకు!.....అనగా దీనికంతకు కారకులు గుంటూరు వైదికోత్తములు గొందఱని యూహింప నగును. ఈరోజులలో ఒకచిన్న పిల్లవాడైన ఒకపనిని చేస్తే 'థ్యాంకుయు' అన్నట్లు ఉ- ఊ అంటె మెడల్సు, కడియాలు, గాజులు, ఉంగరాలు, తాలిబొట్లు, మున్నగుబహుమానాలు. పూర్వకాలంలో యెంతో గొప్ప పండితుడైతే దుస్సాలువలు బహుమానం యిచ్చేటప్పటికి యెక్కువ. నక్షత్రికుడు.

ఏ నక్షత్రకుఁడో' యేదియో వ్రాసెనే యనుఁడు ఇందేమి స్పృహణీయము

గుణలేశమున్నది ఇంతనక్షత్రకుఁడింకను నెంతో*సోదె వెళ్ళఁబెట్టెను అది యటులుండె, ఏమైనను "హితకారిణి" ప్రచురించు నితరవ్యాసములకన్న భాషావిషయమగు నికృష్టతలో నిది చాల మెఱుగు, ఎట్టిబాధ్యతఁగూడ లేని యిది ప్రచురించెడి ననురహస్యమునీ'నక్షత్రకుఁ' డెఱుఁగఁడని తలఁచెదము, లేనిచో నితఁడింతవ్యర్థవుగా వ్రాయఁడు, మఱియు నీవిచారగ్రస్తునివిచారమును బ్రచురించిన నాఁటిహితకారిణి"యే వేఱొకట నీకిరివి యక్కరములను బ్రచురించినది.

ఈ నెల 18 వ తేది రాత్రి 8న్నర గంటలకు శ్రీరాజామంత్రి ప్రగడ భుజంగరావు బహద్దూరువారి జ్యేష్ఠపుత్రికకు... పాణిగ్రహణ మహోత్సవము జరిగెను......సోదరకవులకు మణిఖచిత స్వర్ణపతకములు చెఱియొకటి శ్రీరాజాగారొసంగిరి. . . బిరుదమునిచ్చిరి,

'నక్షత్రకుని' తుట్టతుదివిచారమిా'సోదరుల' బిరుదప్రదానాదులకుఁదగులకుండుఁగాక, అదియటులుండె, నీహితకారిణి, ననుసరించి మేము నవరింప వల

---

## గుంటూరు గుబగుబలు. సానిపాట, కవులు

*ఈ నెల 16 తేది రాత్రి 9-30 గంటలకు బెంగుళూరు నాగరత్నం పాటకచేరి జరిగి యుండెను......ముందుకవులకు గంకణాలు తగిలించి తరువాత రాత్రి సానిపాట అని అనుకున్నారట. కాని యేకారణమువల్లనో ముందుపాట జరిగినది. 20 తేదీని కవులకు కంకణముల బహుమానము జరిగినది. రాత్రిసానిపాటకు కవులు హాజరైరి......అదిగాక యొక చక్రాని సిద్ధాంతమును వెలిబుచ్చిరి. సానులు వివాహమే చేసుకొనినచో జనులకిట్టి యానందమెట్లు కలుగునని యందున సానులు వివాహము జేసుకొనక యిట్లుండవలెననియు దీవించి మరీ కూర్చొనిరి. ఆహా! ఎంతనీతి కోవిదులు......ఇంతకు "మాలాటి వారు లేరు" అనేగర్వంయున్నంత వరకు సత్యము(తి॥ వెం॥ల) కనులకు గోచరముకాదు....,,

☞ నక్షత్రకుని ప్రలాపము దిఙ్మాత్రము చూపఁబడినది, ఈ ప్రలాపమునకు నాఁటి గానప్రశంసాపద్యములకును గలసంబంధమును వివేచకులునిర్ణయించుకొందురుగాక యని నాఁడు మానొడివినపద్యము లీక్రింద నుదాహరించుచున్నారము.

సిన దొకటి కలదు- పూర్వరంగపీఠిక 2 వ పుట 3 వ పంక్తిలో —

'తిరుపతివెంకటేశకవిఖీకులఁ జెల్వద మిమ్ముఁ దెల్పెదన్,

అని సవరించుచున్నారము, ఇంతకన్న. హితకారిణీమనోరంజనులలో గణిం పఁదగినయంశమించుకయుఁ గానరాదు, పూర్వరంగము 54 వ పుట 25 పంక్తిలో

వేమూరి నృసింహశాస్త్రి. శతావధాని,

అని సవరింపఁదగుఁ, ఆంకులకుఁగల బీజ మీక్రిందియుత్తరము తెల్పును.

"శ్లో॥ కేచిచ్ఛ్రీపతివెంకటేశ్వరకవి ... గురుతాహేతూకపీసంశ్రియే॥

శ్లో॥ తెనాలిపుర్యాం శివరామశాస్త్రి, ప్రదర్శితే సాధు శతావధానే।
అకీరచం పద్యమిదం సభాయాం, ప్రశస్తిపద్యే ష్వతిహృష్టచిత్తః॥
వేమూరి నృసింహశాస్త్రి, శతావధానీ

'హితకారిణి'లో నంతమాత్రమేని గణింపఁదగినయంశము కలదు గాని 'మనోరంజని' లో లవమును గానఁబడ లేదు, దానిపోకడలు కేవలకుతంత్రములకుఁగాఁ బాటుపడుచున్నవి- ఆయంశ మీక్రిందిపంక్తులు తెలుపఁ గలవు.

(15జూలై 1913 సం॥ మనోరంజనినుండి)

"...చూడలేదా- గుంటూరు సీమ మొదటనే నియోగు లందఱు స్త్రీలనియు, వైదికులందఱుఁ బురుషు లనియు, దమవెఱ్ఱిధోరణిం గొంత బయటఁ బెట్టుకొనిరి. . ."

ఇదితనవలెఁ దెల్వితక్కువగా శాఖాభిమానమును వినియోగింపని సహృదయు లగునియోగిశిఖామణులకు 'పుల్లింగములు' పెట్టుతలఁపుతో వ్రాసినవ్రాఁత,

---

శా॥ గానంబున్ వినునేర్పె కాకనదు నాగస్త్రీలకుఁ గానవి
ద్యానైపుణ్య మటంచుఁ జెప్పికొనువార్తల్ మాపఁగాఁ బుట్టె నే
దో నాగాంగన యంచు లోపలఁ దలంతు న్నిన్నునీగానవి
ద్యానందామృతవార్ధిలో మునుఁగునార్యశ్రేణి నాగాంగనా. ౧

తే॥ గీ॥ స్వరము రాగమ్ము పురుషుల నరణిఁ దోఁచు
మధురిమము పూవుఁబోఁడులవాద్రి నొప్పు

భవతు, వ్రాయఁగాక, నియోగివైదికులయైకమత్యమును బోధించుచు సాక్షాత్పరదేవతనుగా నియోగులను సంభావించిన యుపమానకల్పమునం దేదో దుర్ధ్వని నాపాదించుచున్న యీపత్రికగాని వేఱొకటిగాని యీవిషయమున కంతకన్నఁ జక్కనియుపమానమును సేకరించి చూపినచో మే మద్దానిని శిరసావహించి దిద్దుకొనుచున్నారము, 'ఆ'. అంటే అపశబ్దము 'ఊ' అంటే, ఉపశబ్దము, నారాయణా, అంటే, బూతుమాటయనుగాఁ బ్రసంగించుజ్ఞానలవదుర్విదగ్ధునిశంకయగుటచే

---

చాటుగా నాగరత్నము పాటవిన్నఁ
బురుషుఁడో లేక కాంతయో యెఱుకపడదు. ౨

ఉ॥ పాడుడు రెండవఱో యెటులు పాడినను౯ "మగవాని గానమున్
జేడెల నంస్కృతంబును రుచింప,,వటంచు వచించె మున్న 'నే
వాఁడల శూద్రకుం డనృతవాదిగ నేఁటికిఁదోఁచకున్నె? పూఁ
బోఁడులు నాగరత్నమును బోలెడువాం డ్రుదయింప కున్నచో. ౩

శా॥ పెండ్లాడన్ వలె వేశ్యలందరకటా! పెక్కండ్రు రీజాతికిన్
బెండ్లిండ్లే యగుచో సుధామధురిమ వ్రీడాకరంబౌనటుల్
చెండ్లంబోలు స్వరంబులన్ వినరుపాళిన్ రాగముల్ వాడుపూఁ
బోండ్లన్ జూచుట గల్గునే సభల నెప్డున్ నాగరత్నాదులన్. ౪

చ॥ అచలశిరమ్ములన్ జలవ మందఁ దొడంగెడి" నాగరత్న" మన్
విచికిలగంధి గానపుఁ బ్రవీణత, కన్యనిమిత్తమై సదా
ప్రచలనమందు శీర్షములపాటులు వాకొననేల? నద్వచో
రచనకు నట్టి గానపుభరమ్మనకు౯ జగమెల్ల నూఁగెడిన్. ౫

ఉ॥ "రాగము లేదు నా" కను విరాగి మనమ్మునయందు సైతమున్
రాగము పుట్టఁ జేయునదె రాగము రాగిమనమ్మునం దెటో
రాగము పుట్టఁ జేయునది రాగమె?,, యన్ వివరం బెఱింగి తా
నాగమణీగళంబు గలనాదము లీనె మనోహరమ్ముగన్. ౬

తిరుపతి వెంకటేశ్వరులు.

'ఛందానురోధమున, నుత్తరింపఁబడియె, తగిన సహృదయు లెవరేని యడుగుచో *సాం
ఖ్యమతానుసారమునఁగాని, ‡దేవీభాగవతరీతిచేఁగాని, §ఆలంకారికమత సందర్భ
మునఁ గాని, యియ్యెడ వ్రాయవలసిన ప్రమాణములు చాలఁ గలవని విజ్ఞులరయు
దురుగాక- పనిలోఁ బని మనోరంజనీ, హితకారిణులించుక యుత్తర మీఁదగినద
ని తలఁపఁ దగు నేయొక విషయమును గూర్చి బుకిక్రించినవి. అదియీక్రింది సందర్భ
ములవలనఁ దెలిసికొనఁదగు,

(పరిషత్పత్రికనుండి.)

పరిషత్పత్రికాపాఠకోత్తములారా!

2సంపుటము 2సంచిక చిట్టచివర నాపద్యములలో

(1) "అష్టభాషలకు" అను సీసములో గీతి తక్కఁ దక్కినది "సర్వశూన్యశతకము" నుండి యనువదింపఁబడినదని యెఱుంగవలయు ...

దివాకర్ల, తిరుపతిశాస్త్రి.

(1913 వ సం॥ నవంబరు నెల 1వ తేదీ సుదర్శని పత్రికనుండి.)

"మీ "రోజు మంచిదని- పట్టపగలే కన్నమా" అనుస్థూలదృష్టి వ్యాసమునుజూచితిని. అందు మీరు "నాయీసంశయమును నివారింతురుగాక" అని చదువరులను గోరుటయెగాక తుట్టతుద నన్నుద్దేశించి కొంత వ్రాసియున్నారు . . . "అష్టభాషలకు" అను పద్యము సర్వశూన్యశతకములోనున్నను అది తిరుపతి శాస్త్రిగారికవిత్వమేను. మున్నాటికి వారిదేను...". ఇట్లు, (Sd) కృత్తి వెంటిగంగరాజు.

---

*(1)అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీంప్రజాం జనయంతీగ్ంసరూపామ్॥

‡(2)శ్లో॥ బ్రహ్మాదయస్సురగణా నతుకిం యువత్యః...శ్లో॥ త్వంనాఽపుమాన్ నచ పుమాన్......(దేవీ-౧- స్క-ం) శ్లో॥ నాఽహం స్త్రీనపుమాంశ్చాహం నక్లీబం......(దేవీ-౩ స్క-ం,)

§(3) తద్భిన్నత్వేసతి తద్గతభూయోధర్మవత్త్వం సాదృశ్యమ్॥

ఇతరులదిగాని, తనదిగాని, యన్యత్రాక్షిప్తమైన దానిని నేనెన్నఁడుఁ జేకొనంగ గ్రహించుట *యనువాద మనఁబడును. ఇందులకు 'కాళిదాసు తిక్కన' లోనగు మహాకవుల ననేకులఁ బ్రమాణముగాఁ జెప్పనొప్పును. అదియటులుండె ఇతరాధీనము చేసినపద్యమును మరలనాత్మసాత్కరించుటమాత్రము తప్పు గాదా. అని యందురేని, ఆదోషమునకు మేమిప్పటికిఁ జిరకాలముక్రిందటనే పరిహారమును వ్రాసియున్నారము చూడుఁడు

(1908 సం॥ లో వచ్చియున నానారాజసందర్శనపీఠికనుండి.)

(పంక్తిఁడుదెడి) యనునది. 2వ పేజీలో పన్న త్కృతి యయ్యెను నితరకవి కృతమని విధిగామిమ్ముభ్రమింపఁజేయునవికలను. దానింగూర్చి వ్రాసిన గ్రంథము విశేషించి పెరుఁగును గాన పద్యాది యన్యత్కృతమే 'యనియును నితరకవికృతమైన గ్రంథములో మేమే పూర్వముదానిని సంస్కరించునప్పుడు కృతినాయకుఁడందులకు నిందులకు నొకఁడేయగుటచేఁ జేర్చితిమనియుఁ జదువరులూహించి మాపద్యమును మేముతిరిగియుఁ బుచ్చికొన్నందులకు దత్తద్రవ్యాపహరణదోషమునే మాయందాపాదించి గ్రంథచౌర్యదోషము నాపాదింపకుండఁ బ్రార్థితులు.

ఈపంక్తు లిప్పటికి 6 వత్సరములక్రిందట వ్రాసినవి. గాని నేఁటివి కావు ఈసంప్రదాయముంబట్టియే మా'గురుదక్షిణ' 7 వ పుటలోని

సీ॥ మొదలంటనడుగంటిమూలమూలల''నుండు వేదశాస్త్రమ్ములువెలికివచ్చె॥

అను సీసపద్యము, శ్రీకృష్ణాపత్రికవారి కవిత్వము కాక మాకవిత్వము కావలసియుండును, అష్టభాషా''పద్యమువలెనే మొదలంట, పద్యమునందును నిటీవలగీతిమార్పఁబడినది ఆయీయంశమునకు 28 అక్టోబరు 1910 సం॥ తేదీ కృష్ణాపత్రిక చూడఁదగు, ఇంతవఱకుఁ దెలిసికొనఁనంతటి తెల్విలేటలు భగవంతుఁడీయనియప్పడాయాయీమాని నెట్లు ప్రసంగించినను దప్పలేదు గాని యిట్టివారల వ్రాఁతలకుఁ బ్రత్యుత్తర మిడుటమాత్రము మాది తప్పు కాక పోదు, ఆతప్పు సోదరులతోడి

---

*"సిద్ధస్య కథన మనువాదః"

వాదిప్రతివాదిభావముకన్న నెక్కుడుమది కాదు, దాని కెవరు సమ్మతించుచున్నారు, ఎవరీనడింపకయున్నారు? ఎవరు విచారించుట లేదు? చూడుడు.

ఉ॥ కొప్పరపుంగవీశ్వరులకుం గలహాండితి తెల్లమయ్యె మీ
రిప్పనిఁ బూని వారల జయించెద మంచు వచించుటెంతయుం
గొప్పయుఁగాదు దీటయిన కోవిదుతోఁ గలహంబు సేసినన్
దప్పని చెప్ప రేరును ఘనం బగు నయ్యది వెంకటేశ్వరా॥

ఓకొప్పరపు సోదరకవులారా!

మ॥ అరరే, దుర్మదపూరపూరితమహాహంకారహుంకారని
ర్భరతుండాహతిపీడ్యమానసుజనవ్రాతక్షమాజాతనీ
చరటత్కాకవిమత్తసామజశిరస్సందనిర్భేదకే
సరులౌ తిర్పతివేంకటేశ్వరుల మీసాల్ పీక మీశక్యమే॥

మ॥ కలరే, గర్హితకాకవిత్వకలనాకౌశల్యదుష్పాండితీ
చలదార్భల్యవిశీర్ణ బాలతృణసీచగ్రాసదుర్జీవనా
ప్తలఘుప్రాణకుమార్గగామికుకవి స్థాయత్తురంగాళికిం
బులులౌ తిర్పతివేంకటేశ్వరులతోఁ బోరాడువా రిద్ధరన్॥

మ॥ అవురా, నిస్తులసత్ప్రశస్తిఘనవస్త్రాలంకృతామోదని
త్యవిరాజత్కకుబంగనావితతిధైర్యస్తోత్రపాత్రప్రథా
సవిధస్థానవిరర్గళప్రకటభాస్వత్సత్సభాశోభిస
త్కవులౌ తిర్పతి వేంకటేశ్వరులతోఁ గాల్ ద్రవ్వువార్ మీరలే॥

మ॥ నిమిషానేకవిధప్రబంధరచనానిర్నిద్రవిద్వత్సమా
జమనీషాప్రియసద్రసప్రథితశశ్వచ్ఛుంభదత్యార్భటీ
ప్రముఖాలంకృత సత్కవిత్వవిలసత్పాండిత్య గాంభీర్యదు
ర్గము లౌతిర్పతివేంకటేశ్వరు లనఁగా దోమలై తోఁచిరే॥

మ॥ సతత ప్రస్ఫురదాంధ్రసంస్కృత కలాసందర్భవిస్తీర్ణన
త్పరితిభాశక్తివిమోహితప్రతిభటవ్రాతప్రభావాన్యలం
కృతవిద్వత్కవి మూర్ధరత్న నుతసత్కీర్తిస్ఫురన్మాన్యప
ద్మతులా తిర్పతి వేంకటేశ్వరులతో మారాడనోరాడునే॥

శా. చండీసత్కరుణారసాప్త కవితాసామ్రాజ్యధౌరేయతా
ఖండైశ్వర్యయశోభిమండితదిశాకాండ ప్రచండార్భటీ
పాండిత్యాశనిపాతసాధనరిపువ్రాతాద్రినిర్భేదనో
ద్దండుల్ తిర్పతివేంకటేశ్వరులు వాదంబేటి కవ్వారితోన్.

కరవది　　　　　　　　　　　　పిసుపాటి చిదంబరశాస్త్రి.
ఒంగోలు　　　　　　　　　　　　　　　　శతావధాని.

క. అనుపద్యంబులవేగన్, ఘనదీర్ఘసమాసకంబులతో నేఁ
బనిచితి వారలకడకున్. బనిఁబూని లిఖింపరైరిప్రత్యుత్తరమున్.

చ. కవియనన్నట్టి డో యతనికార్యము దేమొ యతండు దేనినిం
దవిలిపఠింపఁగా నగునో తత్క్రియేమొ వచో విశుద్ధి యెం
తవఱకు నుండఁగావలెనో దాని నెఱుంగని యట్టివారలన్
గవులనిచెప్పుచోఁ గవులుకానిజనుల్ జగమందునుందురే.

క. తెలిపితిమీకీసంగతి, నలఘుయశోభాసురా!యిదంతయు నీలో
పలకుందెలిపెదరనియెం, చిలలిన్గ్రహియింపుఁ డీవిశేషములిందున్
　　　　　　　　　　　　　　　పిసుపాటి చిదంబరశాస్త్రి.

(జనవరి 1914 సం॥ అభినవసరస్వతినుండి.)

సుకవిరిపుకపోలచపేటము.

ఇంచుమించు నాలుగుసంవత్సరములనుండి శ్రీ తిరుపతి వేంక
టేశ్వరకవులమీఁదికిఁ గొందఱు పండితంమన్యు లొంటికాలిపైన లే

చుచున్నారు, అందగ్రితాంబూలపువారు గీరతకారయితలు, తరువాత వారు గుంటూరుసీమలోని కథానాయకులు, అటుపిమ్మటవారు పైవారల ననుకరించువారును,......శ్రీ కవివరులపై నిపుడు మన్యులు కాలుద్రివ్వుటను గుఱించి పూర్వ మెన్నఁడో తాతలకాలమునఁ జేసిన వీరిదిగ్విజయసమయమున నంతపాటివా రెవ్వరు లేమిచే నెటో కనులుమూసి గంతకట్టి యశముపడసిరనియు నిపు డెందఱో మహానుభావులువిలసిల్లుటచే వీరియాట లెంతమాత్రమును సాఁగిరాకున్నవనియుఁ గొందఱభిప్రాయపడుచున్నారు. కాని ప్రకృతపు మన మన్యులవలె శ్రీ కవివరుల దిగ్విజయసమయమునందలి పండితశౌండులు స్వశక్తి నెఱుంగక "యేనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషోభవే" త్తను శ్లోకప్రమాణానుయాయిమండలిలో గణింపఁబడి బుధజనపరిహాసయోగ్యత నిచ్చగింపక గౌరవపరిరక్షణము గావించుకొనినసంగతి వారు (పై విధముగ నభిప్రాయపడువారు) గమనింపలేకపోవుట శోచనీయమని వ్రాయవలసివచ్చినందుకుఁ గష్టముతోఁచుచున్నది......శ్రీ కవివరులవలని పరాభవముసహితము గ్రంథస్థమై శ్రేయోదాయకమగుటంబట్టి మన్యుల కెట్లుచూచినను లోటుగలుగదు......ప్రస్తుతపు మనవృథామత్సరగ్రస్తులచారిత్ర మెంతవ్రాసినను లేఖకులకు విసువు పుట్టవలసినదే కాని యెప్పటికినిఁ దుదముట్టునట్లు తోఁపదు. కనుకనిఁక నొకపద్దెమునుమాత్రము వ్రాసి మాలేఖిని కొంకింతవిశ్రాంతిగలిగింతుము.

సీ॥ భట్టవశ్యులలోన దిట్టయౌ నన్నయభట్టారకున కాదిఁ బుట్టువొంది
చాళుక్యవంశసంజనితుఁడౌ రాజేంద్రుతోఁ రంపుముంగిట దోఁగియాడి
అలకృష్ణదేవరాయలవారిసభలోనఁ దకదింధిమంచునృత్యం బొనర్చి
తంజాపురీశునాస్థానమంటపమందు మంతుకెక్కఁగఁజాల ఱంతుసల్పి

గీ॥ ఇఘ్నుడుకింక విదంతిమృగేంద్రులైన, సరసతిరుపతివేంకటేశ్వరులయిటఁ
బీటవెట్టుకనూర్చుండెఁబృథులహావ, భావరసపేటినత్కవితావధూటి

సికింద్రాబాదు }
8-7-1913 }

ఇట్లు,
చివుకుల వేంకటాచలశాస్త్రి.

మామాతారతమ్యము నెఱుఁగని వారెవరు, మాకుఁ దెలియకున్నను నితరులకుఁ దెలిసియే యున్నది ఈక్రిందివాక్యములు గూడఁ దిలకింపుఁడు.

(1) హితోపదేశము.

కొప్పరపుకవులు నియోగులైనందున్న శాఖాభిమానముచే గొందరుకల్పించిన కారణమువల్ల యీ రెండవకలహమునుకలిగినవనిప్రతిమనుజునకును తెలిసినయంశమే...పండితకవులలో అద్వితీయులని ప్రఖ్యాతిగాంచి...బ్రి॥ తిరుపతి వెంకటకవులుసంపాదించినవిశాలమైనకీర్తియే యితరులకు కన్నెర్రజేసి యిట్టికలహములకు కారణభూతమైనది, నియోగిశాఖాభిమానులు న్యాయవివక్షతలేకనే సోదరకవులను పురికొల్పి అదివరకు వారికి బ్రి॥ తిరుపతివెంకటకవులయందున్న భక్తివిశ్వాసములను విడనాడజేసి దుఃఖభాజకములగు ఇట్టికలహములు కలుగజేసి వంశములకెంతయు చింతింపవలసియున్నది ... లేనిపోనిద్వేషములను మనసునందుంచుకొని పండితతిరస్కారమునకు పురికొల్పుట మిగుల సాహసము. దేశానర్థదాయకము, పరిహాసాస్పదము ... పండితులైనవారు వైదికులయిననేమి నియోగులయిననేమి మఱియొకశాఖవారయిననేమి. . .కావున ఓనియోగి సోదరులారా? మీశక్తియంతయు కేవల దుఃఖాస్పదమయిన యీనిష్ప్రయోజకపు కలహములయందు వ్యర్థపుచ్చక దేశహితార్థము వినియోగించగలందులకు త్రికరణశుద్ధిగా మిమ్ములను వేడుకొనుచున్నాను కలహముల నుపసంహరింపుడు నిష్కళంకమైన మనములతో విచారింపుడు దోసములున్న క్షమింపుడు.

జగ్గయ్యపేట. ఇట్లు, హితముగోరు,ములుగు, సుబ్రహ్మణ్యం.

. . అట్లుగాక తారతమ్యవిచక్షణవిడనాడి . శాఖాభిమానము మొదలగు కొన్ని వైషమ్యములను మనసునందుంచుకొని తిట్లకు మొదలిడి తమకేమో గొప్పసంఘబలమున్నదని భావించి తగవునకు సిద్ధముగా నున్నట్టియు పాండిత్యమునందుతగుపాటి సామగ్రిలేనట్టియు శ్రీకొప్పరపుసోదరకవులతో జరుగుచున్న తిట్లతో కూడినచర్చవల్ల భాషకుకాని దేశమునకుగాని యెట్టిలాభమును లేదని నాతలంపు యీకొప్పరపువారు గురుకులవాసముచేసి పాండిత్యము గడించియుండలేదనుసంశయమందరకును విశదమె కాని వారియందభిమానముగలవారు మాత్రమువారియందెక్కువగణ్యతను తెచ్చిపెట్టుటకు తమశక్తికి మించినప్రయత్నము చేయుచున్నారు యింతమాత్రమునవారికి లేనిపాండిత్యమును గొనితెచ్చెదరా . . వారికున్న పాండిత్యమునకు తగుగౌరవము నిల్పిన నంతెచాలును , . బ్రహ్మశ్రీ తిరుపతివెంకటకవులతో అకారణముగా తమసితి తామెఱుంగక కలహమునకుదిగుటచూడకొండతో డీకొననెంచు గొర్రెపోతుచందము జ్ఞప్తికివచ్చుచున్నది సంఘబలముండిన నుండుగాక యిదేమియన్యాయము యిందులకుకారణముశాఖాభిమానుల ప్రోత్సాహమే,వారుప్రోత్సహింతురుగాకవీరేలసమ్మతింపవలెను . . . వారిపేరు లడుగువారెవ్వరు . . .

జగ్గయ్యపేట 4-7-13. శ్రీ॥ వీరభద్రయ్యవార్లు.

వ్రాజ్ఞు లెఱుఁగనిది లవమును నుఁడదు, వారికాయాయాచరిత్రగ్రంథములతోఁ బనియే లేదు, కాని కొన్ని కారణములవలన వారుకూడ నంతరంగవ్యతిరిక్తముగా నడువ వలసివచ్చును. అట్టివారు మరలఁ దమయంతరంగముల నన్యథా వెలిపుచ్చుటను గూర్చి పూర్వరంగమున దిఙ్మాత్రప్రదర్శనముచేయఁబడినది- ఇట మఱికొందఱనుగూర్చి ప్రసంగింపఁబడుచున్నది- ఈయుత్తరముం దిలకింపుఁడు.

. . .“ అయ్యా, యిందుతో . . . సంగతులు కొన్ని . . . వ్రాసియున్నాను, . . . నేను వ్రాసినసంగతి ప్రమాణస్ఫూర్తిగా నిజమైనదిగా

ని...లలో కొందరివలె అభూతకల్పన కల్పించివ్రాసినవిగావు;అవసర మగునేని యీప్రస్తావము జర్పిన శ్రీ శాస్త్రిగారివల్లనూ, వెంకటసుబ్బ య్యగారివల్లనూవొప్పించెదను... కొప్పరపుసోదరులచే పిసపాటియందు జర్పబడిన సభయొక్క విషయములుకొందరివల్లనాకు తెలియబడి వాటి లోనిజమనినమ్ముటకు...వీలులేని...యాస్తుతులలోనినిజానిజములు తెలి యగోరియుండగా,కారణాంతరముచే నాటిసభకగ్రాసనాధిపతులున్నూ, అగ్రిహారీకులున్నూ. ఆధునికాంధ్ర మహా కవులున్నూ, సుప్రసిద్ధు లును నగు బ్రహ్మశ్రీ అమరవాది రామశాస్త్రిగారి నివాస గ్రామము గు బాలేమర్రి నేనువెళ్లి శ్రీ రామశాస్త్రిగారిని గూర్చి, అయ్యా. . . గనుకశలవీయగోరితిని, అనికోరగా, వారుధీవరులిటునుడివిరి,...అవుట వల్లనున్నూ, ఆసభజరుగుటకు మూలకారకులున్నూ, అప్పటిమా ఖండం...గున్నూనగు . . . పంతులుగారిప్రోత్సాహంవల్ల నేనాసభక గ్రాసనాధిపతిపదవి కొప్పితిని, . . . పండితులు అగ్రాసనాధిపతులు గానుండ దగినకవులు సోదరులుగారని నేను స్పష్టముగ జెప్పెదను- నే ను వారిని గూర్చి చెప్పిన . . . పద్యములుగూడా శ్రీ . . . గారి...వ ల్లనని యెరుగుదు, అని అనుచుండగా, అంతకుముందునుంచి అక్కడ కూర్చున్న వారిలోనివారున్నూ, ఆగ్రామాధికారులున్నూ, . . .న్యా యైకపక్షపాతులున్నూ, నగు బాలేమర్రి వెంకటసుబ్బయ్యగారిటునుడి విరి, «శాస్త్రిగారూ! నాటిసభ యందు సోదరులనుగూర్చి... పద్యములు చెపవొటకు మన సొగ్గకయూ, చెప్పకుండినచో బంధుమిత్రులమనసునొ ప్పింపజేసినవాడ నవుదునని యెంచి ఎట్టకేలకు . . . అనునర్థముగల ప ద్యములను జదివితిని . . . యీపద్యములు సోదరులు విని. . .తోను న్నూ వంశీకులతోనున్నూపోల్చిరేకానితమ్మునుగూర్చిపొగడలేదని . . యిదిగాకబ్రహ్మశ్రీ తిరుపతి వెంకటేశ్వరులకుసంబంధించు, అవాచ్యప్రసం

గములుసభలోప్రారంభించుటయేకాక వారి నేమోసాధించెదననియెదగు, . . . అనాదినుంచి హెచ్చుకు ఏనుగునున్నా తగ్గుకుదోమనున్నా పోల్పుటకలదు గాని వీరిపట్ల దీనిని కూడా వుపయోగపర్చుటకు తగదని నేను చెప్పెదను" యీసంగతులు బాలేమఱ్ఱి గ్రామములో బాలేమఱ్ఱి లక్ష్మీనరసింహంగారియింట్లో చర్చించబడినవనిన్ని యథార్థములనిన్ని నేనుచెప్పుచున్నాను,

కలవకొలను రామయ్య, వరపురామకృష్ణయ్య, యీనాందారు, పెదపరిమి, మకాం, కొండపటికెల్లు, నందిగామపోష్టు. కృష్ణాజిల్లా,

ది 20, November 1913.

వీరివలెనే బ్రా॥ శ్రీ॥ వేదము వెంకటరాయశాస్త్రులవారుగూడఁ దమయంతరంగమునొక సంపన్నగృహస్థునకు నెఱింగియున్నారు. ఆయంశమును దెలుపు నుత్తరము మేమిటను నుదాహరింప నసమర్థులము, లక్షోటావప్రశ్నగాఁజెప్పుచున్నారము, వారియంతరంగము వేఱు,ముఖ్యాటికిని. వేఱు, వేఱు, వేఱు, దీనినిటులుంచిశ్రీశాస్త్రులవారిమెప్పు నీక్రింద నుదాహరించుచున్నారము.

(1914 సం॥ జనవరి 8వ తేదీ కృష్ణాపత్రికనుండి)

. . . వేంకటరాయ శాస్త్రుల వారు చెప్పుటలో . . . అన్ని పద్యములును మిగుల బాగుగానున్నవి లోపములేకనుపించలేదు (ఉభయ భావలయందును) వీరికి కల సమర్థతను వెల్లడించుచున్నవి. . .

పైయక్రమములలో మిగుల సంశయింపవలసినది, మాచేఁ గుండలీకృత మగుభాగము, దానింగూర్చియే శ్రీ శాస్త్రులవారికి మున్నుదాహరించిన సంపన్న గృహస్థుత్తరమును వ్రాసినది, ఇంతవఱకు నడచినప్రసక్తియెల్ల మేమెఱింగినదియే ఇట్టిప్రసక్తి కిడినప్రత్యుత్తరమే చూడరానికట్టుఁబాటులతో వచ్చినది, అందలిసంగతులనే మే మనుమానప్రమాణమువలన గ్రహించినది, మాయనుమతిలోఁ బొరపాటున్నచో శ్రీశాస్త్రులవారు తెలుపఁదగుదురు, వారుసర్వథా పెద్దలు, మాయనుమానమును బలపఱుపఁదగుమఱికొన్ని బీజములుదాహరింపఁ బడుచున్నవి.

యేలూరు 20-1-1914

"... మహారాజశ్రీ మంత్రిప్రగడ భుజంగరావు గారిలోపల వివా

హాము నాల్గవరోజున మహారాజశ్రీ కొప్పరపు కవీశ్వరులను ...పా ర్వతీపరిణయము చెప్పమనగా చెప్పినారుగాని మేమీబాగాలేదు గం టకు 75 పద్యములచొప్పున చెప్పినారు, ఆశుకవి శిఖామణీ యని బి రుదుకూడాయిచ్చినారు తరువాత ... గారు వీరిని వెంటబెట్టికొని .. దగ్గరకువెళ్లి అడుగగా నిరసనభావము చూపుటవల్ల మోతేవారిని .. వడితేవారు ఒకసభ చేయించినారు ఆరోజునకూడా బాగాలేదు, ... వీరికివున్న బిరుదులన్నీ స్వశాఖాభిమానులుయిచ్చినట్లు తోస్తుంది ...

గుండు వెంకటకృష్ణమూర్తి.

Ellere, 5—2—1914

తామువ్రాయుచున్న గుంటూరిసీమ రెండవభాగము తయారు అయిన వెంటనే V. P. ద్వారా నాకొకపుస్తకమును పంపించగోరు చున్నాడను కొప్పరపువారికిని మీకునుగల వివాదయందు విద్యావి షయము పరిశీలించుటకన్న శాఖాభిమానమధికముగా యుండుటచే వారు ఆవేశములతో సంచారముచేయుచున్నారు. యీమధ్యయిచ్చ ట మోతేవారి ఆఫీసులో కొప్పరపువారు చెప్పిన ప్రహ్లాదచరిత్ర ఆశు కవిత్వమువల్ల వారి పాండిత్య పటుత్వము న్యాయబుద్ధి కలిగినవారికి తెల్లమైనది ... సభా మధ్యమున కొండగుంటూరినాగభూషణకవిగా రు ప్రశ్నించగా అది తప్పించుకొనుటకు యెన్నోతప్పుదారులను త్రొ క్కియు తుదకు మాకు అంతే తెలుసునని వెల్లడిగా కవులు నుడివిరి ...కొందరు శాఖాభిమానులు ... న్యాయవాదులమని పేరుధరించి .. న్యాయబుద్ధివిడిచి ...అడ్డమువచ్చిరి. .. చిత్తగించవలెను

T. Ramanjulu Naidu. Ellore

మఱియుం జేతపూడి ప్రకాశము గారను నొకవిద్యావయోవృద్ధులానాఁటిస భ కేగి వచ్చి ప్రసంగవశమునఁ జెప్పినయక్షరము లాయీయుత్తరములను జూర్తిగా బలపఱుచుచున్నవి, శ్రీరాజాభుజంగరావుగారును, శ్రీదాసుగోవింద

రావుగారును, శాఖాభిమానులై సోదరులను సుకవులం జేయఁ బ్రయత్నించుచుండు తు లనేకమాయీసభకు సంబంధించినవి కలవు, అందు సంపూర్ణావధాన మొకపరియేని యేజన్మమునఁగూడఁ *జేయనివారికి 'అవధానిపంచానన' శతావధాని, అనుబిరుదములను శ్రీవారు తమయాహ్వానపత్రములందు లిఖించుట యొకటి, సర్వసామాన్యముగా నేర్పడిన యాశుఘోషాపరియుక్త మగుసభను శ్రీగోవిందరావుగారు, పరీక్షార్థమై యేర్పడిన దానిఁగాఁ బోల్పఁజూచుట వేఱొకటి, ఇదియిటులుండుఁగాక, వీరిరువురును వహించిన శాఖాభిమానమమాత్రము శ్లాఘ్యముకాకపోదు, ఏమనఁగ శాఖాభిమాన, కులాభిమాన, గోత్రాభిమానాదులు ప్రతిమనుజునకు నుండఁదగు సద్గుణములు, అదియటులుండె, ప్రకృత వైవాహిక కవిమండల సభకు సందర్భించిన యీక్రింది పంక్తులం దిలకింపుఁడు.

(1914 వ సం॥ జనవరి నెల1వ తేదీ, సుదర్శినిపత్రికనుండి)

## వైవాహికోదంతము.

...సుదర్శనీ పత్రికాధిపతియైన కస్తూరి శివశంకర కవి గారిని శ్రీరాజాగారు సభకు నాహ్వానముఁ జేసినతఱిని ఆయనచే శ్రీవారికి వ్రాయఁ బడిన విజ్ఞాపన మీక్రిం దుదాహరించఁ బడుచున్నది...

చ॥ తిరుపతి వెంకటేశ కవిధీరులకున్ మఱి కొప్పరంపు సో।
దరులకుఁ గల్గుచుండెనుగదా చిరకాలమునుండి పాండితీ।
తరతమతాప్రశస్తికయి దండివివాదము దానిఁ దీర్పఁగా।
నోరు లెవరింక నీవు వినకుండిన సత్కవిరాజచంద్రమా.

---

*శ్రీశివాభ్యాం నమః ది. 26-6-13

కం॥ గుంటూరుసీమఁ జదివితిఁ। గంటిఁ గొప్పరంపువారు గర్వోద్ధతులై। గెంటిన వ్రాఁతల విద్వ, త్కంటకులగు టెందు వారికర్హమె కాదే, తే॥ గీ॥ దూరదేశంబునందున్న కారణమునఁ। బత్రికలె మాకు దిక్కయి యవఱలెనందు। నవియు నత్యేతరము గూడ నభిలిఖింపఁ। దత్త్వమిదియని తెలియఁగాఁ దరమె మాకు, చ॥ అరయక పత్రికాధిపతులందఱు నజ్ఞులు పంపులేఖలన్, బిరబిరఁ గూర్చివ్రాయుదురు విజ్ఞశిఖామణులైన నేలొకో, పరువడిఁ దున్న యీ నైననఁ బట్టుఁడు గట్టుఁడు గాట,, నం

చ॥ కడు రసవేత్తవీవు బహుకావ్యనిబంధనచాతురీధురీ
ణుఁడవు రసాభిలాసుఁడవు స్మృతి యింతకుఁ ద్యాగభోగరా
యుఁడవును నయ్యుఁ దిర్పతిమహాకవియుగ్మము నేల పిల్వ వి
ష్వాడెకద యర్హమైన తఱి వచ్చెను నిన్నిదినాల కెంతయున్.

వెండియుం బండితకవి మండలాఖండలు లగు నత్తిరుపతి వెంకటేశ్వరులను విడిచి మీరలు గావించు పండితకవిసభ యెట్లన్వర్థ యగు? మీరు కవులయ్యును భుజంగరాజులగుటచే మీకుఁ బక్షపాతము విరుద్ధ ధర్మమయ్యెడిని గదా! మీయట్టి చాలినవారు పూనకున్న నీ కార్యమెంత కాలమిట్లు విచారణీయమై యుండవలెను. ......... .....ఇందెవరి కెవరు బెదరుచున్నారో తజ్జ్ఞులకుఁ దెలియవలయును...



పైపంక్తు లనేకసందర్భములను వ్యక్తీకరించుచున్నవి. మేము శ్రీవారిగేహమున జరుగువివాహమున కాహ్వానింపఁ బడనివారము కాము, మాకుఁగా వేఱుగ

చునం। బరపడువాని పోలిక నెగివాస్తవమున్ గనఁజాలరక టా...కం॥ ఐనన్ సోదరకవులాగి। మానగరమునందు నైనమాన్యతఁజాలం। గా నుడువుదురఁట యట న। ద్దానిన్ వ్రాసెదను గోరెదను బ్రకటింపన్ తే॥ గీ॥ ఇం దసత్యంపు వ్రాఁత నుంతేని లేదు। వారియందున లవమేని పగయు లేదు। సత్యమును వెలిఁజేయు వాంఛన్ దవిలితి। పాత్రులున్నారు పెక్కండ్రు చతురమతులు, కం॥ ... ముస్త్రావల రామ ముఖ్యులందు... చేసెవేడ్క నష్టావధానంబున్, క॥ అపుడు కొవ్వరంపు పెద్దకవి... పద్యములన్... జదువఁగ। ... లేదితనికిననిరి తజ్జ్ఞులగుబుధుల్. శా॥ శబ్దజ్ఞానము లేదు సుంతయయినన్ సాహిత్యమున్ లేదితం। డబ్దంబుల్ ప్రథ వాదులన్ జదువునట్లాత్మీయపద్యావళిన్। శబ్దం బాకసమంటఁగాఁ జదువునిశ్శంకంబుగా వర్షహీ। నాబ్దధ్వానముఁ బోల్పవచ్చుఁ గవితావ్యాహారమిట్లొప్పనే, క॥ అనితమలోఁ దమరనుకొని। కనికొవ్వపుటతని కనిరి "కవివాటకు నెం। దునుఁజాలవీవు చదువుము, తెనుఁగున్ సంస్కృతముఁ బిదపఁ దీర్పుము కవితన్... తే॥ గీ॥ మనుచరిత పద్యములు కొన్ని... గొప్పపుంగవిగు ప్పె... యంద అపుడిహిహీ యనిమందలింపఁ... శ్లో॥ ఒకరువ్వ స్తాత్కరి- నెసఁగెద మనదాని యత్నంబుఁ జేయలేదనియొసఁగవి, కా

సభ నేర్పఱపకున్నను శ్రీవారలందఱతోపాటు మమ్మాహ్వానింపక పోలేదు, ఇంతకు మున్నె చాలదినములనుండి 'విఘ్నేశ్వరుని పెండ్లివలె, సాఁగియున్న వేమవరాగ్రహారశతావధాన ప్రయుక్త సన్మానమునకుఁగా గుంటూరు వెళ్లవలసివచ్చినది, ఆయీసందర్భమును మా'నక్షత్రికుని' విచారవాక్యములవలన నింతకు మున్నె స్ఫుటముగాఁ దెలిసికొని యుందురు, ఎట్లో దానిని ముగించుకొని శ్రీవారిసందర్శనమునకు రావలయు నన్న రావచ్చును గాని వచ్చినచో—

'అవధానిపంచానన' యన నేమి, శతావధాని, యన నేమి"

అని సోదరుల నడుగకున్నను శ్రీవారి నడుగ వలయు నని లోలోపలఁ గుతూహలము బోలెఁడు కలదు, ఈ ప్రశ్నము వైమనస్యమునకుఁ గారణ మగునే కాని తగిన సదుత్తరము రాఁదగినది కాదు, కావున నాప్రియత్నము సంక్షేపించుకొంటిమి, ఆయీవిషయము ప్రకృతమున కంతగా సంబంధించినది కాదు, ఈవివాదము శాఖాభిమాన ప్రయుక్తమైనది గా నెంచఁదగదనుని యోగిశిఖామణు లనేకులు గలరు, ఈయంశమున్ ధ్రువ పఱుపఁదగు ననుభూతాంశము లెన్నో కలవు, అందొకటిమాత్రి మిట నుదాహరింపఁబడుచున్నది.

---

వ్యాపాతంబునొ-క్క-రడుగఁగా వానిఁజదువ లేదని చెప్పెసరసతముఁడు, ఒగిఁబురాణార్థంబు- నొకరు కోరఁగ నెప్డు చెప్పట లేదని చెప్పెమేటి, ఒకరక్షరనిషేధ-మొనరింతుమన్న నెక్కు-డు భారమగునని యుడిగెధీరుఁ, తే॥ గీ॥ డిట్లుధారణ, పాండితి-నెఱుఁగకయె వ౹ధానమనిపదుగురకుఁబ-చ్యములఁ జెప్పె౹ నెల్లజనులిహిహీ? యని-పెల్లుగొలఁ౹ జేసి రిదెవారియవధాన-మోసుధీంద్ర...ఉ॥అంతటఁ గొప్రపుంగవి...వెంకనకౕ దెగడ...నీరసన- నిప్పడె...పాఱుఁడాయనెక్౯ క॥ అనవుడుఁ గవిభయమొదఁగొని౹ చనియెన్...తే॥ గీ॥ ఆర్యా? వీరలుమాపురమందుఁ జేని, నట్టిపని యుదియే పొంది- నట్టి గౌరవంబిదియె వేరొకటిలేదు- వారలచటఁ, బ్రిమదమున నాడునుడులుద- బ్బఱలు వినుఁడు...ఉ॥ కావున సత్క-విత్వమును గానని యిట్టి కవుల్ వచించుమి, ధ్యావచనమ్ములన్ గలఁత నందకయుందురుగాత మానవుల్ భావమునందుఁ బండితులఁ బల్మఱు మెత్తురుగాత సత్యపుంత్రోవఁ జరింత్రుగాతఁ బెఱత్రోవలఁ దోఁగక కొప్రపుంగవుల్.

ముదిగొండ నాగవీరేశ్వరుఁడు కళస్తుబజారు, శికిందాబ్రాదు

చ॥ ఒకదినమందు గర్తపురి కొండొక దాపునఁ గట్టుచున్న పే
టకడఁ గనంగనయ్యె నొకటన్ సుగుణుండు నియోగియొక్కఁ, డం
తకు మును మన్మతండు విదితమ్ముగఁ జూచినవాఁడు గాఁడు, వి
నిక్క కతనఁ బూర్తిగా నెఱిఁగి కేవలనక్షుఁ డితండు మాయెడన్. ౧

ఉ॥ ఆమహితుండు మాయెదుటి కాదృతిపైఁ జనుదెంచి మ్రొక్కి "యో
స్వామి? భవద్యశంబు విని పారెకు దర్శన మాచరింప నెం
తే మదినూరుచుండు సుకృతోదయ మిర్వ్వఁర గూడ మిమ్ముఁ దా
నీమొయి నీపురమ్మునకె యెట్టులొ తెచ్చెఁ గృపాను షంగియై. ౨

ఉ॥ ఐనమ తేమి మిమ్ము మనసారఁ గనుంగొని మాటలాడు పు
ణ్యానకు దూరగుండను గదా? మఱి నేను నియోగినౌట న
య్యో? నయమింత లేక తమయోగ్యత, యన్యుల శక్తి, పూర్తిగా
లోన నెఱింగి యుండి చపలుల్ కలహం బిదివెట్టి రీసునన్. ౩

క॥ "కటికక్క గంగిగోవుగ, విరచింపఁగ నెంచి,, రంచు విని నెమ్మది నీ
చరితము హుళిక్కి పుక్కిటిపురాణ, మనియెంచుకొందుఁ బూర్వం బెపుడున్. ౪

చ॥ ఇపు డెటువంటి పాణ్డిత్యము లేని జగమ్మున నుండవచ్చు నం
చపరిమితమ్ముగాఁ గలిగె నాఁటినినమ్మిక, లేనిమాట తా
నెవ్వడును బుట్ట దొక్క యెడ నెట్టులొ పుట్టిన నిల్వనేర దే
చపలుఁడొ యట్టివాఁ డొకఁ డెసంగుటనే జనియించె నానుడుల్. ౫

చ॥ అదియటులుండనిండు మనమందలి కోరికి దీర్చుకోఁగ మీ
పదయుగదర్శనంబునకు వత్తును వెంటనె కక్షలొప్పిదు
ర్హ్వాదుఁ డెవఁడేనిఁ జూచి మఱి యేమనునో యనిసంశయింతు, దు
ర్మదులకు నక్కటా! కలదె మంచియుఁ జెడయునడ్డ మాకయున్. ౬

చ॥ "అతఁడు నియోగిగానఁ దగఁ డాననసత్క్రృతి" కంచు మీరుప
లిక్కితిరె వృథాగ నెందులకు లేపిరి కక్ష నియోగివైదిక ప్ర
తతికి, విద్దెయున్నయెడఁ బక్షము యుక్తము విద్దె లేనిచో
వితగద పక్షపాత మవివేకుల పద్ధతు లిట్టివే కదా.

చ॥ అని తన నెమ్మదిం గలుగునట్టి యథార్థము నెల్లఁ జెప్పి తోఁ
చినగతి నొచ్చుకోఁ బోడఁగె వ్వీయు లోనర్చెడిదానినైనన

జ్జనులు దురుద్యమంబును బ్రశంస యొనర్సరు గాని వారణం
బునకు యతింపఁ గొంకుదురు మూర్ఖులకుక్ జగమెల్లజంకుఁగా.

ఇట్టినిష్పక్షపాతులను గణింపక మాసోదరులు తప్పదుస్పృష్టులు లోనగు కార్యములచేఁ దమకుఁ దోడ్పడ నుంకించుసామాన్యులను మిగుల గౌరవించుచున్నారు,ఆసృష్టిస్వరూపమింతకుమున్ను 1వ పుటలోనుదాహరించినదియే,(వరెం నరసింహయ్యలేఖచూ) మఱియొకటి యిటఁ జూపుచున్నారము.

(మక్కికిమక్కినకలు) 28-7-13.

...మీరు ప్రకటించిన గుంటూరుశీమ అను అబద్ధపు పుస్తకము పీఠికలో 41 ఫేజిలో మీపుస్తకమును ది 1-3-13-వ తేదిన నాకు వీపీగా పంపింపుడనికోరుచు నొకజాబువ్రాశినట్లు ప్రచురించి యున్నారు అట్టిజాబును మీకునేనెన్నడును వ్రాసియుండలేదు ఆయుత్తరమును మీరే యాధరమున బ్రచురించితిరో వెంటనే తెల్పవలయును.

పోతరాజు వరదయ్య, సంతమాగులూరు పోష్టు.

---

ఈయుత్తరముఁగూడ మొదట వ్రాసినవరదయ్యగారే వ్రాసియుందురని మామనస్సాక్షికి వచ్చుట లేదు, అందలిలిపికిని, ఇందలిలిపికిని,లేశమును బోలిక లేదు, అయినను నిందలితత్త్వమును దెల్పుటకు నిజమైనవరదయ్యగారు ప్రార్థింపఁబడుచున్నారు. ఆయీమాయవేషములెల్ల ముందు శ్రీసోదరులుప్రకటింపఁబోవు 'నారాయణాస్త్రము' లోనగు నేతిబీరకాయపాత్రములయందుఁ జూడగలము, తత్ప్రతిక్రియ యగు'నమస్కారమున' వానితత్త్వమును దెల్పఁగలము, కావున నిటఁ జర్చింపవలసినది లేదు, సోదరు లిప్పుడొనర్చుచున్నపరిశ్రమమెల్ల *నెల్లైని ప్రకృతచరిత్రబోధకము లగుమాగ్రంథములను మాయింప వలయు నని తప్ప

---

*గుంటూరు 17-2-14

...గడచిన సంవత్సరం ది 14-6-13 తేదీన వేమవరఅగ్రహారం సమీపగ్రామ కాపురస్తుడు...అనువారు మీపేరవ్రాసిన పుత్తరం వేమవరం శతావధానపీఠికలో నుదహరించి యున్నారు. ఆపుత్తరమునకు వ్యతిరేకముగా షుమారు నెల రోజులక్రిందట సోదరకవులు...గారు కొప్పరం వెళ్లగా వారికి విందుచేసి పద్యము

వేఱొకటిలేదఁటని ఇందులకు వీరు వారివారిపేర వ్రాయనుత్తరములు కడు శో చ్యస్థితిలో నుండుటయు, ఆకారణమున వీరు వారివారిచే మందలింపఁబడుట యుఁ బ్రత్యక్షముగా మే మెఱుఁగుదుము, ప్రకృతము సోదరు లొనర్చుచున్న.—
'కష్టము కిష్టారాయనికే యెఱుక'

సర్వథా వారియుద్యమము ఫలించుఁగాక, ఇంతకుమున్ను తమకై యాత్మ ను వంచించి యవాచ్యములను బ్రచురించిన బ్రహ్లదులకు వీరు చూపనెంచినకృత జ్ఞతాస్వరూపము నీక్రిందిసోదరులయుత్తరమువలనఁ దెలిసికొనవచ్చును.

శ్రీ-పోతరాజు లక్ష్మీనరసింహసత్కవికి,ప్రియమిత్రమా! మీా కాహ్వా నపత్రికలు వచ్చియేయుండునుగదా . . .మీాకు వినుకొండ, సాలన గ్రామములలో రెండుచోట్లనుసన్మానశూన్యమయ్యెను. . .మీాకుప్రధమ ముగాశ్రీ- విద్వత్ప్రభువర్యునిచేసన్మానముచేయింపవలెననియు,. . .మీా పేరచ్చట వెల్లడిచేయవలెననియు, . . . దలంచితిమి,. . . కాన . . . 15వ తేదీ సాయంకాలమున కిచ్చటికి తప్పక వచ్చితీరుడు మీాకుఁ జెప్పవలసి న సంగతులనేకములు గలవు,. . . ఆదివివాహము. . . కావున. . . ధరించు వస్త్రములు, ఉష్ణీష. . చెప్పనక్కఱలేదుగదా,. . . 1-2 - తావులకాగితము లు, ఒక పీన్నిలు, ఉండవలయును,. . . ఇట్టిసమయలో మీారు వెల్లడికి రానిచో నిఁకెనెప్పటికిని, ఏల్చూరు, ముప్పాళలలోషావుకార్లు ఎప్పుడు సభచేయింతురా, అని ప్రతీక్షించుచుండవలసినదే కాని వేఱు కాదు,. . . కాన రేపుసాయంకాలమునకు మిమ్మురమ్మని కోరుచున్నాఁ డ, . . . ఆంతరంగిక మిత్రత్వకారణమున నిట్లు వ్రాసితిని,. . చి ॥ మ న్నికంటి(గురునాధుని)యొద్ద వివాహాహ్వాన పద్యగత్నావళియను మా

---

లచే భూషించి "ఆవుత్తరంలోని సంగతులు నాకు తెలియవు, యెవరు వ్రాసినారో" మొదలైన సంగతులతో వారి స్వదస్తూరిని నొక వుత్తరం సోదరులు వ్రాయిం చుకున్నారట. . .మీకువుత్తరంమొదట వ్రాసి తిరిగి యీలాగువారికివ్రాసియిచ్చుట చిత్రముగాయున్నది.. . . ,,

W. V. Subbayya.

పుస్తకమొకటికలదు, దానితో నత్యవసరము, కాన వానిని విచారించి. . . పీండ్రిచే బంపవలెను, . . .

12-12-13 ఇట్లు భవన్మిత్రుఁడు,

కొ॥ వెంకటసుబ్బరాయశర్మ.

. . . బాలదాసత్వమునకు (విశ్వనాథునిc) బుత్రెంచుము,

---

ఇందుఁ గుండలీకరింపఁ బడినగురునాథ విశ్వనాథులే గురువిశ్వనాథ కవులు, అన్నదమ్ములు, ఇట్లేందఱనో సోదరులు కవుల నొనర్చుచున్నారు, దూరగులు మోసమున మునుఁగుచున్నను ఒగ్గఱవారు నొచ్చుకొని *నిజమును వెలిపుచ్చుచున్నారు, ఆయీ 'గూడుపుఠాణీ' లోనికొందఱయోగ్యతలను దెల్పువ్యాసములనే యభినవసరస్వతి యుపేక్షించినట్లు వెనుక వ్రాసియుంటిమి, గ్రంథవిస్తరభీతిచే మేముగూడ వారివారి వాక్యముల నెల్లనిందుదాహరింప లేకపోతిమి, విషయమంతయు వ్రాయజాలకున్నను శైలీప్రదర్శనార్థమై కొన్ని యక్కఱముల ను మాత్రమిట నుదాహరించెదము.

---

*. . . తమకు హెచ్చరిక అనివ్రాసిన కవీశ్వరులు యేమితెలియనివారు. వారిని గురించి క్రిందవారివిశేషంబులు వ్రాయుచున్నారము. గురుకవిగారియొక్క బుద్ధిబలము. ఈక్రిందినంగతులవల్ల తెలియును. ఒకరు 'యేలూరిలో జమీందారు గారికొమార్తవివాహవిషయంబులో కొవ్వూరపు కవీశ్వరులకు యేమి బహుమానము యిచ్చినారు. అని అడుగగా మెడల్సులు యిచ్చినారు ఒకొక్కటి 30 శవర్లు యుండునని చెప్పిరి. యెంతవెడల్పు, యెంతమందము, వుండునని ప్రశ్నించగా అర్ధణావెడల్పు అర్ధణామందము వుండునని చెప్పినారు వారియొక్కబుద్ధిబలము దీనిలో తెలియును. విశ్వనాథము అనుకవికి 10 సంవత్సరములు వచ్చినపిదప 'కృష్ణా' అనమనినయెడల 'కుత్నా' అనెడివాడు యిప్పుడు యితనికి 15 సంవత్సరములు వయస్సు యుండును. ఈనంగతులను బట్టి వారియొక్క నంగతి మీరే గ్రహించకర్తలు. హెచ్చరిక అనివ్రాసినపద్యములు కొవ్వూరపుకవీశ్వరులు వ్రాసి వీరల పేరులు పెట్టినారు. విశ్వనాథము అనేఅతను పోతరాజు లక్ష్మీనృసింహ కవిగారి సహోదరుడు..........."

(చేబ్రోలు,) 10-1-14.

సొలసగ్రామం, ఫిరంగిపురం పోస్టు, గుంటూరు డిస్ట్రిక్టు.

(1)...సీ॥ గుడ్డికళ్లమకడ నడ్డదిడ్డపుఁగూఁతలను గూయుటా య
ని యనెడివారు. . . . తే॥ గీ॥ తనదుబండారమును మంగతాయియె
ద్దఁ, జూపఁగా వలెనో యంచుఁ జోద్యమనుచుఁ, బలువిధమ్ములఁ బలికిరి
పాప మతని.సరసు లైనట్టియాసభాస్తారులెల్ల॥ తే॥ గీ॥ లౌకికజ్ఞానహీను
లు లక్షణంపు, వాసనను గాంచె మెఱుఁగనివారలెల్ల, సుకవులకు శో
భగూర్చెడుసుజను లగుట, వారు చిరజీవులై యుండ వలయుఁగాక॥

---

(2)...మ॥ ఘనయ్యోన్ గదు హేయపద్యతతి తద్విఖ్యాతకారుణ్యుచే। త
ను నాతండదివిన్నదాడిగను జింతన్ జేయుఁ జొచ్చెన్ గవీశుని మర్యా
దను జేయ హెచ్చుగఁ; గవీశుం డద్ది గాంచంగ లే, కనుమానం బొక
యింతలేక కడుధైర్యం బొప్ప నుండెం బుఃన్॥ . . . ఉ॥ పాపము
. . . లకుఁ బాలుగనయ్యెను శర్మశాస్త్రియుం, చాపలుగాకి కిట్టులనె
యంతట నంతట నైనఁగాని తా, నీపనులెల్ల మానఁడని యింతనెయా
తఁడు సిగ్గునొందెనే?, ‹యీపని యెంత వాని,కని యెంచెడివారును
నైరి వీటిలో॥ . . . సీ॥ ఓదార్పవచ్చిన యోజఁ జేఁరిది నీకు మర్యా
ద గా,దని మరలువారు, . . . . ‹‹తగనిగర్వంబూనెఁ దగినలాభం
బొందెఁ గను బుద్ధి నిఁక,, నని చనెడివారు॥ గీ॥ పలువురును బలువిధ
ములఁబలికిపలికి। యేడ్చువానిని మఱిమఱియేడిపించి। యెట్టమున్నగఁ
జేసి రే నేమివ్రాతు, నెంతయైన స్వభావోక్తికే కొఱంత॥ . . . సీ॥ ‹‹పి
ప్పికూఁతలుగూసి . . . . దినువారెల్లఁ గవులనఁబడ,, రటంచు. . .
తే॥గీ॥ పురమునందలి పెద్దలు పొలుపుమీఱ, నాడి సిద్ధీకరించిరి యం
తనుండి, యింటిలోనుండి వెల్వడఁడెంతకష్ట, మబ్బె నాతని కౌరా
ర! యహాహా కర్మ॥......,,

పాపము, సోదరు లీపాటికేని మంచిత్రోవకు వచ్చువారేగాని, మనోరం
జన్మిహితకారిణు లవ్వారి నేమో యుద్ధరించుననుభ్రాంతి వెనుకకు లాగుచున్నది

అవి చేయుచున్నయధిక ప్రసంగమునకు సుదర్శనీ పత్రికాధిపతికన్నఁ జక్కని హిత బోధకులు దొరకరనుట నిక్కము, కాని యిప్పుడిప్పుడాయనం గూడ నవి తిరస్కరించి దూషింప మొదలిడుచున్నవి, సోదరులారా! వానికన్నను మించి ప్రసంగించుచున్నట్లు పూర్వరంగమునఁ బెక్కు సందర్భములు చూపఁ బడినవి, ఇందు వారిరిష్టరుత్తరము చదివిన వారికి వారి వాచాటత పూర్తిగా గోచరించెడిని, వారిహృదయమునకుఁ గడు నికృష్టముగా నెక్కిన మా 'గుంటూరిసీమ' పూర్వరంగము, ప్రాజ్ఞుల కన్యథాగా దోఁచుటకుఁ గారణమేమో సుంత విచార్యము కాకపోదు గానఁ దద్బోధకములు కొన్నియుత్తరము లుదాహరింపఁ బడుచున్నవి.

# అభినందనములు.

తమ సీమ పూర్తిగఁ జూచితిని. కడు రసవంతముగనున్నది. తత్రాపి 'యతిక్రాంచి త్సంసారులు, అనుకందమునకు సాటి మఱియొక పద్యము లేదు,...''

మ॥ అవురా! శీతధరాధరేశ్వరగుహావ్యాప్తాతి గాంభీర్యగ
ర్వవినాశిత్వదుదారవక్త్రవిసర ద్వాగ్జాహ్నవీపూరధౌ
తవిరుద్ధాశయపంకపామరహృదాదర్శమ్ములం దెల్లఁ గా
కవిఘూకాననముల్వివర్ణములుగాఁ గన్పట్టె నిప్పట్టునన్. ౧

మ॥ కలుషస్వాంతు లనామకుల్పకటాధికారప్రియు "ల్సత్యవా
దులు" నా పెద్దలడంగ సాదులయి సూదు లాలిల దుర్మంత్రతం
త్రులు గూలన్ దమ 'సీమ' వాస్తవము నుద్ఘోషించుచో నందన
ల్గలరూపంతయు నెల్లవారలకుఁ దెల్లంబయ్యె నుల్లంబులన్. ౨

శా॥ అంభోధ్యాభనభస్స్భోచ్చగత సూర్యాలోకసంతప్తులై
జృంభల్లక్కుచుఁ గృష్ణలోనఁబడి వే "క్రిందెట్టు మీఁదెట్లు క్రి
ష్ణంభల్లై" మటుమాయమై చనిన శుంఠల్గొంద ఱవ్వారిసం
రంభం బెల్లనడంగఁగాఁ దుదకు సీమన్బట్టి రీనాఁటికిన్. ౩

శా॥ సత్యాధార మసత్యదూర మగుచున్ సర్వంసహా చక్రమం
దత్యౌన్నత్యముఁ గాంచి సర్వవిబుధాహ్లాదానుసంధాయియై
సత్యాభాసులగుట్టు బిట్టడఁచి విశ్వస్తుత్యమై యెప్డు గీ
ష్పత్యుత్కృష్టగమరీతిఁ గ్రాలఁ గఁ దన్మత్సీమ నిస్సీమమై ౪

కాశీ కృష్ణాచార్యులు.

2-9-13.

శా॥ కంటిన్ గుంటురిసీమలోనఁ గనకత్స్నజాత బీజోల్లస
త్కాంటాస్వాదననష్టధీకుకవిరాడ్వాంతిప్రణాదక్రియా
లుంటాకౌషధదాతృసత్కవిభిషగ్లోకోత్తరోపజ్ఞతా
కాంటక్యావహదుర్జనార్జనముఖాఖండక్రియోద్దండతల్. ౧

మ॥ బళిరే భావత్కషాయపానమహిమంబై జాడ్యమం దాగపుం
జలుబున్నీరు హరించెఁ గర్ణకటువుల్ చండాశుధారాశ్రుత
మ్ములునుందగ్గె బడాయి దగ్గు లపుడే పోయెన్ జూఁడీ! దొంగవ్రాఁ
తలమ్రోఁగన్నిఁకఁ బుట్టఁ గూడ దన లంతర్గాము లెట్లున్న వో ౨

శా॥ బండాటంపు మలిమ్లుచాళి మొగముల్ వాయంగ దన్నం బళా!
గుండెల్ కొండొకదాని కుందునె భవద్గుంటూరుసీమాభిధా
ఖండ గ్రంథనిబంధనోత్థకవితాకంఖాణికిం దక్క నీ!
వండు ల్సైతము రాలఁగొట్టిన దదే పాపమ్ము విద్వత్కవుల్. ౩

శా॥ చుట్టాలం దనియించుపూనిక్మెయి హెచ్చుల్ గ్రిచ్చులుం గొట్టి యే
లట్టాలుం బయిఁ బెట్టుకోక యెటో కాలక్షేపముం జేయునా
గుట్టుం గిట్టలతోడఁ జిమ్మినది మీగుంటూరిసీమాహ్వయా
రట్టానీతవినీతవీతి నిజధారాచాకచక్యంబునన్ ౪

శా॥ గంటల్ గుంటకుఁ జేర్చి మున్నొకఁడు మీగారాబు శిష్యుండు దా
నంటుంగాజు లానంగె శాత్రవుల; కయ్యా! “యంతమాత్రంబుగా
నుంటేచా” లనుకొంటి మప్పు; డిపుడయ్యో! గాజులున్ రాల్చె మీ
గుంటూర్సీమ కృతిప్రతీతకవితాఘోటీఖురాఘాతముల్ ౫

శా॥ కల్లల్ కొల్లలుగూర్చి లోకము నెటో కన్గప్పి వాచాటపుం
జల్లు ల్గుప్పినదొంగయుత్తరములన్ సంధించి రన్నన్న! మీ
ఫుల్లస్ఫారవచోరుచు ల్గని తమఃపుంజంబు తెల్లనియుం
దెల్లంబాఱు నటం చెఱుంగ రెద మాదేబన్న లోనత్కవుల్. ౬

శా॥ గేహేనర్దులు ప్రతికాళుల దురుక్తివ్యక్తి చాటించి నై
జాహంయుత్వముతో ముదంపడుట లాహా! కానఁగానయ్యె నీ
యాహూత ప్రపలాయికత్థనవచః ప్రారంభ సంరంభస
న్నాహంబు న్మొదలంటఁ గూల్చవె భవన్నవ్యామృతవ్యాహృతుల్ ౭

మ॥ గురుధికాక్రమంబు జేయునిర్వ్యరను ము ద్ఘాటించు మీ కిప్పు డీ
గురుగర్వాంధుల వీడు పెట్టు తగు? వీర్ధూపెట్టునందాఁక, నెం
దరయం జెల్లముకొండ మిం గంగలత్తైర్యావార్యుఁ డకొండకొ
ప్పరము న్నీవడు నటన్నమాట కలదే భావింపుఁ డోనత్కవుల్, ౮

శా॥ అన్నా? యెన్ని పథాలఁ బోయిరి త్వదీయానూనకీర్తి ప్రకా
శౌన్నత్యంబు హరింప దస్యు, లవు డాయాదార్లలోఁ గంపఁ గొ
ట్టె న్నిక్కంబుగ మీక చెల్లు నెరు లీటాటోటులం 'బట్టి కొం'
డన్నం, బట్టఁగ లేర యంబునన కాదా? వారి కాబీరముల్. ౯

శా॥ జల్లింబల్లిదు లెత్తువారలఁటే? యానతాక్రవ్య పెట్టుందునో?
చిల్లు ల్వెల్లనినామమే తెలిపెదుం జేఁ ద్రిప్పినంగాడె పా
ట్టెల్లంతన్ బయికేగుదెంచు నటుపై నస్త్రంబా? యస్త్రనంబొకో?
తెల్లంబే, చిరజీవి యా నటుల మీ ర్ధవింపుఁ డోనత్కవుల్ ౧౦

ఈ పద్యములు ..నాశరీరము చాలశోచ్యావస్థలో నుండుటచే నింతటితో నంతరింపవలసివచ్చునేమో యనుశంకచే నిప్పుడు పంపు కొంటిని నాయందుదయయుంచి వీనిని గ్రహించి నన్నాశీర్వదింపుఁ డని కోరుచున్నాను. రాళ్లబండి, వెంకటసుబ్బశాస్త్రి.

---

Guntur

......నిన్నటిదినమున నామూలాగ్రముగా తమసీమంజదివితిని చదువున పుడు ప్రత్యక్షరము మేనగగుర్పాటు కలిగించె ఇది అతిశయోక్తికాదు కొన్నికొ న్నిభాగములయందు తాము యాథార్థ్యమును వెల్లడింప వ్రాసినవ్రాతలు చదువు చో నాకు గన్నీరుపొడమె విశేషించి కొప్పరవు తమ్ముడుజాబు ఘట్టమున మీరు చేసిన కష్టము, మీరు వెళ్లినపోకలు, తిక్కనను మఱపించినవి భారతపు భక్తి యంతయు మీకొక్కరికే యలవడినది అపరతిక్కనయని మిమ్ముదలంచుచు మీపాత్తమును గన్నులనద్దికొంటిని ఇంతకంటెనాసంతోషము వెల్లడింపలేను ప్ర తివత్సరమైనను నీగ్రంథమునుదిశుద్ధిగాశిరసావహించిపీరవలయుననినానమ్మకము

B. Lakhmikantam.

...గుంటూరుసీమ చేరినది దానిని...అందుకొంటిని, దానిని చదివిననాటినుండి యు నాకు కలిగిన యానందమును మీకువ్రాయజాలను. మీరువ్రాసిన వ్రాతకున్నా మాగుంటూరులో అన్యాయముగా అక్రమముగా జరిగిన అల్లరికియేమి భేదములేదు. తమరు వ్రాసిన పుస్తకమువల్ల మాగుంటూరులో 'సత్యవాదుల,మనియు,...దొంగపే రులుపెట్టుకొని సంచరించుచున్న వారియొక్క డంబము అణచినది అని నేను రూఢిగా వ్రాయుచున్నాను. మీయెదుటపక్షము వారియొక్క...కట్టివేసినది ...,'

11-4-13 గుంటూరు. మాటూరి బసవయ్య.

చ॥ తిరుపతి వేంకటేశ్వరులు తెంపరులై మనకొప్రపుంగవీ
శ్వరుల వృథాగ దూఱిరని వ్రాసెదువారికిఁ దారతమ్య సం
కరముగఁ బల్కువారలకుఁ గాఱులఁ బత్రికలందుఁ బేర్లు ధీ
వరులకు 'రామకృష్ణ,'యన వచ్చును గుంటురుసీమ నెంతయున్. ౧

ఉ॥ ఎక్కడి వేంకటేశ్వరుఁ డిఁ కెక్కడి తిర్పతి! రామకృష్ణులే
దక్కఁగనీరువారిఁ, దగఁదక్కఁగ నిచ్చినఁ గొప్రపుంగవుల్
నిక్క విదల్పఁగా గలరు, నిశ్చయమంచని వ్రాయుచున్న య
వ్వాక్కులు వ్యర్థమున్ నలుపువారల మిమ్ముల నెన్నశక్యమే. ౨

సీ॥ భువిమహాకవులతోఁ బోరిన ననుభవింపక తప్పునా? యంచుఁ బల్కువారు
తిరుపతి వేఁకటేశ్వరు లనఁ దిరుపతి వేంకటేశ్వరు లంచు వినుచువారు
ఆత్మకూరాదిరాజాస్థానగతకథాభాగంబులను జ్ఞప్తిఁ బట్టువారు
ఎదిరింప మునుపు వాయినిఁగట్టినట్టి పెద్దలచరిత్రలు మదిఁదలఁచువారు ౩

తే॥ గీ॥ నిన్నగాకనె మొన్ననిందించినట్టి, రామకృష్ణులు దృష్టాంతరంబటంచు
సారెఁదలపోయఁ జేసె గుంటూరుసీమ,విబుధమండలమందు వ్యాపించువేళ.

మ॥ ఎలమిన్ గొప్రపుజల్లిసీమ,యును మీ రీవ్రాయు గుంటూరు సీ
మలఁ జేఁ బట్టి నిజంబుఁదేల్చుకొని నమ్మన్ వచ్చు సత్యంబు ని
శ్చలచిత్తంబున, నంచుఁ బూనితిమి యోసాహిత్యయుక్తుల్ ? నిరూ
ఢులునన్ వైదికులన్న నెక్కటియె మాకున్ బెక్కు లింకేటికిన్.

సోదరకవులు { దూపాటి తిరుమలశేషాచార్యులు.
వేంకటరమణాచార్యులు. ౯-5-13

...గిరశ, గుంటూరుసీమలయొక్క భాగములచ్చుముగిసినతోడనే నాకుబంపుటకొరకు, నా పేరునురిజిష్టరుజేసికొని ...కృతజ్ఞతాబద్ధునిగావింపవేడుచున్నాను...నిన్నటిదినమున, కొప్పరపువెంకటసుబ్బరాయ, కవిగార్లుగారు మనుదేరగా గుంటూరుసీమవలన, వారి సుస్వభావము నెరిగినవాడనగుటచే, అయ్యా! గుంటూరుసీమందిలకించితిరా? తమజల్లిసీమయేమైనదని యడుగ, నేసేమో, ప్రగల్భములంబలికి, జల్లిసీమ, నెలదినములలో వచ్చుననిరి...గుంటూరుసీమయొక్క పూర్వరంగమును తనివిదీరగాంచితి, కొప్పరపువారి యసత్యప్రకటనలును, తమసత్యనిర్ధారణలును, మధురసుధాధారలౌలుకు తమకవితానైపుణ్యమును నాకేగాక సర్వాంధ్రులకమందానందము నొనరింపక, మానవని ఘంటాపథముగఁ జెప్పకతప్పదు

మాకరాజు నారాయణరాజు. గుంటూరు 17-4-13

గవర్నమెంటుట్రయినింగుస్కూలు.

...గుంటూరుసీమ, చదివితిని. అఖండమగు మీకవితయందలి కథావిషయగమనము అత్యద్భుతమగనున్నది. ఈకథా సంవిధానపరిపోషణ ఆంధ్రవాఙ్మయమునందు ఒకరిద్దఱు సనాతనకవులయందు తిక్కన, పినవీరభద్రుఁడు, తక్క లాఁటి యెడలఁగనుపట్టదు..." రుక్మామాక్ మక్ తిరువల్కోణి 2-7-13.

రాయప్రోలు సుబ్బారావు.

...గుంటూరుసీమ పూర్వరంగమను గ్రంథమును... నందుకొంటిమి...సదరు గ్రంథము మాసంశయములను బోగొట్టి నిజమైనవిషయములను దెలియఁబఱచినందులకు మేమెంతయుఁ గృతజ్ఞులము. "నిజమునిలకడమీదదెలియు" ననులోకోక్తి కల్లగాదుకదా? వేయేల! సర్వవిధముల యీగ్రంథము సప్రమాణముగాను, బక్షపాతరహితముగను, చరిత్రాత్మకముగను, వ్రాయఁబడినదనుటకు సందేహము లేదు. దీనింగాంచియైనను గల హాశనులు మౌనముద్రను వహింతురుగాత.

Secunderabad Daccan. ఏ. యస్. రామకృష్ణులు. 30th March I913

ఉ॥ చూచితినండిసీమ, పరిశుద్ధవచోనిచయాభిరామ, వి
ద్యాచతుర ప్రమోదధనధామ, యథార్థ కథానకోక్తి ము
ద్రాచణ కామ గ్రాస్యకవి తంత్రబహిష్కృతి దేవభామ, యం
బాచరణాంబుజాతరసబంధుర శ్రీపతి వేంకటేశ్వరా. ౧

శా॥ ప్రాచీపశ్చిమదిక్ స్థితాంధ్రకుకవిప్రాణానిలాహీంద్రమై
వాచాదోషవిషాక్తరిక్తజనతావక్త్రాశటాసారమై
భూచక్రోపకృతిప్రసూనలతికా స్ఫూర్జద్వసంతర్తువై
తోఁచెన్ జుండి చరిత్రయుగ్మము కవీందుశ్రేణి చూడామణీ. ౧

క॥ గిరతమా! యత్యద్భుత, ధీరులవసఁదేల్చె 'సీమ' తెల్పె నహోర్థ
శ్రీరాజులవస;నార్యులు, చారుప్రజ్ఞులు భవత్ప్రశాంతికి మెచ్చన్. ౩

భాషాత్రియశాలి. 22-4-13 గుంటూరు అగ్రహారం

D. Ramaswami Sastri.

ఉ॥ దైవముఖమ్ముఁజూచి సమతన్ వహియించి చరిత్రయుగ్మమున్
భావవిదుల్ సెబాసనఁగ వ్రాసితి రౌనసుశైలిఁ దాము, మీ
చేవ యథార్థ గౌరవ విశిష్టము 'శిష్టజనైకవేద్య' మో
దేవ? భవత్ప్రతాప మతి దృశ్యదరిప్రతిబంధకం బహో.

సీ॥ సకలలోకమ్ములకు సత్యసత్త్వ మిట్టి, దనుచుఁ దేల్పంగఁ దామువ్రాసిన చరిత్ర
'సీమ'నాకొండుప్రతి వీ.పి చేరఁజేయ, వెంకటకవీంద్ర మ్రొక్కెద వేవిధముల.

మాగంటి వీరరాఘవశాస్త్రి. 24-8-13

...గుంటూరిసీమ, యనువివాదాంశగ్రంథమును నామూలాగ్రముగా జదివితిని సోదరకవులకునుమీకును గలిగిన వివాదసందర్భములో మీ తప్పేమి లేనట్టు యీగ్రంథమువల్ల యథార్థము బయల్పడినది...ఉత్తరరంగము గూడ...బంపగలందులకు ప్రార్థించుచున్నాను, ఖరీదు ఎంత ఐనను నరేముందుపంపుమని సెలవిచ్చిన బంపెదను.

చించినాడ వేంకటరత్నశాస్త్రి. బెజవాడ 29-4-13

సీ॥ సిరులఁజెన్నొందుగుంటూరుసీమ ప్రథమ,రంగమును గాంచితుష్టాంతరంగుఁడైతి,
వెలయనుత్తరరంగము వేమవరశ,తావధానను వీ. పి. గాదయనుబంప,
గోరివందములు సేతు, కోర్కెమీఱ.

చివుకుల పిచ్చయ్యశాస్త్రి.

స్కూల్సూపర్‌వైజరు,పొదిలె,నెల్లూరుజిల్లా,ముకాం తర్లుపాడు 21-7-13

శా॥ కనఁగొన లేక మీ ప్రతిభఁ గల్లరు లల్లిన ప్రల్లదంబులన్
గనివినియుబ్బువండితుఁ డొకండు శతంబున నైన నున్నె? యుం

డిననవలదిక్కటాహముల నిండి పయిన్ బయిఁ బొంగినింగిఁ బా
టిన భవదీయకీర్తిలహరిన్ నిలువంగ నెవార లోపెడిన్. ౧

చ॥ అనదలు కూళ లేరొకొ యహంయువులై తమనోటియూసుపో
వ నుడువురిత్త పల్కులను వంచనకల్గునెకొ? "యూరకుక్కకూ
సినయెడ జంగమయ్య కిలఁజేటగునే?,, బుధులేరు విన్న నీ?
యనుచుఁ జకారగుళ్లఁ గనరా? నగరా? మొగమెత్తనిత్తురా. ౨

ఉ॥ "అక్కనమాదనల్ చెలఁగునందల మెక్క నరప్ప సాటికిన్
నిక్కుచుఁ జెర్వుఁ గట్టవయి నిస్త్రపతన్ వెస నిల్చుమాడ్కిఁ, దా
రొక్కటరెంటఁ బామరులయొద్ద రహఃకుహనావధానముల్
జక్కనొనర్చి రన్నఁ దమసాటికి వత్తురె తక్కఁగైనరుల్. ౩

చ॥ అనవసరంపుఁ జివ్వకు నహంయువులై విఫలోరుశాఖ దార్
పెనఁగొని ముగ్దడించు పెనుపేరుల నీటుఁగలంచి నట్టి రీ
వినయవిలేక శాలు లిఁకెఁబెగ్గల వీడి రహస్థలంబులన్
గొనఁగుటమాని యిష్టయిన 'గుంటురిసీమకు' మ్రొక్కఁగాదగున్. ౪

క॥ సారతరహృద్య పద్యసు, ధారసనిష్యంది గీరతముబలెనరయన్
మీరచిత, సీమ, నరసం, బై రాజిలె నఖిలసూరు లౌననిమెచ్చన్.

రామడుగు సీతారామశాస్త్రి. 14-1-14

..."గుంటూరిసీమ" చేరినది... మిక్కిలిశ్రమకోర్చి ఆయాపత్రికలయందలి విషయములను ముందెన్నడో గ్రంథము వ్రాయవలయునని సేకరించి గ్రంథముతయారు చేసినందువల్ల తమకు 'చాణక్య' లనుబిరుదు సార్థకమైనదానినిగా దలంచుచున్నాను. తాము నిజములని వ్రాయించిన విషయములెల్లను నేను పత్రికలయందు చూచినవగుటచే యిందుమీరెంతమాత్రము అనృతము వ్రాసితిరని నేతలంపను.

వేమూరి సుబ్బరామశాస్త్రి. ఆళ్లమూడి 6-6-13

గీ॥ అంతియేకాక నారాయణశాస్త్రి యొకఁడు, బయలువెడలి గుంటురిసీమపటిమ నెల్లఁ
జించిచెండాడి వెనుఁజూపఁజేయనట్టిఁ, కేమిపురికెక్కు గుంటూరుసీమపగ్గ

గీ॥ కాన నారాయణశాస్త్రిముఖ్యగ్రమిఖ్యయాటు,మూఁడు సేయకమున్నె సమ్మోదమలర
నారయన్ గోరినాఁడఁ గుంటూరిసీమ, లోని యుత్తరరంగమ్ము లోకవినుత.

తెలికెపల్లి రామచంద్రయ్య. 25-2-14

శ్లో॥ ... పూర్వరంగ మమలం దృష్ట్వాఽఖిలం మాధవ
స్వాంతే మోదము పైతి సంత్యజతి శాఖాపక్షపాతాదికం॥

శ్లో॥ కాత్యాయన్యైస్య సమస్తం పరికథిత మను జాత్యైక దేశ ప్రగల్భా
నూయాశాఖాభిమాన ప్రకటితవశగా శక్తదౌర్జన్యజన్యం..."॥

శ్లో॥ ... శాఖాం విజానాతి హి నీతి బాహ్యకః॥

శ్లో॥ రాజ్ఞాంగృహేషు ధనశూన్యగృహేషు కుర్వంత్యుద్వాహకాంశ్చ విభవైర్న సమా
న్యశేవ, తద్వత్ర— విత్వరచనాసు చ సంతి బహ్వ్యః పాండిత్యవైభవమిదంతు వి
చారణీయం॥ భమిడిపాటి అయ్యప్పశాస్త్రి. 4-4-1913

మండవల్లి లింగాలపోష్టు, కృష్ణాజిల్లా.

మ॥ హరనారీ చరణాబ్జ చింతన మరందాసక్త హృద్భృంగ ?యు
త్తరరంగం బెపుడబ్బునో ?యనుచు నత్యాసక్తుఁడై వేంకటే
శ్వరదైవజ్ఞుఁడు దానినే మదినదా భావింపుచున్నాఁడు కా
నరయంబొప్పఁగఁ బంప వేఁడెదఁ గవీన్ద్రా ?ముద్రణంబైన చోన్.

ములుకుట్ల కోటీశ్వరః. 9-7-13 యింకొల్లుగ్రామం

..."గుంటూరుసీమ" యనుగ్రంథములు ఆరుకాపీలు V.P. ద్వారా తను నంతశీఘ్రలో నా అడ్రసుకుఁ బంపఁ బ్రార్థించెదను. ఉభయభాషాకవిత్వమహాకవులగు తాము ప్రకృత వర్ణనంతయు కలికాలము పైదోసివేసి.. నంతలో ... మాహాత్మ్యవిము... అధికమగుననియు. పెద్ద లనుకొనుటను విని విశదపడుచు కొంటిని

మన్యం సీతారామయ్య. 2-4-13
టీచర్. టవును హైస్కూల్ గుంటూరు

...గుంటూరుసీమను చూచినాను అందు నిజానిజములు తప్పక తేలుచున్నవి. యిట్టి సత్యమును దెలుపు యీ పొత్తము దేశమంతటను వ్యాపింపచేయుటకు భగవంతుని సదా ప్రార్థింపుచున్నాను. బొడ్డుపల్లి శేషయ్య. బోర్డుస్కూలు, మాష్టరు.
మందపాడు 27-3-13

స్థాలీపులాకన్యాయమునఁ జూపితిమే కాని మావద్ద నున్నసామగ్రిలో నెన్నవవంతుగాని కైకొన లేదు, సరికదా? వారినామములుగూడ నుదాహరింప లేదు, పాఠకవర్గము ప్రతివిషయమునకును గ్రంథవిస్తరభీతియే మమ్ము వెనుదీయించుచున్నది, పీఠికలో నక్కడక్కడ నుదాహరించిన ప్రతివిషయమును నేదో యొకటితక్క నిక్లేలవలేశముగాఁ గైకొనినదియే కాని యేదియును బూర్తిగా గైకొననేలేదు, ఈలోటు రాఁబోవు 'సమస్యాగ' గ్రంథపీఠిక తీర్పఁగాక యని యింతతో విరమించుచు నిఁక నిందలితప్పులం గూర్చి కొండొకచర్చించుచున్నారము, ఎచ్చటనేని యతిప్రాసములు, వ్యత్యస్తము లగుటంగూర్చి ప్రాజ్ఞులు గణింపరు, అది భ్రాంతిమూలకము, అనివార్యము, దానింగూర్చి యితరులకు గోచరించినంతగ్రంథకర్తకు గోచరింపదు, ఆవిషయముకని పెట్టుటకుఁబాండిత్యముతో నవసరము లేదు, యతిస్వరూప, ప్రాసస్వరూపములను దెలిసికొనుటకు సరిగా 5 నిమేషములకన్న నెక్కుడుకాలము పట్టదు. అట్టి స్వల్పవిషయమును గూర్చికూడ దినంతులు గొట్టువారు నేఁడు బయలుదేఱుటచే నీకాలముయొక్క దుస్స్థితికిఁ జాల విచారపడవలసియున్నది. ప్రకృతము, హితకారిణీమన్వార్థంజనుల్లు . మాఘ్నుఁదప్పులు చూపవలయుననియెంచి పైరీతి తప్పులనే యన్వేషించి యవాకుచవాకులను వదరుచున్నవి, ప్రథమముద్రణము నందలి స్ఖాలిత్యముల నిటీవల నవరించితి మను మాటకూడఁ బాటింపక యీపత్రికలు ఊరక ప్రోఁగ మొదలిడుట మఱియును విచారణీయము, స్వాత్మదౌర్బల్యప్రకటనమునకై తమంతఁ దామే పలువిధముల సాక్ష్యము నిచ్చుచున్న యీపత్రికలు చూపు తప్పు లెట్టివో తెల్పుటకు ప్రకృతగ్రంథమునుండి కొన్ని యుదాహరించుచున్నారము.

౹౹వి | ద్యామహేంద్రులు పశ్యశబ్దమ్మునైని సారెకుఁ గొందఱు

ఇందు విశ్రమ్ము పొరఁబడ్డినది, దీనింబట్టి యజ్ఞతను సమర్థింపనెంచుచో తి॥ వెం॥ కవులకు, యతియననేమో తెలియదని కాని, అక్షరజ్ఞానము లేదని కాని, మొఱఁగవలసి యుండును. ఈమాట విశ్వసింపఁజేయుట కడుఁగష్టము, ఇట్టి ప్రయత్నమునకుఁ బాటుపడువారి నేమనవలయును? మఱియు.

డం|బలరు నియోగి వైదికులు నందుచునుందురు.

(పూర్వరంగము 4వ పుట 6వ పద్యము చూ)

ఇందుఁ బ్రాసము పొరఁబడినది, ఈపద్యము రేఫప్రాసకము, కావున, అల

రు, ఒరయు, అందు, ఒందు, గా మార్చికొన్న సరిపోవచ్చును, యతివిషయమున 'వశ్యశబ్దము తప్పగాదని కొందఱు' అని సవరించుకోవలెను. ఇట్టి భ్రాంతి ప్రయుక్తములగు స్వల్పలోపము లెందఱచేతనో యెన్నిసారులో సంస్కరింపఁబడుచువచ్చినను భారతాదులయందుఁగూడ నిప్పటికిని గ్రావితక్రముగాఁ గానవచ్చుచున్నవన నస్మదాదులలెక్క యేమి, భ్రాంతినశించినఁగాని యీలోపములు నశింపవు, అది ప్రపంచముతో పాటుండఁదగినది, బ్రహ్మాదులుగూడ దానికి దాసులు, ఇది విషయాంతరము, ఇంక వ్రాయవలసినవి చాల సంశములుగలవు, వ్రాసిన వానివలనఁ దక్కినవి యూహించుకొందురుగాక, పూర్వరంగోత్తరంగములలో సూత్రప్రాయముగా నాయీవివాదకు సంబంధించిన యావద్గాథయు నిముడ్పఁబడినది, ఆది ఆసనచర్చయు, అంతము వేమవరావధానప్రయుక్తమగు సమ్మానమును గనియెఱుఁగునది, ఆసమ్మానసమయమునందలి పద్యములుమాత్ర ముదాహరించి విరమించుచున్నారము.

చ॥ తిరుపతివేంకటేశ్వరసుధీకరయుగ్మ మలంకృతంబు చే
సిరికద? కంకణంబులఁ బ్రసిద్ధులు నల్వురు చెన్నయాపు ల
బ్బురమును సంతసంబు నెదఁ బొంపిరివోవఁగఁ జూచుచున్నయం
దఱునయనంబులం దవి కనంబడుచున్న వదేమి చిత్రమో.

తి॥ శా॥

ఉ॥ ‹గోడకు వెల్ల వేయు టది గోడహితమ్మును గోరి కాదు మో
మోడి భవత్కుతూహలము నోమఁగ సింగపుమేల్మిబంగరుం
బోఁడిమికంకణమ్ము లివి పూనుచునుంటిమి యిందు కర్తృఁడౌ
వాఁ డెవఁడో? యెఱుంగఁగలప్రాజ్ఞులు మృగ్యులు నేఁడు చూడఁగన్

వెం॥ శా॥



శ్రీమత్పరదేవతాయై నమః.

# గుంటూరిసీమ, ఉత్తరరంగము.

శ్లో॥ ఉన్నతం పద మవాప్య యో లఘుః, హేలయైవ స పతే దితిధ్రువం
శైలశేఖరగతో దృషత్కణః, శ్చారుమారుతధుతః పత త్యధః॥ ౧
(రసగంగాధరము చూ)

శ్లో॥ యద్యపి నదతి సరోషం, మృగపతి పురతోఽపి మత్తగోమాయుః
తదపి నకుప్యతి సింహో, వినదృశపురుషేషు కః కోపః॥ ౨
(అలంకారశేఖరము చూ)

శ్లో॥ సంత స్సచ్చరితోదయవ్యసనినః ప్రాదుర్భవద్యంత్రణా
స్సర్వత్రైవ జనాపవాదచకితా జీవంతి కృచ్ఛ్రం సదా
అవ్యుత్పన్నమతిః కృతేన నసతా నైవాసతా వ్యాకులః
కృత్యాకృత్యవివేకశూన్యహృదయో ధన్యో జనః ప్రాకృతః॥ ౩
(కువలయానందము చూ)

(సదుపదేశము)

చ॥ వలదు నియోగివైదికవిభాగము, కొంపలు ముంచుదాన, వ
ర్తిలుఁడు యథానుపూర్విగ, విధేయులు విద్యకుఁగందు శాఖకుల్
జల మిడ నెంచి నక్రంధమును బాయఁగఁ ద్రోచు టదేటి తెల్వి, పూ
ర్వులహృదయం బెఱుంగుఁ డని బోధ యొనర్పఁ గదమ్మ శాంకరీ॥ ౧

చ॥ వలదు నియోగి వైదికవిభాగము వల్వ దసత్యగోష్ఠి, ము
గ్ధులను విదగ్ధులన్ సరిగఁ దూఁచెడి తక్కెడకై ప్రయత్నమా,
వల దపలాపముల్ గిలుక వల్వదు వల్వ దటంచు నంబికే
వలదురితంబుగా నడుచువాఁతల కాళ్లకురిన్ ఘటింపుమీ॥ ౨

చ॥ వలవని కోర్కులం బడినవా రెవరున్ సుద నెగ్గ లేద, యీ
కలియెడఁగూడ సత్యమునె కాంతురు గాని యసత్యమన్నఁ బె
ద్దలకుఁ బ్రపత్తి లేదు ఋజుధర్మము పట్టి చరింపుఁ డంచు మూ
ర్ఖుల ననికొల్పు పెద్దలకుఁ గొండొక బోధ యొనర్పు మంబరో. ౩

## గ్రంథప్రవృత్తి.

చ॥ సత్య, మసత్య, మంచు మనుజన్ముల మంచికిఁ జెడ్డకున్, సదా
దౌత్యము సేయుచుండెడిపదార్థము లందొక దాని కింకొకం
డత్యయమున్ ఘటించెడి యథార్థపదార్థము నిల్పయోగ్యులున్
బ్రాత్యులు వేఱొకండు నిలువన్ బ్రయతించుచునుండ్రు శాంకరీ. ౧

చ॥ నిలిపిన నిల్వఁ జాలని దనిత్య మసత్యము, నిల్పకున్నను
న్నిలిచి యనంగఁజాలినది నిత్యము సత్యము, సత్వరప్రభా
కలన కెదే నిమిత్త మది గావలెఁ గావున దానికై మహా
త్ములవచనంబు లూఁత గొని పుస్తక మియ్యది సేతుమంబికా. ౨

ఉ॥ నోటుకుఁ గాలదోష మది నోటియెడన్ గొఱ గాదు కాన నె
ప్పాటను యుక్తి నేయుదు సపర్ణత గల్గదు తప్పుత్రోవలం
దాఁటెడివారిరజ్జులు వృథా, ఋణ మిచ్చి యపర్ణుఁడున్ ద్విష
త్కోటి నెదిర్చి పేర్చి కవికుంజరుఁడున్ వెలుఁగొందు నంబికా. ౩

మ॥ మనవాఁ డెవ్వఁడు? సత్యముం బలుకునంపతాగ్రామి, యన్యుం డెవం
డనృతం బాడెడిదే బె, యీనియతికిన్ న్యాయైకదృష్టుల్ శ్రుతుల్
తనియన్ బ్రొగ్గెద రన్యులో? మొఱకులై "తాఁబట్టుకుందేటికిన్
జనుఁ గాదత్రయమే" యటన్నసుడికిన్ దాసానుదాసాగ్రణుల్. ౪

మ॥ ధనమున్ జూడరు వేషభాషలకుఁ బందల్ వోలె లో జంకరె
వ్వని కేగౌరవ మంతె కాని యధికత్వం బొప్పఁగాఁ బో[illegible]
జ్ఞానులన్ దక్కఁ దదన్యులన్ మనమునన్ జర్చింపఁ గాఁ బోరు, ధీ
ఖనులంచున్ జనసీ? ఋతం బడఁచు ప్రాజ్ఞుత్వేశికిన్ దెల్పుమీ. ౫

## పూర్వవిద్వన్నాగరికత

శా॥ *"మీవిద్దెల్ ధన మిచ్చి కొన్నయవి మీమీపోకలెల్లన్ ధనా
శావిద్ధంబులు పూర్వనాగరికవిద్యాభ్యాసముల్ వేఱు, త
ద్భావస్ఫూర్తులు వేఱు, వారు మనకై దైన్యంబు నైకోరు మీ
త్రోవల్ వారికి నైఁప రాని వని యుద్బోధింపుమీ శాంకరి. ౧

శా॥ పూర్వాచారులవిద్దె నేర్చుగుణలుబ్ధుల్ వారిమర్యాదలే
సర్వోత్కృష్టముగాఁ దలంతు రిపు డాచారమ్ము లే మున్నవీ
దుర్వారుల్ గనఁ బోరు, దూర్వ లెనయా దుర్వాసుతో నందు రో
శర్వాణీ! యిటువంటియోగులను లక్ష్య మ్మేల సేయన్ వలెన్. ౨

---

*ఆంధ్రభారతి యను పత్రికనుండి.)

### ప్రాచీన గురుశిష్య పద్ధతి.

శా॥ బెంచీ లక్కఱలేదు "గేమ్సు" మొదలౌ "ఫీజుల్" వినన్రావుపొమ్మంచున్ నిర్ధనుఁ ద్రోచివుచ్చరు గురుల్, "పాస్" సైన నే లాభమిం। దంచున్ నేమమూ లేదు మీ చదువునందాలోక మీలోకమున్ । గాంచన్ వచ్చెడినార్యులార! మిము మ్రొక్కఱన్ జెల్లు నెకాఱలమున్॥ 1. ఉ॥ కుక్కఱల నక్కఱలం గుఱిచి కోళ్లఁ బోటేళ్ల గుఱించి కాక మీ । రెక్కుడఁ జూచినన్ ద్విజగదీడ్యచరిత్రుని దేవునిన్ మహా । భక్తికమై నుతించుసురవాక్కులు శిష్యులకిచ్చి వారి దౌ । వాక్కును దేహమున్ భవముఁ బావనమున్ బొనరింతురొప్పగన్॥ 2. ఉ॥ చెక్కులకాళ్ళ ముండితపు శీర్షము శూన్యలలాటమున్ మఱిన్ । గొప్ప బడాయివేషములుఁ గుచ్చులపాగలుఁ గోట్లుఁ గంఠమం । దొప్పెడి పట్టముల్ గలుగునెజ్జలు శిష్యులు నీకు లేరు మా । యప్ప! చిరాయువై బ్రతుకు మమ్మరో వేదమ! నీకుమ్రొక్కెఱదన్॥ 3. ఉ॥ చాపలె యాసనంబులఁట; జందెములే వరవారవాణముల్ । పాపము పాఁజౌలుసదిపట్టులు శాలలు; పుణ్యలోకముల్ । చూపెడి మాలికల్ మెడకుఁ జుట్టినపట్టము లర్థమిమియే । ప్రాపగు జీత మిట్టిగురువర్యుల శిష్యుల మ్రొక్కుఱటొప్పదే॥ 4. క॥ ధనవంతులకన్నను ని। ర్ధనవంతులె ప్రీతిపాత్రతములగు శిష్యుల్ । వనమాలిఁదెల్పు లేటే చదు,వన మాలిమి నెగడు మీకు నంజలి సేతున్॥5. సీ॥ అరుణోదయ మ్మగునప్పుడ మేల్కొంచి యాత్మాను సంధాన మాచరించి। ఆపగాదులకేగి యట స్నాన మొనరించి రవి త్రియీమయుని కర్ఘ్యము

## టాటోటురటకుఁడు

శా॥ కొట్టె న్సహాసహం బదియుఁ గొండొక కొంకు వహించు నెవ్వనిం
దిట్టఁగ, దానిఁ గుట్టునలదీసుని నాలుకయు వెనక్కుఁ దీయు నా
పుట్టుగుబమ్మచారి యెటుబొంకిన నేమగు? నట్టిచీపురుం
గట్టలు గిల్కువాక్తతలకు గౌరవ మెక్కుడి దస్త్రి? శాంకరీ. ౧

మ॥ ఘటచేటీకరనీచకాచకలనాక్రాంతంబు కర్ణద్వయం
బఁటి? నానానృతపాతకాంచితవృథాహంకార పంకాంకితం
బఁటి? చేతం; బటువంటివాఁ డొకఁడు పేరానించి టాటోటులన్
రటియింపన్ గటువౌనుగా కవియ ధీరవ్రాతముల్ చూతురే. ౨

---

లానంగి। తముఁ బోలివర్తింపఁ దగుశిష్యగణములు వెంబడిరాఁగ గృహంబుఁజేరి
నిన్న దండెమ్ముపైనించిననీరాకవి వుట్టముల్ ధరియించి భూతిదాల్చి॥ తే॥గీ॥ దేవ
తార్చన మొనరించి దేవదేవ। నామపూర్వకముగ వేదనాదమును ద, దంగవి
జ్ఞానమును శిష్యులనువదింపఁ, గాల మేగించు పూజ్యుల గారవింతు. 6. చం॥ నృ
పతులు వచ్చి దూరమున నిల్చి నమస్కృతిఁజేసి పూర్తిగాఁ, దపమును వేఁచియా
పయిని దగ్గఱకుం జనఁదెంచి 'మీకునే। ది పనియొ తెల్పుఁడీ యిపుడె తీర్చెద
మన్న "మకేమి లోటులే, దపరిమితంబ సౌఖ్య, మనునట్టి తపస్వుల మిమ్ముఁ
గొల్చెదన్॥ 7. ఆ. వె. చంకజోలితోడఁ జనుదెంచునట్టివి, ద్యార్థిఁగాంచి బ్ర
హ్మయరుగుదెంచి, నట్లు సంతసించి యన్నమ్ము పెట్టు ప,తివ్రతా మణుల నుతిం
తు భక్తి, 8, ఉ. "వారలు మీకు విద్యనిడవారము లేమిడఁజాలమే., యటం, చా
ఱని పేర్మి దేవుగతి నారసి భక్తినిబెట్టి విద్యపైఁ। దీఱనియాస్థఁ జూపెడి విధిప్రతి
మానుల నగ్రహారవుం, బాఱుల వారిగేహినులఁ బాయనిభక్తి నుతించి మ్రొక్కె
దన్॥ 9. శా, ఏరాజుం గన నిచ్చలేమి 'నెటులో యీపొట్టఁ బోషించియే! తీరం
గావలె' నంచు భైక్ష్య మది యెంతే శ్లాఘ్యమంచెంచి యా, చారం బొప్ప గృహం
బు లేగి వెనుకన్ ఛాత్రవజుల్ రాఁగ నం,సారంబీఁదుచు విద్య నేర్పెడి మహా
సంస్కర్తలన్ మెచ్చెక్కెదన్॥ 10. కం॥ భృతకోపాధ్యాయులఁగని, మతిలో నే
వమ్మగాంచు మాన్యులకున్ బ్రో, న్నత వేదశాస్త్రవిద్యా, రతులకు నతులిడు
దు రాజరాజనతులకున్॥ 11. మ॥ శుచియా వేషము శుద్ధమా మతము సంశుద్ధం

ఉ॥ "ఆవులు దూడలుం గలుగ నార్వులు గుంజల కేల" తా నెవం
డీవిషయంబు నేమెఱుఁగు నింతకుఁ దన్నెవఁ డీసడింపకే
పో విడుచుణ్ జరిత్ర మన బొంకులు బూతులుఁ గూడనా నుకో?
కావల మేడ? సత్యపుఁ బ్రకార మదేడ? వచింపు మంబికా. 3

ఉ॥ ఇట్టి వృథా ప్రజల్పకుల హీనపు వ్రాతఁలు కీర్తికామినిం
గట్టుడు నాపె "కాళ్ల కురి గట్టె" నటం చొకమూల నాఁగుచోఁ
బట్టపగంటఁ జుక్కలప్రభావము వెల్గక పోదు "తా డొంగిణ్
రొట్టెయుఁ గాకపో దొకనరుం డలతానును గాకపోఁ"డిఁకణ్. ౮

---

బు దేహం బని। ర్వచనీయం బగుపాండితీగరిమ ద్రవ్యంబం దనాసక్తి, పూ। ర్వ
చరిత్రఁబులయందు భక్తియును ఛాత్ర శ్రేణిపై రక్తిగ। ల్గువతు ర్వేదుల సాంగులణ్
నిరతమున్ లో నెంచి కీర్తించెదణ్॥ 12 మ॥ఘను లుద్యోగులు వచ్చి "మీసుతు
నకుణ్ గన్యమణిణ్ మేటులో। ధనధాన్యాదులతో నొసంగెద" మనణ్ దత్క్ర
న్యఁగైకో మనం। బున నిష్టంబదిలేక "మీరలతులుల్ పూఁబోఁడి మీకన్నె మే।
మనఁగా రిక్తుల" మంచుఁ దప్పుకొనుమి మ్మర్చింతుఁ బుష్పమ్ములణ్; 13. చ॥ధ
నమును భూమియుణ్ దమకుఁ దామయిఁ యిచ్చెడిరాజు లుండ "నం। దనులకు
విద్య రాదు ధనధాన్యవశంవదులైన" నంచుఁ గై। కొనక యెటో కుటుంబము
నకుణ్ భృతి గూర్చుచు నిస్పృహత్వమే। ధనముగఁ గాలమున్ గడపు ధన్యులఁ
బూర్వుల నాత్మ నెంచెదణ్॥ 14. ఉ॥ రా జరుదెంచునప్పటి కరఁటులతోఁటకు
గొప్ప ద్రప్పత। మ్మౌజనపాలుఁ డొయ్యఁగని। "యార్య! కృతార్థుఁడనైతి
మీకు న్వ। ర్యాభజము లెక్కలే దయిన భూమియొ ద్రవ్యమొ స్వీకరించి మా। తేజ
ముఁ బెంపుఁ" డన్న గణుతింపనిసూరుల నాశ్రయించెదణ్॥ 16, ఉ॥ "పుట్టితి
మెట్టులో యచటఁ బుట్టినయూ రెటు వీడవచ్చు ని। వ్వట్టున నే వసించి బుధవ
ర్యులఁ జేసెదఁగాక శిష్యులణ్। బెట్టెద నేనయన్న" మని పేదతనంబనుకోక
తాతలం। బట్టి స్వశిష్యులణ్ జెనుచువారి నుతించి యశంబు త్రుంచెదణ్॥ 17.
ఉ॥ పెట్టెలులేవు కల్గినను బీగము నున్న విభూతినంచియే। పట్టుదాకందు భూతి
నిడు బంగరవుంగని గాఁగ రాజరా। జట్టులు శిష్యవర్గమున కన్నము విద్యయు
నిచ్చు వేలుపుం। జెట్టుల మద్గురూత్తములఁ జెప్పి మతాక్క్రరి నెట్లు చెప్పెదణ్॥

తిరుపతి వేంకటేశ్వరులు.

ఉ॥ వానిది నోరు గాద యలవానిది నాలుక యుఁగాద, తోఁచిన
ట్లేనరుఁడే ననత్యములనే నెగడించును, యట్టివాఁడు తా
జానిస్వనామ మూనినను జందన మూనినరాసభంబె దూ
రానఁ బరిత్యజింతు రలవాఁడ్రయనకానినుఁడుల్ బుధాగ్రణుల్. ౫

ఉ॥ ఉన్నది యున్నయట్టులుగ నొప్పిక మీఱ లిఖింతు మంబరో ?
కన్నవుదొంగ వ్రాఁతలవ్రికారము నోటికి వచ్చినట్లుగాఁ
బన్నము, బన్న మాగిలుకువ్రాయనకాండ్రశిరాన నుంచి వి
ద్వన్నుత మైనమార్గమునఁ బంపెడిభారము నీది యీదెసన్. ౬

(త్రిశంకుస్వర్గము)

చ॥ అతనిని రోగి యందు రెవఁ డల్లవసిష్ఠగవీప్రసవంతికై
మతి చెడి పోరి యోడి మతిమత్తుఁడై తప మాచరించి బ్ర
హ్మత యొక కొంత గాంచె నలయాతఁడె గాధిజుఁ డాతఁ డిచ్చె స్వ
ర్గతి నొకరాజసూతికి సురప్రభుఁ డొప్పమి కాగ్రహించుచున్ ౧

ఉ॥ గద్దము మీనముల్ పెరిఁగి గాధిజుఁ జేయవు వేని నేని యా
చెడ్డమునీశ్వరుం డొకని త్రావతియన్నను జేర్పఁ బోయి తాఁ
బడ్డ పరిశ్రమంబు భగవంతుఁ డెఱుంగుఁ గృతార్థుఁ డయ్యె నే?
అడ్డఁడె యింద్రుఁ డీడావయిక థాంశ మెఱుంగనివారు లేరుగా ౨

(పౌండ్రికవాసుదేవీయము)

ఉ॥ ఉండుట్రి జగమ్మునందు మును పుండినయట్టులె యుండు వారు పె
కద్రండుట్రి, వృథాభిమానమునఁ గర్జ మెఱుంగక కొండ టెట్లొ చే
కొండ్రవమానముల్ దమకుఁ గూడనిబల్ బిరుదుల్ ధరించి; యీ
*పౌండ్రకవాసుదేవుల నెవండు గణించు వచింపు మంబరో? ౧

(*హరివంశోత్తరభాగమునుండి.)

క॥...అనిమిషముని యిట్లనియె నాతనితోడన్,, ఉ॥...నీదువాక్యముల్, మాధవనాథ! యన్నియును మానుసము కానివి నాకుఁ జూడఁగన్,, క॥ హరియొకఁడె నీవొకఁడె, హరికిని నీకును విశేషమరయఁగ భూభృ, త్ప్రమాణువుల

(గౌతమీనది——సెలయేఱు)

ఉ॥ కొండలు వ్రీల బండ లూగిఁ గొట్టుక పోవుచుఁ దేల గౌతమీ
చండతరప్రవాహ మది శాశ్వతమై భువిఁ బర్వ నెన్నియో
కొండలనుండి వచ్చి యడఁగున్ సెలయే ళ్లట నూరుఁ బేరు లే
కుండఁగ "దివ్యటీసరస నుండెడిదీపములో" యనం బొరిన్. ౧

ఉ॥ అంతన పుట్టు నంతటనె యాఱుఁ గడున్ రయ మొప్పఁ బాఱు నొ
క్కొంత వెడల్పుఁ బొద్దు గలయే ఆది యే సెలయేఱు, దానిపై
నెంతటి మహాప్రవాహముగ నెల్లపుడున్ బ్రవహించుచున్ బవి
త్రాంతరమై తనర్చెడి మహానది గౌతమియందు శాంకరీ! ౨

---

కుఁగలయది 'వరికింపవు' హరికినీవు ప్రతియోధుఁడవే,... తే॥గీ॥ వలవదుడుగుము నిన్నును వాసుదేవుఁ, డందురేబుద్ధియుతులు సర్వాధివాస, సిద్ధమైవాసుదేవాఖ్య నెల్లెనట్టు, లుర్విలోపలఁ దత్తుల్యుఁ డొరుఁడు గలఁడె,, క॥ నీచక్రమునీశంఖము, నీచాపము నీగదయు నీఖడ్గంబున్, నీచారోపితములు విను, చూచిన నవ్వుదురు వీని శూరులు ధరణిన్,...క॥ నవ్వుదువారల నెఱుఁగవు, క్రొవ్వున నిటు పలికె దేల? గోవిందుని నీ, వెవ్వనిఁగాఁ దలఁచితివి తఁ, దుర్వీశ్వరాలెడు భవన్మదోద్ధతి యడఁపన్,......వ॥...శైనేయుండు(సాత్యకి) అట్టహాసంబు సేసియతనికిట్లనియె. ......తే॥ గీ॥ ఆదిదేవుని పేరు చిహ్నములు మోచి । నంతటనె యాతనికిఁ దుల్యుఁ డంద్రెనిన్ను, సింహకవచంబు దొడిగినఁ జెనఁటికుక్క, గంధ గజగంధమునకును గలదె నిలువ,,...వ॥ ... పౌండ్రుండు...ఒకదూత నాదైత్యదమను పాలికింబనిచిన,,...సీ॥ ... తిరిగి తంతటఁ బోక తేఁకువ మాలి నాపేరుఁ జిహ్నములుఁ గల్పించికొంటి, వాసుదేవుండన... నేవ కా,... బ్రతుకవలతేనివినుము... చక్ర మాదిగవిడిచి మత్సంజ్ఞ యుడిగి, నడికి చనుదెమ్ము నాశరణమ్ము సొరఁగ,, వ॥ అనియిట్లు దూతముఖంబున వెడలిన విమతువాక్యంబాకర్ణించి ... కమలలోచనుండు వానింగనుంగొని సీ॥ ననునట్టులరుగుదెమ్మనియెఁ గావున నెల్లయడియాలములతోడ నరుగుదెంతు, వినుతచిహ్నమ్ములు వీడుమన్నాఁడు గావునఁ జక్రపూర్వతఁ దనరువాని, దనమీఁద విడిచెదఁ, దనశరణముఁజొచ్చి మనుమంటగలదు గావునఁ గడంగి, తనశరణంబె పెంపొనరంగఁ జొచ్చి నిర్భయుఁడనై భూరి

(చ్యవనమహాముని)

ఉ॥ కొండలు బండలుం గలిసి గొబ్బగ నెంచి స్వపక్షపాత మా
ఖండలుచేతి కత్తి కిడఁగా గరుడుం డిడెఁ బక్షపాతియై
యుండియు వీకమాత్ర, మదియున్ జ్యవనుం డిడఁ, డాత్మశక్తి యి
ట్లుండు నటంచుఁ దెల్పుటకు నోజగదంబ! తృణీకరించుచున్ ౧

క॥ తనబలము నెదిరిబలమును, గననిక తన వజ్రి మట్టిఘనహేతియె కీ
ర్తిని గోలుపోయెఁ గొడవ, శ్లనిమొన నటు లాచరింప నవి యేమగునో. ౨

---

సంపదహరింతు తే॥ గీ॥ ధరణి నెందుఁ బేర్కొలవాఁడు దాను నాకు, దాఁటవచ్చు
నె తనయాజ్ఞ దడయకింత ,వట్టునేఁడు నెల్లిటిలోన నిట్టలముగఁ, జేయఁగలవాఁ
డనంతయుఁ జెప్ప మీవు,,... వ॥ ...అద్దేవుఁడు దివ్యగంభీరస్వరంబున నతనికి
ట్లనియె,, సీ॥ పొండ్రి భూవర! నీవు భావమ్మునందు మదీయాంకములు మోవఁది
విరితేని, నాపాలికేతెంచి నమ్రుండవై యేను నీవాఁడ నాకిమ్ము నీదుచిహ్నము, ల
నని వేఁడినలలి శాశ్వతంబులై చెల్లును వెట్టివై చెట్ట చేసి, తింకనైన వినీతి నేతెం
చి వేఁడుము ... వ॥" నీవు నన్ను రమ్మని దూతచేతఁ జెప్పి పుత్తెంచిన నీదెనవచ్చి
తగినబుద్ధియుం జెప్పితి, నిట్లు సేయుము...అనిపలికినఁ బౌండ్రుండతని కిట్లనియె,,
మ॥ అవనీనాథుల నెల్ల నుద్ధతుల గర్వాంధ్యం బడంగింప నేనవతీర్ణుండ, నెఱుంగ
వేయకటా! మిథ్యావాసుదేవాహ్వయం, బవనీశ! ధరియించి కొందఱకు మోహ
భ్రాంతి పుట్టించెదీ, యవలేపంబు నెఱింగి కావె నిను దండార్హుండుగాఁ జూ
చితిన్,, తే॥ గీ॥ నాకువెఱచి కైలాన యానంబు పేరఁ, గొంతకాల మమ్మోయిఁ
దప్పఁ గ్రుంకిపోయి, తీవు లేకున్నఁ జూవె మహావిభూతి, మెఱయవచ్చియు నీయూ
రనెఱవనైతి,,...క॥ వగతుఁడు చక్రము వైచిన, నగధరుఁడు సుదర్శనమున న
దితుత్తుమురై, జగతీస్థలిఁ దొరఁగెడు న,ట్లుగఁ జేసె సమస్తజగములును ముదమెం
దన్,,...వ॥ ఇట్లంగిఁ బగతు నపగతసమస్త సాధనుంగా నొనర్చి యమ్మహావీ
రుండు. తే॥గీ॥ ఏమిరా! వాసుదేవుఁడ నేనయనుచుఁ , జెప్పి కొనవచ్చు నేయిం
కఁ జెప్పుమ నాకు,...వ॥...గరుడ చరణ ప్రహారంబులఁ గృత్రిమగరుడలాంఛ
నంబగు తదీయ ధ్వజదండంబు ఖండంబులు సేసి...,, (విస్తరమెఱుంగఁ గోరు
వారు హరివంశోత్తరభాగము ఉపలక్ష్యానము చూడఁదగు)

(కాళింగులు)

ఉ॥ అంగమునిండ భూతి నిడి యల్పపువస్త్రము గట్టి చెంబు చే
లం గొని శుద్ధసద్ద్విజులలాగు నటించుచు నెందుఁ బోవు కా
ళింగులపోలిక న్నేఁ డకటా! లేకు లనేకు లొకింత నేరు పెం
దుం గనకే వధానిబిరుదుం దలఁదాల్తు రవేమి పాపమో! ౧

ఉ॥ వేసము పొట్టకోస మటు వేసిన వేతురు గాక యారసా
భాసులు నిక్కపుం ద్విజులఁ బట్టుక "మీరును విప్రులె? మిమున్
భూసురు లంట తప్పు మముఁ బోరునఁ గెల్చినఁగాని మాకు మీ
భూసురనామ మొప్పు" దని మ్రొఁగుదు రేమిటి కంబ? శాంకరీ. ౨

(లూత)

ఉ॥ అంబరమందు *సాలెపురు వాదరు వింతయు లేక ప్రేలుచుం
దం బోకయష్ట తోఁచు నది తథ్యమె? కా దటమున్నె యల్లియుం
చుం బహుతంతుజాల మది చూరున నంటుక యుండు దాని దా
రంబు మొగంపు దారపుఁ బరంపరతోఁ గలువున్ దిగంబడున్. ౧

ఉ॥ నేయనుగాత లూత యది నేర్చిన నేఁతగఁ బొట్టకోస మా
నాయము; బట్టకోసము జనంబు కువిందుని గోరుఁగాని యా
మాయపుఁబుర్వు నేఁతకయి మానస మించునె? యుంచుఁబో? యెటో
కాయమునందుఁ గప్పికొనఁగా, నది వచ్చునె? ముట్ట విచ్చునో. ౨

---

*21 వ సెప్టెంబరు 1912 సం॥ కృష్ణాపత్రికనుండి

ఈఁగపులి

తే॥ కీటకములందు మిక్కిలి కీర్తిఁగంటి। నీఁగపులి యందు రందఱు నెల
మి నన్నుఁ। గాదెయంచును మది వృథా గర్వపడకు। నరసులదివిన్న నసుదురు
సాలెపురుగ?, కపటమున నేదొ యొకవన్నె గడను బన్ని, యీఁగలను మోసపుచ్చు
ట నీఁగపులివి। కాని యెదురుగ నిలఁబడి కలనఁ గెలిచి। పేరుపొందిన దేది రూపింప
లూత? ఎట్టులో యొకరీతి నీకీబిరుదము। కలిగె నామాటలటులుంచు కలిగినంత।
మాత్రమున నూర్ణనాభమామదినిమిపులు, తలనుదాఁటిన గర్వంబు దాల్పఁదగునె

ఉ॥ అల్లినదానినే మరల నల్లును, గ్రొత్తవిధాన నల్లఁగాఁ
జెల్లదు సాలెపుర్వునకుఁ జేతయుఁ గాదది యెన్నిసారులే
నల్లినయల్లికే మరల నల్లెడి దానికె నంతసింత మా
యల్లిక యెందుకేని గొఱయైనది గాదుగదా మహేశ్వరీ. ౬

(నీరసాశుఘోషానిరసనము)

చ॥ ఎఱిఁగియు గ్రామ్యపుంగయిత కేమును బాల్పడబోదు మే మొకొ
ప్పర మొకవేళఁ బోరికి సభాస్థలికిన్ జనుదెంచెనేని; శాం
కరి! యదికాదుకూడదని కంకకుమమ్మ! ప్రసక్తి దీరున
త్తరపు క్షణంబునన్ మరలదానిఁ ద్యజించెద మాజ్ఞ యిమ్మికన్. ౧

చ॥ ఎలమిఁ దురుష్క నిందగిలి యేగిననాతికిఁ బ్రీతిఁ గొల్పె మొ
కర్కలుఁడు తురుష్కతాప్తికయి కట్టఁడిమార్గముఁ బట్టు భంగి వెం
గలులకుఁ బ్రీతిగొల్పఁ గలకాకవితం బురుడింప నెంచి క
శ్మలమగు గ్రామ్యధాటి కొడిసాచెడి తప్పను సైఁపు మమ్మరో. ౨

ఉ॥ తప్పులఁ దోఁపనీకు మెడఁదంగలశాస్త్రము గప్పిపుచ్చు మే
చొప్పననూ దడాబిడిగఁ జొప్పశలాకలఁ బోలు పద్దెముల్
గుప్పఁగఁ జేయు మెయ్యెడలఁ గొంకు ఘటింపకు మెట్లొ నూఱులన్
జెప్పినదే మహాపదవి నేయుమ మూయుమ గ్రామ్యచక్రముల్ ౩

ఉ॥ కష్టముగా నెటో భవదఖండ కృపామహిమమ్ము కల్మి నీ
ముష్టికవిత్వమధ్యమున ముద్దులు మూటలుగట్టఁ జాలు ని

---

సీతరాకర్తిముమునకును నీయశముకు! నీదుబిరుదంబునకు లోననీవు మెచ్చ! వలయు
నీజాతివాత్మ్రచ్చ వలయుఁగాక! యింక నెవ్వరుమెత్తురో యీఁగలవులి!, యెన్ని
రూ కొన్నకీటము లున్నవినుమి! వానికేమియు గర్వంబు గానఁబడదు, వెదకి
రవ్వంత యల్లికల్లుదువా లేదా! మేలు నీదు గర్వము పట్టఁజాలకుండెఁ, జాలునింత
టి నాంతైన సాలెపురుగ!, బుద్ధి తెచ్చుకొని నయాన బుజము లెగర! త్రైచి కొనుటచా
లించి గర్వంబువిడిచి భద్రముగ నుండు మిదియు నీబ్రతుకు దెరువు.

విప్పర సోదరకవులు

ద్రుష్టపుఁ బద్యమున్న నది తొల్లి రచించిన దండుగై, వారి సం
తుష్టికి నట్లు కాదనుచుఁ దోఁపఁగఁ జేయుట యెట్లు శాంకరీ. ౪

ఉ॥ గిరగిరఁ ద్రిప్పమోఁగెడిఁ బకీరుకరమ్మున నొక్కయంత్రము, మా
"కిరకిర,, బాలురన్ దనుపఁ గీల్కొనుభంగియొ మాన్యమైన చోఁ
బరపరలాడుచున్ గవితఁ బాడెద డాబిడిగా నటంచుఁ బా
మరులు నుతించుపూనికయు మాన్యతఁ గాంచుఁ గదే మహేశ్వరీ. ౫

మ॥ స్వరవర్ణ్యత్వమెఱుంగకే పొరిఁబొరిన్ సంగీతముల్ వాడి యె
వ్వరు మెప్పింతురు! గాయకోత్తములు వహ్వ నాఁగ; నట్లే పర
స్వరసందర్భము శ్రోత్రపేయతయు సౌశబ్ద్యంబు లే కెట్టులో
విరచింపన్ గవితల్ శ్రవోయుగళికిన్ విందుల్ ప్రసాదించునే. ౬

చ॥ "పదనిస, సానిదానిపద, పస్వరీసరి, గామగారిసా,
సదగద, నీరిసారి, దరిసా, గరిసా, నిరిసా. రిసా, రిసా,
గదగద, పాదపాద, సదగా, పదగా, నిదగా, దగా, దగా,"
యిది యొకగానమేని యెదియేనిఁ గవిత్వమగున్ మహేశ్వరీ. ౭

ఉ॥ "చేసినదోసముల్ బయలుసేయఁగ నెంతువె! దుష్కవిత్వ వి
న్యాసము పైటఁబెట్టుటకునై గమకించెదవేల" యంచు దే
వాసురయుద్ధముల్ గెలిచినట్టిఁడు పండితరాజు చేత నీ
వీస డిలంగఁజేసి మము నెందుకు దూర్చెద విందు శాంకరీ. ౮

ఉ॥ ఎంచి పురాదులైన పదునెన్మిది వర్ణ్యములంగుఱించి వ
ర్ణించి కథానుగుణ్యముగ నించి రచించియొ యుంచి రంచుఁ బ్ర
శ్నించినచో నదుత్తరము చెప్పుటకున్ దగనైన యుక్తి దోఁ
పించి యనంతరమ్మ నడిపించుమి యీకృతి కో మహేశ్వరీ. ౯

చ॥ కవివరులెల్ల మేలనఁగ గ్రంథములన్ రచియించి కవ్రిపుం
జవుల జగమ్మునుంచెడి ప్రశంస ఘటించియు నేఁడు కొవ్రిపుం
గవులకతమ్మునన్ రసము గన్పడకుండెడి దిక్కుమాలు కా
కవితకు మమ్ముఁ బాలుపడఁగా నొనరించెదె మాలదైవమా. ౧౦

చ॥ గడియకు మూడువందలఁట? గంటకు డెబ్బదివందలంట! త
ప్పడుకవనమ్ము చెప్పుటకుఁ బూనినవారిని బుట్టఁజేసి యె
ప్పుడు నరసాశునత్కవనముల్ బచరించు మదీయవస్త్రముల్
"బడబడ" మ్రోఁగు "తాషమరపా" నొనరించెదవమ్మ యీశ్వరీ. ౧౧

ఉ॥ వృత్తవిశేషముల్ చెడి వివేకము పాకముదప్పి సద్గుణా
యత్తతఁ దక్కి శయ్య యొకఁ డంతగ బొంతగ సంగ్రహించి యే
పొత్తును రోయకే పలుకుపోకడ నేరిపి మాదుకైత ను
న్మత్తతమైఁ జరించుకన్నుమాలగఁ జేసెదె మాలదైవమా. ౧౨

చ॥ తొరతొర గ్రామనామములు తొంబదియో పదియో సహస్రమో
వరవర గుక్కత్రిప్పకయె వాగెడి విప్రవినోదివై, ఖరిల్
జరచర నూరు జార్చుటది సత్కవిధర్మము గాదటంచు నీ
వెఱిఁగియు దానికై మనము నేటికిఁ గొల్పెదవమ్మ శాంకరీ. ౧౩

ఉ॥ అక్కట! నీరసాశువున నందముఁ జందము లేక యెట్టులో
గ్రుక్కలు మ్రింగుచున్ వెడఁగు గొల్లలనుద్దుల నెంతపాడినన్
దక్కునె "కైత" యన్ పదవిదానికి, "గాడిదగంపెఁడూఁక చాఁ
బొక్కిన నేమిలాభ" మను బొంకక తెల్పఁగదమ్మ శాంకరీ. ౧౪

ఉ॥ అబ్బెన మేల నేయవలె నంబరొ? తంబుర, యొంటికంటి త
బ్బిబ్బు మృదంగ,మీద్వయమె వేషముపట్టిన లోటు గాని యా
బొబ్బిలిపాటగాండ్రతలఁపుం గొలువంగల పాటుకైతముల్
సిబ్బితి గల్గి పండితులచే నుతిగాంచెడి కోర్కె యున్నచోన్ ౧౫

చ॥ కవితయుఁగాని సంతతియుఁగాని జనించిన యత్తరక్షణం
బవిసి నశించెనేని ఫలమబ్బునె? గర్భభరమ్మదక్క, నా
యువు లవమేని లేనిసుతు లొక్క సహస్రము రెప్పపాటులో
శివ! శివ! పుట్టనేమి యగుఁ జెప్పఁగదమ్మ, మదంబ శాంకరీ. ౧౬

ఉ॥ ఆశుకవిత్వమందు రస మారయ రాదని యప్ప సెప్పె నో
యీశకుటుంబినీ! జననమే లిఖియించిన బంతిక్రిందనే

నాశముఁగూడ వ్రాయుటది నల్వకు నమ్మత మౌనుగాక గ
ర్భాశయమే స్రవించుటకు నక్కట! దీనికి భేద ముండునే, ౧౮

ఉ॥ "మారుని గేరఁజాలు సుకుమారుఁడు, కన్నులు చేరెఁడేసి, బం
గారము మే" నటంచు స్మృతి గాంచిన బాలున కేడ్పుభంగి వి
స్తారరసమ్ము గల్గుటయు సంభవ మందెడుఁగాక నిల్వఁగా
నేరని కొప్పపాశుకవి నేరుపులేటికి మాకు శాంకరీ, ౧౯

చ॥ పలుకుల కల్కి నేర్పిన సుభాషితముల్ జతఁజేసి కచ్చపిన్
బలుకఁగఁ జేయ దానికి సుపశ్రుతిగా శ్రుతివిందు సేయుచున్
గలకలలాడు కంకణవికస్వరసుస్వర మట్టులుండు మా
పలుకులొనర్చెదే యిసుపబాడిగ బండిరవంబు లీశ్వరీ. ౨౦

చ॥ కలుషితమైన నీర్దురసు గాఁ బ్రవహించెదు నట్లె తప్పఁగా
తలు దొరలున్ దడాబిడిగఁ; దజ్ఞుల కెట్లు రుచింపనౌ, శర
ల్లలితకలావిలాసవిమలమ్ములు నత్కమలంబులో, రస
జ్ఞులకు రుచించునట్టిద యగున్ హిత మాశుకవిత్వ మేరికిన్. ౨౧

‡(తెలకుఁదగని వ్రాఁతలు)

మ॥ కవితాతత్త్వరహస్యవేత్తృతకునై కష్టించునుత్కృష్టని
ష్ఠవివేకుల్ కులగోత్రనిందకులు, వేదాచారపారంపరీ
దవవహ్నుల్, సకలాన్నభోక్తలు, నమస్తస్త్రీకుటుంబుల్, మహా
సువివేకుల్, వితరీత మీతెలివి విజ్ఞుల్ రోయ కెట్లుండునో రే
కవు లివ్వారి గణింత్రుపో వీరలొకో లోకం బన్నఁ నేఁ డంబికా. ౧

---

‡(మే 10 వ తేది 1913 వ సం॥ కృష్ణాపత్రిక నుండి)

# చరణాయుధప్రశంస.

ఒకభాషాభిమాని:—

ఈపోట్లాటకు అంతంలేకుండా ఉన్నది. ఈకవులు కోళ్ళనుగూడా మించిపోయినారు. తురుష్క-యుద్ధమైనా ముగిసేటట్లున్నది. కాని యీకవుల కలహమెప్పు డారంభమైనదో దానికి విసుగు విరామము లేకుండాపోతున్నది. అంత

ఉ॥ దుర్మతముల్ కడుం బ్రబలి తొందర గొల్పెడువట్లు, ధర్మపు
న్మర్మ మెఱుంగునార్యు లవి మాపినయట్లె కవిత్వతత్త్వవి
త్కూర్ముల లాఁగఁగా వలెఁ గుకావ్యము; తాదృశధర్మకార్య మే
కర్మ మెఱుంగఁ జాలనియకర్మపరుల్ నిరసింప నేమగున్. ౨

ఉ॥ జన్మము లాఁగి పోయెనొ? యశస్సుల నత్రము లాఁగిపోయెనో?
అన్నము మాల మాదిగల దండలకుం బ్రియమై తనర్చెనో ?
దున్నల కాలు భార్య లయి తోసము నందెనొ ? ప్రోడ శిష్టసం
పన్నగృహస్థపుత్రికరపంకజ మంటెనొ? వీరియార్పులన్. ౩

ఉ॥ ఏనది కాదు కాని దగు నం చది దేశము నుద్ధరించు నం
చేనరమాత్రులో గిలుకునేవఁపు వ్రాఁతల కూఁతలై యశో
ధీనులఁ బార్వపండితగతి న్మతిఁ జొన్పెడి జ్ఞానులన్ మహా
ధీనిధులన్ వృథా దెగడు తెల్వ్యలవిల్వల నెంచ నేటికిన్. ౪

---

కంతకు కక్షలు ప్రబలుతున్నాయి. ఇరుపక్షములచుట్టు గ్రామసింహలుచేరి గర్జనము మొదలు పెట్టినాయి. ఈపోట్లాటల నాపించే ప్రభువెవడుకనపడడు! వీటివిషయమై ఆంధ్రపత్రికలు జాబులు ప్రకటించకూడదని దొరతనము వారొకచట్టం చేస్తే బాగుండును. కవులకే బుద్ధిలేనప్పుడు నావంటివారేమి చేయగలరు?

(మే 15 వ తేదీ 1913 వ సం॥ సుదర్శినీ పత్రికనుండి)

# కవులకలహములు.

గతవారపు కృష్ణా పత్రికలో కవుల కలహములను గూర్చి విచిత్ర చిత్రావళిలో నొక చిత్రము ముద్రింపఁబడినది. అందు రెండుతలల కోళ్లు రెండు ముఖాముఖిగా నిలువఁబడి యుద్ధము చేయుచున్నటులను ఇరుప్రక్కలను శునకములు అఱచుచున్నట్లును చిత్రింపఁ బడియున్నది. ఇది చూచుటకు మిగుల నచ్చెరువుగానే కనఁబట్టుచున్నది. గాని కొంచెము దీర్ఘదృష్టితోఁ జూడఁగా మిక్కిలి జుగుప్సాకరముగఁ బర్యవసించు చున్నదని తెలుపుటకుఁ జింతిల్లుచున్నారము. ఈ జంటతలల కోళ్లరూపముతో నున్న కవులెవరో యెల్లరును జెప్పకయే తెలిసికొనఁగలరు... ఇంత కాలమునుండి వీరిట్లు వాక్ప్రవాదములు చేసుకొనుచుండఁగానింతవఱ కెవరి కేమి యనర్థము కలిగినదో చెప్పఁగలరా? వైదిక నియోగికక్షలు పెరుఁ

తే॥ గీ॥ జననమరణాలలీల విస్తరమొనర్ప, నవతరించినయయ్యలేయగుదురొకొ
పండితులటన్నఁ గవులన్నఁ బ్రాజ్ఞులన్నఁ, బత్రికల వ్రాయువ్రాతలప్పగిదిగాక
తే॥ గీ॥ బుద్ధిలేదఁట? కవులకు బుద్ధి గల్గు, వారలిఁక నెవ్వరో? కులాచారములకు
సున్నచుట్టైడి మేటిసంపన్నులొకొ? వీరలు నిగర్వులషు? గద్వలేరు జనని.
చ॥ కవికలహప్రచారములు కట్టిఁడులన్ గరఁగింప లేవు కో
ళ్లవుదురు వారికిన్ సుకవు; లన్యులు కొందఱు కుక్కలౌదు రీ
యవినయమున్ సహింపనిగుణాఢ్యుల కీలిఖియించు ప్రాజ్ఞు లే
మవుదురొ? నీ వెఱుంగని రహస్యములుం గలవే మహేశ్వరీ. ౨
గీ॥ కోడిగ్రుడ్డంతయన్నమ్ము గొనరె సొక్కఁడు, నిమ్మకాయంతగోరెసత్యవ్రతుండు
వేఱొకఁడు; దీనఁగలసువివేకమజ్ఞు, లెఱుఁగరది విజ్ఞులకుఁగాక యెట్లు తెలియు

---

గు చున్నవందురా? ఆ పాప మిందుమూలముననే పండలేదు. అదియిదియ ఆక్షేపం డి బ్రద్దలయినది ... ఈతారతమ్యచర్చ ప్రతివిషయములోనను గలుగు చుండును..."నిరంకుశాః కవయః" అనునట్లు వారిలోవారు చర్చచేసుకొనుచుండఁగా నడుమవారు వారిని గోళ్ళతోడను కుక్కలతోడను బోల్పఁజూచుట యనాలోచితము... కోళ్లు, కుక్కలు మొదలగు నీచోపమలచే వారినిబ్రజారంగమునఁ బడవేయుటకంటెఁ గొదమసింగములఁగానో మదగజములఁగానో ప్రదర్శించినచో సత్యమైన యర్హమయిన గౌరవమయిన ప్రదర్శనమయియుండును...మఱియు వీరిట్లు నీచోపమలచేఁ జిత్రరూపమునఁ బ్రదర్శించుటయేకాక దానివ్యాఖ్యానములో "ఈకవులకు బుద్ధిలేదు. ఇత్యాది పరిమత్సరణీకారనీచవాక్యములచేఁగూడ సంభావించిరి.

(1913 వ సం॥ రం॥ జూన్ నెల 15 వ తేదీ సుదర్శనీపత్రికనుండి)

ఇప్పుడు వివాదపడుచున్న కవియుగ్మములను గూర్చి కృష్ణాపత్రికలోఁగోళ్లగను కుక్కలుగను పరమనీచోపమగాఁ జిత్రించఁగా వర్తమాన కవులలో గౌరవనీయులయి యున్నవారి నింత నీచపఱుచుట చాలజుగుప్సాకరముగ నున్నదని మేము వ్రాసినది పురస్కరించుకొని "కవులు కలహించవలెనఁట" యను వ్యాసమొకటి సువర్ణలేఖ యొకచదెవరి పేరిటఁ బ్రకటించెను...అంత కంటెను అధికులు చర్చించుకొనుచుందురేని వారి ప్రశంసయే యెత్తుకొనము. ఎందుచేత? వారి

మ॥ ఉపమాకల్పనఁ బట్టి కాల్పనికునం దూహింపఁగా వచ్చు ని
క్కపుసౌభాగ్యము లెన్నియేని; యది యజ్ఞగ్రాహ్య మెట్లౌ? వృథా
కుపితుల్ తోఁచినయట్లు గిల్కుదురు సంకోచింప రల్లంత స
య్యుపలాపంబు సదోవిగర్హితముగా నడ్డెంతు రజ్ఞత్వముల్, ౯

ఉ॥ అజ్ఞుల వ్రాఁతలే ప్రకటనార్హములౌనఁట? త్యాజ్యముల్ మహా
విజ్ఞుల వ్రాఁత లౌనఁట? వివేకులు కొల్లఁట? కుక్కలంట? ధ
ర్మజ్ఞత మేలుమే? లిదియు బ్రహ్మసమాజమతప్రవర్తిన
ర్వజ్ఞతయొక్కొ? యన్యమతవర్తుల కంబరో? యింత జ్ఞానమే, ౧౦

---

వివాదము తీర్చుటకు మన మెంత మన బ్రతుకెంత యనేమ స్వసామర్థ్య దౌర్బల్యమును బట్టి మనత్రోవను మనము పోవుదుము. టర్కీ బాల్కను రాష్ట్రముల మహాప్రవిదారణము సంధిచేయ బ్రిటిషు ప్రభుత్వమువంటి వారికే యర్హత గలదుగాని యెలమంచిలి ప్రొప్రయిటర్లు, ఏమిచేయఁగలరు? ...ప్రస్తావనకవు లేతనాత్రులుగారు. కలమెట్లు చేతఁబట్టవలెనో తెలియని "చదువరి' ప్రభృత్యస్మాదృశులందఱును వంక దొరకెఁగదాయని యెద్దియేని యనిష్టకారణమున వారిని దోఁచినట్లెల్ల నీచపఱచుట కధికారము లేదు....చమత్కారముగా యుక్తిప్రయుక్తికముగా వాదములు చేయుచున్నారు. సొంపుచెడినట్లు మధ్యస్థులకుఁదోఁచుటలేదు ఇష్టములేనివారు వారివాదములను బ్రకటించక పోవచ్చును,...వీరికి నిజముగాఁ గవులు కలహించి పాడయి పోవుచున్నారని పరితాపమూ లేక వారిలో నెవ్వరియందేని యనిష్ట కారణమున నేదేని వంకఁబెట్టి యేవో వెలితి "రిమార్కు"లు చేసి తద్వారమున నయినఁ దమయనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశమా?...తొలుత రామకృష్ణకవులు తమకీశ్వర వేరులన్నమాట వినగానే తిరుపతి వెంకటేశ్వరులు 'గుర్రిద్దువచ్చిపిల్లను వెక్కిరించినందుకై" కంటగించుకొని కొంచెముద్ఘోషణము చేసిరి. ఇట్లే గుంటూరిశతావధానములోఁ గొప్పరపుకవిగారికిఁ దమ రంగస్థలములోఁ దమతో సముఁడన్న సిద్ధాంతముమీఁద సహనన మీఁయగా నట్లువలదనిరి. లోకసామాన్యమర్యాదకై మీరెట్టి యాసనమిచ్చినను మాయభ్యంతరము లేదు గాని ప్రత్యేకించిమాతో సముఁడన్న సిద్ధాంతముపైయాసనమిచ్చిన మేమంగీకరించమనిరి.

ఇందు దప్పేమియున్నది? సన్యసించి తపమాచరించుకొను వారినైనను నీళ్ళు

సీ॥ అమ్మ యెంతటిఘనస్యురాలో యీబిడ రజస్వల యయ్యె మొగియదిప్పటికిఁ బెండ్లి,
కితని యోగ్యత నెన్న నైవనిశక్యము పెండ్లియాడె నల్వదియేండ్లయాఁడుఁబడుచు
నా పెసంస్కరణపరాయణత్వము మిన్న యాఁ బుత్రవతి పెండ్లియాడె విధవ,
ఆతఁ డిందఱకన్న నధికుఁ డేమనఁ? జందెమున్ద్రెంచె బాలుఁడైనను దెగించి
తే॥గీ॥ ఇట్లు ధర్మేతరములనే యెపుడు వినుతి, సల్పుపత్రిక లెక్కడ? సహజధర్మ
బద్ధ బుద్ధికిఁ గాని కన్పడని సత్య, మనెడిపరమార్థ మెక్కడ? యఖిలజనని.

---

కొలఁది వాఁడ వందుమేని యాతఁడూరకోఁడే! అట్టియెడ మానుషము విడనాడని లౌకికకవిమాత్రులు స్వగౌరవన్యూనతా పరాభవము నెట్లు సహించఁగలరు... కాఁబట్టి సర్వవిధములను ఏవంకనో తమ యనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశమే యీ పరితాపమునకుఁ గారణమని ఘంటాపథము గాఁ జెప్పవచ్చును... ఈ హృదయ కల్మషముల కొక్క ప్రబల దృష్టాంత మిచ్చుచున్నాము చిత్తగించుఁడు...నిన్నటి సువర్ణ లేఖలో..."ఓర్వలేక తగవులాడు కవులను జుట్టుజుట్టు ముడిపెట్టి ఇనుప గాలములు వేసి లాగుచున్నారండో? శ్రీరామరామ" యనునొక సందర్భములేని యపలాపమును వ్రాయించినారు..."కవులను" ప్రత్యేకించి నిర్దేశమేల చేయవలెను? కవులనే కాని, యోర్వలేనిగుణము గలయితరుల నెవ్వరిని శిక్షింపరాయేమి?...లెడుబీటరుదొరగారు చెప్పినట్లు కామముదీర్చుకొనుటకు అకృత్య మెంత యుపయోగమో క్రోధముదీర్చుకొనుటకిదియు నంతియయుపయోగము. ఈయమపట వర్ణనము విధాయకమే గనుక ఓర్వలేక తగవులాడు కవుల నొక్కరినే కాక యాగణములోని వారినందఱనుగూడ నాలోకమునఁ జిత్రవధ చేయుట తప్పనిసరియని తెలియఁజేయుచున్నాము. కలహించఁగూడ దను వీరిసిద్ధాంతమే సర్వదా ఆచరణీయ మగునేనియు, నట్టివారి నెల్ల నే కోళ్లగనో యేకుక్కలుగనో చిత్రించ వలసి యుండునేనియు నిప్పటివఱ కనేకవిషయములలోఁ గలహించుచు వచ్చిన కవులు, విమర్శకులు, పత్రికాధిపతులు, పండితులు, సంఘసంస్కర్తలు, పూర్వాచారపరాయణులు మున్నగు మహామహులనందఱ నీవిధమునఁ గోళ్ళు, కుక్కలు, పిల్లులు, పందులు, గాడిదెలు, గాఁ గూడవరుసగాఁ జిత్రించి వారికి బుద్ధిగఱపుచుండవలెననియుఁ దెలియఁజేయుచున్నాము. ముందువిఘ్నేశ్వరపూజగాఁ దొలినాఁటికలహాకవులయిన దండి కాళిదాసులను జెఱయి

సీ॥ ఘనుని బట్టుక సేవజనుఁ డేది వ్రాసిన నది శిరమ్మునఁ దాల్చునట్టి ఘనులు
నీచునినీచత నిక్కమ్ముగాఁ దెల్పు వారివ్రాఁతలు బుట్టవైచు ఘనులు
సత్యమ్ము నెఱిఁగియు శాంతులపోలిక నొప్పరికించుపరిపాటి నుఱుఁగు ఘనులు
ఏదియో పోట్లాట నూఁదినఁ బత్రిక కబ్బ "మేట"రటంచు నరయు ఘనులు॥

తే॥గీ॥ పత్రికాధిపతిత్వంబుఁ బడసిరేని, దానివలనను గల్గెడుహాని జగతి
కెంత యని చెప్పఁగలము లోకైకజనని, సత్యమనుగంటునెగడు నసత్యమెందు

---

## కథాప్రారంభము.

వ॥ అంబా! దీనికేమి ప్రకృతవృత్తాంతమ్మవధరింపుము,

(సూర్యోదయము)

మ॥ పరితస్సర్పదపారభాస్వరగవీపారంపరీసన్నతై
మిరభారుండు దివాకరుండు త్రిజగన్మిత్రుండు మందేహ ధి
క్కరణోద్యోగి వెలింగె నార్యులు "కృతఘ్నఘ్నాయ దేవాయ" యం
చెరఁగన్ దన్కరకోటి కాల్కలఁది నెందేఁ బందలై పాడఁగన్. ౧

చ॥ సరసిరుహాప్తుపాదములు సారెకు సుప్పరమందు, నెంతుఁ గొ
ప్పరపు శిరమ్ములందు నొగిఁ బ్రేఁకి ఘనాలయ పంక్తి మీఁదుగా
ధరణికి డిగ్గి యెల్లెడలఁ దామయి యామెయి వారిశైత్యపున్
భర మడఁజేయుచున్ నెగడెఁ బండితపామరరంజకమ్ములై. ౨

---

కటుకగ్రహము వారికిఁ దగవుదీర్చిన దేవి నొక యాఁడుపందిగను జిత్రించి యది మొదలు మొన్నటివఱకుఁ దగవులాడిన శిష్టు కృష్ణమూర్తి, పిండిప్రోలు లక్ష్మణకవి, వెంకటరత్న శర్మగారు, వీరేశలింగం పంతులుగారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు, కాశీభట్ల బ్రహ్మయ్యగారు, వడ్డాది సుబ్బారాయఁడు గారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు, మున్నగువారి నందఱను వారివారి యర్హతకుఁ దగిన జంతువులతోఁ బోల్చి చిత్రింతురుగాక, ఆపూర్వోపనిషన్మతము వెలయింతురుగాక.

(కొప్పరపువారు కాలుద్రవ్వుట)

చ॥ దురుసుగ నుండె నుత్తరపుధోరణి యుత్తరుగత్తరంబలెన్
ద్వరపడి తిట్టి బంధుగులదాపునఁ దూఱుట స్పష్ట మయ్యె నె
త్తఱి నెటఁ జేయనట్టి *యవధానము నెత్తుట వీర్వలాయన
స్థిరు లని యెంతమూర్ఖునకుఁ జెప్పక చెప్పఁ దొడంగె నంబికా. ౧

క॥ అలనూజివీట శ్రీకా, కుళముస మఱికొన్నిచోట్లఁ గోవిదు లెఱుఁగన్
జలిపిన ప్రత్యేకపుసభ, లలవా రెఱుఁగమియు స్పష్టమై కన్పట్టెన్ ౨

†క॥ ససహాయంబుగ నవధా, న సభన్ బొనరించునట్టి నరుఁడె ఘనుఁడో తా
న సహాయుఁడు ఘనుఁడో యది, సుసుమలకుం దెలియు నే ఘనులకుం దక్కన్.

§క॥ తెలుఁగఁటె? మీసంబంటె? అది, నిలుపన్ వలెనంటె? వీరు నేరుతురొక్కో—
తెలుఁ, గౌరా? తెలుఁగనఁగాఁ, దెలగాల్మోటాడు పచ్చి తెలుఁగే యగునో.

తే॥ ఋశిరరీయీవార్ని త తెఱఁగెల్లఁ బాటిమీఁదిపందికొక్కులుబల"మన్న పగిదిదోఁచె
వీరికి జవా బొసంగుట విజ్ఞులొప్ప, రయిన సామాన్యలోకు లట్లనరుగాక. ౫

క॥ అని యెంచి వారు పద్దెము, లను గిలుకన్ మేము వానిలక్షణమును నే
రనిపోల్కి— స్వవచనమున జా,బును బంపితి మంబ? వారు పురఁబురఁ బొక్కన్

క॥ పద్దెములు వ్రాసితిమి వి, ద్వద్దశ గూపెట్ట మనము పలుచనగా వా
ర్గడె మిటు గొట్టిరని లో, గుద్దుకొనం దొడఁగి రంట? కొప్రపుసాముల్. ౭

---

*బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులకు......

సీ॥ ... ... అష్టావధానంబు నాచరించెదరేని యద్దానిమించి నేయంగ లేము, శతఘంటకవనంబు, సల్పఁబూనెదరేని యద్దానిమించి నేయంగ లేము...

† సీ॥ అన్యునిసహాయ మించుకయైన లేక, పద్యమవధానమందు జెప్పంగ లేని, మీమహాధారణాశక్తి ......

§ ......తెలుఁగు మీసంబు నిలుపంగ దివురుడింక. (2(-8-11)

§ మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బారాయ కవిగారికి. అయ్యా! పద్యమయంబగు తమయుత్తరమందినది, "మీపరువును మాపుమాటకు జవాబు నొసంగిన వాఁడ నమ్ముఁడీ" అని వ్రాయించినారు. ఏసందర్భమునం దేవిషయమునం

క॥ మునురామకృష్ణులకుఁ జ, క్కని పద్దెమ్ములను వ్రాసి ఘనత నొసఁగి రి
య్యనువున మనలం జూచిరి, యని లోలో నగచిరంట? యాత్రింపుఁగవుల్,

క॥ అనుకొంటి మేము వీరికి, ననవద్యపుఫక్కి వచన మైనన్ వ్రాయం
జనద, యది గ్రామ్యశైలిం, బనుపడు టే యుక్తమనుచుఁ బదపడి జననీ. ౯

క॥ కాని యటు మొదట యోజన, మానసముఁ దవులకున్కి మఱి యాధాటిన్
బూని లిఖియింప మైతిమి, దానికె యకవుల కెడఁద తబ్బిబ్బయ్యెన్. ౧౦

క॥ తగినంతగూఢ గతిమే, మగుపఱచిన వీరికర్థ మగుటెట్లటు వ్రా
యఁగ నర్థము తముఁగోరఁగ, నగరాజకుమారి? వీరి నగరా? విజ్ఞుల్. ౧౧

సీ॥ అవి యనద్వాహమ్ము లన, "మాకు నిత్య మి
య్యవియె కూర" కటన్న దెవరు జననీ?
ఒక్కరో? యిర్వురొక్కొ? దేవు లనుకేలి
"కెద్దు"లంచనుకొన్న దెవరు జననీ?
"లవణం బనిన నేదో యవలికిఁ జని తెచ్చి
యొలమి వడ్డించిన దెవరు జననీ?
సభ "నథాతో బ్రహ్మ" చదువ "నీతాత" లో
నవుప్రసంగము సేసి రెవరు జననీ?

గీ॥ వారిలో వారు గారొ క్రొంపువారు, కాక యుండిన గీత మెక్కతన వృత్త
మయ్యె వీరికి నీలాటి యథముశుభము, నెఱుఁగని యమాయికులు మీన లెత్తనేల.

క॥ ఇది యిట్టు లుండె మాజా, బది వారికిఁ జేరె మరల నలవాగ్జాబున్
గుదురుచుకొను నీలోపలఁ, బొదలిన వేఱొక విశేషమున్ విను మంబా, ౧౩

(మ॥ రా॥ రా॥ ఏకా శామయ్యపంతులుగారింట విందు)

ఉ॥ ఇంతకుమున్నె విందనుచు నెల్లబుధుల్ విన రామయార్యుఁ డే
వంతనమూనియో పిలిచెఁ జట్టన నాఁడె నియోగివైదిక

---

డేరూపముగా మాయేమాట మీరేవరువును మాపినదో యావిషయము విపులముగా వ్రాయించినంగాని మీకుఁదగిన యుత్తరమిచ్చుటకు వీలులేదు. కావున వెంటనే దయచేసి పై విషయమును వ్రాయింతురుగాత.— 21-8-11.

ఇట్లు, దివాకర్ల తిరుపతిశాస్త్రి.

స్వాంతము లెట్టిఁ బాటెఁ గొనసాగని యాసనచర్యకల్మి, ధీ
మంతుఁ డితండు మున్నునిన మాటకు దాఁటక వచ్చి చెప్పెరన్. ౧౪

ఉ॥ నేఁ డరుదెంతుమన్న నుడి నిక్క మొనర్పఁ డటంచుఁ బిల్చి మో
మోడిన త్రోవ గన్పడఁగ నెయ్యన నయ్యనఘుండు వోయె "బోఁ
గూడదు కూడు" నంచు నొకకొందఱు దండడిఁ జర్చఁజేసి రా
పాడి గడింప "కేగుటయె బా" గనె వెంకన నిర్వికారుఁడై. ౧౫

ఉ॥ విం దనుకూలమై జరిగె విందున లోప మొకింత లేద, యెం
దెందులకేని మంచి దని యెంచిరొ యేమొ, మఱొక్క పంక్తి మా
కుం దమవారి కందఱకుఁ గొండొకపంక్తియుఁ గాఁగ నేరుపా
టుం దగఁ జేసి రయ్యది కడున్ సుఖ మిచ్చె ననేకభంగులన్. ౧౬

ఉ॥ పట్టురుమాల్ బుజమ్ములవయి బాలరవిప్రభలీనఁ బంక్తికిన్
రాట్టయి యగ్రపీఠమున రాజిలెఁ గొప్పిషు సుబ్బారావు, జల్
దట్టులు ముండపాటికులధన్యుఁడు లోనగువార లాతనిం
బట్టి క్రమమ్ముగా నతనిపంక్తి నెసంగి రభంగురస్థితిన్. ౧౭

తే॥ గీ॥ జరిగె నారీతి విందు ప్రశస్తగరిమ, భోజనానంతరమ్మున నోజఁ గొంద
ఱేగుదెంచిరి వారు కోటీశశర్మ, శాస్త్రిముఖ్యులు పదపటిచర్య వినుము. ౧౮

మ॥ చిఱుమామిళ్లకులుండు రాముఁడ లలక్ష్మీపూర్వనారాయణుం
డురుకీర్తిస్థవిరుండు వచ్చె నట కుద్యోగిత్వమైత్రిన్, ధురం
ధరులై తక్కిన చుట్టలున్ మఱియునుం దక్కంగలా రొప్ప భా
స్వర మయ్యెన్ దగు పాటిగా సభ భవిష్యచ్చర్య సూచించుచున్. ౧౯

శా॥ ఏ కారామయగారితమ్ములఁట? బీ,యే,బీ,యలై ప్లీడరీ
దాఁకన్ వచ్చిన మేటియంట? మఱి యా ధన్యుండు తాంబూలముల్
వీఁకన్ గొన్ని ఫలమ్ములుం గొని సభన్ వీక్షించి తాఁ బంచె నా
పోకల్ కొండొక వర్ణనీయము లనం బోలుంజుమీ శాంకరీ. ౨౦

ఉ॥ ముందు భుజంగరాయనృపమూర్తికొ, కొప్రపుటయ్యకో, ఫలం
బందఁగఁ జేసి యాపిదప నన్యులు బందుల కిచ్చి మీఁద న

స్పందితకీర్తి కంఠ్రీఘజనిభాన్వయుఁ డౌనలోమేటి కీయ నా
విం దతఁ డందకే కడు వివేకి మమున్ గరసంజ్ఞఁ జూపుడున్. ౨౧

ఉ॥ రామయగారితమ్ముఁ డలరారెడియోగ్యతఁ బొల్చువాఁడు సు
శ్రీమహితుండు లక్ష్మినరసింహసమాఖ్యుఁడు మా కొసంగెఁ ద
ద్ధీమహితత్వమేమి, మఱి తేఁకువయేమి మది న్నుతించుచున్
ప్రేమ ఫలమ్ము వెంకన పరిగ్రహణం బొనరించెఁ గ్రన్ననన్. ౨౨

చ॥ తిరుపతి పుచ్చుకొక యొకతేఁకువ దాని ననాదరింపఁగాఁ
గరము మదిన్ దలంచి యటు కర్జమునన్ గుశలత్వ మూనె, నం
తరమునఁ బత్త్రదాత యది తా గ్రహియించె నొకింత చర్చయున్
సరసముగా నెనంగె నది సభ్య లెఱింగినదే మహేశ్వరీ. ౨౩

ఉ॥ రామయగారికిన్ మఱియు రామయతమ్ముఁడుగారికిన్ గడున్
ధీమహితత్వమందునను దేఁకువయందును గల్గువారకున్
మామదిఁ జర్చ సల్పుచుఁ గ్రమమ్ముగ వచ్చినత్రోవ నింటి కే
మేమియు చెప్పికొంచుఁ దగ నేగితి మానిని వోయె నీగతిన్. ౨౪

చ॥ వెలవెలవోయెఁ జుక్కలు వివేకవిహీనులమోములట్ల ని
ర్మలసలిలాశయంబులు ప్రమోద మెఱుంగని వారి మానసం
బులఁబలెఁ దెల్వి మీఱె ఘనపుణ్యులు వైదికులు న్నిరాగులున్
గలిసి యొసంగునర్ఘ్యములు గైకొనుచుండె దివాకరుం డొగిన్. ౨౫

మ॥ అది వర్షర్తువుగాన మేఘపటలం బావంత దగ్గప్పఁగో
విదమాన్యుండు దివాకరుండు తనగో విస్ఫూర్తిచే జ్ఞానిదు
ర్మదముంబోలె నపాకరించి సుదినప్రఖ్యాతి యవ్వేళకున్
గడియన్ వెల్గఁదొడంగెఁ గాక వితతుల్ గ్రాసార్థ మట్టాడఁగన్. ౨౬

క॥ తరువాతఁ దనదు సొమ్మగు "గురుతరలీల" యనుపదముగొని పద్యంబున్
బిరపుర లిఖించి మీనము, స్మరియించుచుఁ గొప్పగంపు చతురుఁడు పెలుచన్

ఉ॥ *పత్రిక నంపి యప్పుడును బద్యము వ్రాయక యుత్తరించుచూ
పత్రికఁ జూచి "పేర్మనకుఁ బద్దెము వ్రాయమిఁ జూడ" నేటికి

*మహారాజశ్రీ తిరుపతివేంకటేశ్వరకవులకు......చ॥ గురుతరలీలరేపె నభ
[illegible], ఘనవాగ్వరమున దక్కరారెవరు,...ఆశుకవిత్వశతావ

యాత్రము మీరు మాకుఁ గవులేయనితోఁపరు మీరు తిట్టినన్
శత్రుత మాకుఁ బుట్టె దనుచందముగా మదిలోఁ దలంచుచున్. ౨౮

క॥ పదపడి*వచనమె వ్రాయుచుఁ, దుదిదనుకం బత్రికలకు దొడఁగెన్ సుకవుల్
పదుగురుగల సభయనన, పైదలొరాయివడి వ్రాఁతలెల్లన్ సురిఁగెన్. ౨౯

క॥ †తటిమిటటిమి మునుమాకు, త్తరములు లిఖియించునతనితత్తఱమాపై
విఱిగి సురిఁగి కరిగెనొకొయు, త్తరమే వచ్చుటకు మిగులఁదడవైపోయెన్. ౩౦

---

ధానముల్। విరచన సేయ రావలయు, వెంటనె, మేమవియాచరించి ధీ। వరసభమీ
ప్రతిజ్ఞ గెలుపం గలమీసము దీయఁజేతుము ...”

గుంటూరు, 22-8-11. } ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ, శతావధాని.

గుంటూరు, 23-8-11.

*మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ గారికి. అయ్యా, ...మీన పుఁ బద్యమున కర్థ మేకారణమున నొ మీకుఁ దెలియలేదనుకొనియెదను ... తెలియదేని పెద్దలనడుగుఁడు... (4) ఈప్రతిజ్ఞ ప్రస్తుతవిషయము కాకపోయినను మీయంతట మీరు పురస్కరించుకొని వివాదకుం దిగుటచే నయ్యది యింతటినుండి మీయెడలఁగూడ నిర్వహించుట కంగీకరింపక తప్పినది కాదు....(9) మీరుమాకుఁ దెలిసిన యంశములలో నేకదేశప్రవిష్టులు మాత్రమేయయినను మీకోరికఁబట్టి మీ సభకు రా నుద్యోగింతుమే యనుకొనుఁడు రేపిఁక నొకరాంధ్రభాషైక దేశమగు గ్రామ్యభాషయందుఁగాని నిర్యతిగణప్రాసస్వాశబ్ద రసాభాస కవిమార్గమునంగాని యన్యత్రఁగాని మమ్ము జయింపుఁడని కాలుద్రువ్విన చో మాగహాచారమందుకు నొడఁబడవలసిన దేనా! అందులకుఁ బ్రాజ్ఞులు సమ్మతింపవలసిన దేనా! మాకుఁగల శక్తులలో నేకైక దేశమున నంతో యింతో యొఱిఁగిన వారెల్ల మమ్మెదిరింపఁ దగువారేనా! శాంతంపాపం...(12) ఈవ్రాతవలనఁ దెలుఁగు నేని మీకుతదలితి మని యనుకొనకుఁడు....”

గుంటూరు, 27-8-11.

†మ॥ రా॥ రా॥ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ గారికి, అయ్యా,(1)జరూ

క॥ అల "బాజానందడిమం, గళ సూత్రము మఱచినట్టు".గా సభకై ముం
గిలికిన రవివాసరమా, పలికెన్ జని వచ్చె సోమవాసర మంతన్. ౩౧

చ॥ సభయగునన్న యాదినము నందడిగా జను లేగుదేర రా
సభ మయి పోయె నెయ్యెడల నందుల గొందుల వంటపూటయిం
డ్ల ఖరముగా జనుల్ విడిసి "డాబులు డాబిరి యేల సేయరో
సభ"యని కొప్రపుంగవుల సారెకుఁ గేరఁ దొడంగి రంబికా. ౩౨

సీ॥ పుట్టదిట్టము లేదు పో! నిల్చె టెట్లు కొప్పరమంచుఁ బలుమాఱు పలుకువారు,
తన్నుఁ గజ్జలబల్మి తనయున్నతిని నిల్పె నెంతదనర్చెనటంచు నెంచువారు,

---

రు "అని 25 వ తేదీని మేము వ్రాసిన యుత్తరమునకు 27 వ తేదీ 11 గంటలకు మీ రిచ్చిన జవాబు అందది... ౧. సభ ముందు మీరే చేయవలెను, ముందుత్తరము వ్రాసి యవధానాశుకవిత్వములకై కాలుద్రువ్విన వారు మీరు కాని మేము కాము, ...౪. మా విషయమై మీరును మీ విషయమై మేమును నవధానపు టేర్పాటులు చేసికోవలసినదే కాని యయ్యవి సభ్యులేర్పఱుపఁదగినవి కావు, ఉభయులచే నేర్పఱచికొనఁబడిన సభ్యులు న్యాయాన్యాయములును రసారసములును దారతమ్యములును విచారింపఁదగినవారు మాత్రమే ౫. ఈ విషయముల కంగీకరించుచు మీరు సభ సమకూర్పుఁడు, లేదా మేము సమకూర్చెదము...౮. జరూరని వ్రాసినను వెనుకటివలెనే ఆలస్యము చేయక రేపు సూర్యోదయమునకుఁ దప్పక జవాబు పంపవలెను.

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

---

ఉదయం 8 గంటలకు 28-8-11, గుంటూరు,

అయ్యా! ఈదినమున సభ తప్పక జరుగు ననుమీ ప్రకటనను బురస్కరించుకొని యనేకు లనేక గ్రామములనుండి వచ్చి నిరీక్షించుచున్నారు. వారిని వృథాశ్రముల నొనరించుట యుచితము కాదు కావున నవధానసభావిషయ మేమయిన దియ్యఁ బ్రకటించి వారిసందియము దీర్పుఁడు మాయుత్తరమునకుఁ బ్రత్యుత్తరము రాకుండఁగనే మేము ప్రకటించుట యుక్తము కాదుగదా?

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

తన్మానుబండలే తన్నువంచన సేయు నవసరంబైనప్పు డనెడువారు,
నేల విడిచిసాము లేలొకో? యొకచోట నంతలోనే యుండక నెడివారు ౩౩

తే॥గీ॥ వింధ్యగర్వంబగస్త్యునవంధ్యమహిమ, ముగ్గడించి యిసీ? యనియొఱలువారు
హంసకాకచరిత్ర మిష్టందఱకును, స్మృతికిఁ దగిలె నటంచు వచించువారు.

మ॥ ఒకటే శైలిగ నొక్కటే వడిగ నూహూ? యంచుఁ గవ్యగ్రణీ
ప్రకరం బెంచఁగ నంచ యేగె, నటు"రార"మ్మన్న కాకంబు ము
న్నొకతీ, రాపయినొక్కతీరు, పయినెన్నో తీరులైడస్సి, నూ
టొకయానమ్ములు చూపి కాదె! శరణం బొందెన్ మరాళప్రభున్. ౩౮

క॥ అనిపూర్వగాథలెన్నుచు, మనమునఁ దమపడినశ్రమకు మతిమతి విసుఘుం
గనుచుఁ దిరిగిపోనెంచుచుఁ. బునఃపునర్యో జనలకు బుద్ధి చొనుపుచున్.

ఆ॥ వె॥ కొండవీటిసామిదండ నుండెడిలేడి, కొండకేనిపూఁతుగుఱ్ఱమునకుఁ
దఱుచుభయము చెందిదండంబులిడు నొయ,ద్దానితోడఁ బెనఁగుతలఁపు గొనును.

తే॥ గీ॥ సింహగమనంబు నేర్వంగఁ జిన్నలేడి, కెన్నిజన్మమ్ములెత్తినయేనిగలదె
పాల్యపాలకభావసంబంధ ముడుపఁ; దలఁచుటదియెంతయేనియుఁ దప్పిదంబు.

క॥ తన పాదములు మనమ్మన, నయము మననమ్మ సల్పనప్పటికిన్ దాఁ
గనికరము కరము గని చా, నిని మురువ్వగఁ జూడకున్న నేరముహరిదొ. ౩౯

క॥ హరికిన్ హరిణమునకు సం, గర మది హాస్యాస్పదంబు గా దనువా రుం
డరు దానికేమి హరిణము,కరి నెదురుటె యంద మెట్లు ఘటియించునటుల్.

ఉ॥ రంకువు శీఘ్రగామియని రాజులు పట్టపుటేస్గు వీడి రా
జ్యాంకము గాఁగఁ గైకొనిరె యక్కట? యేనుఁగుతోడఁ బోర నా
జింకకు శక్తియున్నదె? ప్రసిద్ధికినై "యెదిరింపు"మంచు నే
కొంకును లేనివారు పురికల్పినమాత్రన యేమిలాభమో. ౪౦

చ॥ అదులకభేద్యమైనచతురంగబలమ్ములు గల్గుకేనితో
గొఱియలగొల్లకేఁ డెదురుకోలు ఘటింపఁగ నెంచి" మీరలున్
గొఱియలతోనె రండనుచుఁ గోరిన "సీ" యని రోసి దానికే
"సరి"యని సిద్ధపడ్డ వెడజాబుషరాబుల డాబు లేటికో. ౪౧

ఉ॥ ఇచ్చి వరమ్ము గైకొనరె యెల్లసురారులకున్ నిలింపు; లా
నచ్చరితుల్ మహామహు లనన్మదహారులతోఁ బ్రవఁ బట్టి వా
రిచ్చిన మెచ్చు లాగికొను టేమి యపూర్వము? మెచ్చినంత నే
హెచ్చును దగ్గునే వలదదే? తల దాఁటినపోక లొప్పనే. ౪౨

శా॥ దేవ బ్రాహ్మణవృత్తులన్ విడిచి వర్తింప న్నియోగించి భూ
దేవుల్ వీడుదు రాలపోతు నది భూదేవాజ్ఞకుం దక్క దు
ర్భావం బౌతటి నూరకుండరు గదా? పైవచ్చుచో నెవ్వరిం
గావంజాతురె? కావలం బడఁవరే? కాల్ద్రొవ్వఁ గా నిత్తురే. ౪౩

ఉ॥ చెక్కిలినొక్కుచున్ జనులు చేఁపఁగ ముద్దిడుకొంచుఁ బేర్మిపై
నక్కునఁ జేర్చికొన్న సమయమ్మున బాలుఁడు పాలు గ్రోలుచున్
ముక్కు "కటుక్కునన్" గొఱుక ముద్దిదియెల్లను మూలఁబట్ట నా
యక్క "ఇదేమిరోరి చెడుగా" యనదోనమె? దానరోనమే. ౪౪

చ॥ వితతతరప్రబంధముల విశ్వజనీనములన్ రచించి కీ
రితి జగమెల్ల ముంచుచుఁ జరించెడితిర్పతివేంకటేశ్వరుల్
మతిచెడి కొప్రిపుంగవుల మాయకవిత్వముతోడఁ బోరికిన్
గుతుకము పూనినా రని జనుల్ విని నవ్వరె మొగమ్మునన్. ౪౫

ఉ॥ అల్లిక కేమి సాలెపురు వల్లదె? 'హు' వ్వని యూఁదునంతలోఁ
బొల్లగునల్లికల్ నరిగ బుద్బుదముల్ గదె? దీని కేసుదృ
క్తల్లజుచిత్తమేనియు యథార్థముగా ముదమందునే? యెటో
యల్లిన దేల కాదనఁగ నంచది మే, లను టొక్క మెచ్చొకో. ౪౬

ఉ॥ మంగలివాని యద్దము క్రమమ్మున మున్ను రచించినట్టివే
ముంగలి కీడ్చి పాఠమును బొబ్బగ నప్పఁగఁ జెప్పుశిష్యుపో
ల్కింగడు ఘాటిగాఁ జదివి కేవల మెక్కుడొ యొక్క టొక్క టో
జం గయితంబు సెప్పుట యశస్కరమే? సుకవీంద్ర సత్యమే, ౪౭

ఉ॥ విప్రవినోదినంచి నెటు వేఱొక వస్తువు లుండు నట్టులే
కొత్తపువారు నంచి నిడుకొందురు వర్ణన లన్ని చేసి, యా

తు ప్రకృతిన్ రచించి రని శుద్ధు లమాయికు లంద్రు మర్త్యమున్
సుప్రథితుల్ గ్రహింతు రిది చూచిరి పట్టి రనేకు లెల్లెడన్. ౪౮

ఉ॥ గుట్టిది బైటఁబెట్టుటకుఁ గొండ కెఱింగియు సంశయింతు రీ
చెట్టన డంపకున్న నెటు చేటు దొలంగు? మహాకవిత్వ వి
ద్ధట్టసుధానధామకవితానవతామరసాననావచః
పట్టణవైభవప్రథితబంధురసౌధవిలాసలక్ష్మికిన్. ౪౯

ఉ॥ జీవనమూడె మాకని వచింతురుగా కొకకొంద ఱట్టివా
రేవగనైన జీవనము నీవయిఁ జేతురుగాక కైత యే
కావలెనే? మహోగ్రగతి గానఁగ రాదె, యమాయికాత్ములన్
జీవికకై జగం బవమానించునటుల్ గికురింపఁ జెల్లునే. ౫౦

చ॥ ఇటులొక కొంతమంది కడు నెల్లిదపుంగతి దోఁప నాడ న
ప్పటుమతు లాడుపల్కు లలపక్షమువారు సహింప "కేల యీ
కటువులు? కొత్రపుంగవు లఖండులు వారల శక్తి చూడుఁ, డు
త్కట మది, గోరతం బనెడి కావ్యము సందగుపట్టు నావుడున్. ౫౧

ఉ॥ అప్పరమేశ్వరీ దయకు నాకరులన్ గదలించి దానిచే
గొప్పను గోరి గర్తమునఁ గూలి యెటో పయి రాఁగడంగి యీ
కప్పలరావముల్ గొఱయుఁ గా వని లోనఁ దపించి పాకృమీ
కొప్పరపుంగవీశులకు గోరతమే హితమెన్ని భంగులన్. ౫౨

చ॥ అనుటయు వారిపక్షపు జనావళి వారలయోడు పూర్తిగా
మనమునఁ బట్టియుంట మఱుమాట వచింపక యూరకుండ వ
చ్చిన జనసంఘమందలి ప్రసిద్ధులు కొందఱు కొప్పరంపువా
రిని గని కొన్ని మాటలను రేఁగగ నేగెద మంచు నెంచుచున్. ౫౩

క॥ చనుచుండ వారిపక్షమ్మున వా రొకకొంద ఱాఁగి మొగి నేమేమో
యన మొదలిడ 'మీ రెవ్వరు?, చనుఁడా,'మే మడుగ నటకుఁ జనవలె ననుచున్.

శా॥ కాలిం ద్రవ్వితి రూరకుండెద రె? సంసారుల్ జగమ్మందు వే
వేలున్నా రలవారిఁ గోరికొనుఁ డావిద్వాంసు లేతెంచి మీ
మీలోపమ్ముల నేర్పరించెదరు సామ్మె హమ్మరి కెవ్వారికిన్
వీలౌ తెల్పెద రీసుడిన్ వినఁగ సువిద్వ శ్లాఘించెడిన్ లోకముల్. ౫౪

కll తిరుపతి యెట్టిదియో? కొ, ప్పరమెట్టిదియో కవిత్వభర మెట్టిదొ? సం
స్కారణం బెట్టిదియో? ధి, క్కారణం బెట్టిదియొ? తెల్పఁ గల రవ్వారల్.

చll పరు వెటువంటిదో? చెలుచు బాసయు నెట్టిదొ? లేశమేని సం
స్కారణము పూజ్య మయ్యు నరిగంగలనాఁడుట యెట్టిదో? సమ
స్ఫురణకు నానసమ్మ్రనెడఁ బోరెడిధీరత లెట్టివొకొ? పి
ష్టరము లొసంగు బెట్టిదియొ సత్కవితా వనితా వినోదముల్. ౫౭

ఉll కోరిక యెట్టిదో? యచటఁ గొం కుదయింపమి యెట్టిదో? పరి
షాక్రరము లెట్టివొకొ? మమకారము లెట్టివొ? యంతఁ బోక ధి
క్కారము లెట్టివో? పయివికారము లెట్టివొ? బారుబారలం
కారము లెట్టివొకొ? యధికారమ దెట్టిదొ? కారమెట్టిదో. ౫౮

ఉll సారము లెట్టివో? పయి ససారము లెట్టివొ? కాలుద్రవ్వ ఝం
కారము లెట్టివో? పయిఁ జకారము లెట్టివొ? యంతలో దళ
త్కారము తెట్టివో? మఱి నికారము లెట్టివొ? పిమ్మటం దిర
స్కారము లెట్టివో? పొరిఁ జూకారము లెట్టివొ? కాటు లెట్టివో. ౫౯

ఉll బీరము లెట్టివో? తిరుగు జేరము లెట్టివొ పిమ్మట న్నమ
స్కారము లెట్టివో? పయిప్రకారము లెట్టివొ? యాపయిన్ వష
ట్కారము లెట్టివో? పయి నకారము లెట్టివొ? మీదుమీదు నా
కారము లెట్టివొకొ? నుడికారము లెట్టివొ? వైరమెట్టిదో. ౬౦

ఉll హారము లెట్టివొకొ? వ్యవహారము లెట్టివియొకొ? యాచమ
త్కారము లెటివొకొ? బయికారము లెట్టివియొకొ? పై బహి
ష్కారము లెట్టివొకొ? యుపకారము లెట్టివియొకొ? యాయహం
కారము లెట్టివొకొ? యపకారము లెట్టివొ నేర మెట్టివో?. ౬౧

ఉll పారము లెట్టివొకొ? పయివారలశూరత లెట్టివొకొ? స్వీ
కారము లెట్టివొకొ? గుణకారము లెట్టివొ? చుట్టుసన్న ప్రా
కారము లెట్టివో? పయి లకారము లెట్టివొ? చాటు చాటు స
త్కారము లెట్టివో? తెలుపఁగాఁ గలవారలు పండితుల్ గదా. ౬౨

చ॥ కవి యన నెట్టిఁడో? కవిత గాఁ దగునట్టిది యెట్టిదో? వృథా
రవణము లెట్టివో? కవులరావము లెట్టివో? సత్కవీశ్వరో
త్సవ చరితము లెట్టివో? బుధత్వ మదెట్టిదో? యేరి కేరికిన్
శివ! శివ! సామ్య మెట్టిదియొ? చెప్పఁగలారు బుధోత్తముల్ గదా. ౬౩

చ॥ ఎవరుచు నేరు నొక్కయెడ నెల్లరు మెచ్చఁగఁ గూరుచున్న నె
ప్పునొకో! యేరికిం దగదొ? యక్కట! శక్తులు పట్టి చూచి "వీ
రక్కవు లలవారలో! కవులు గాఁ దగువార"లటంచుఁ దెల్పఁగా
నెవరితరంబు? పండితకవీంద్రులు దక్క జగత్త్రయమ్మునన్. ౬౪

ఉ॥ రా మనిరోకొక్క! పండితులు, రమ్మని కోరనె లేదొ? సద్యశః
కాములు మీరు వారిపయిఁ గా లటు ద్రివ్వి యుపేక్ష సేయఁగా
నేమి! వృథాగ లోకమున కింత పరిశ్రమ మేల పెట్టినా
రీమెయి నూరకుంట తగునే! యని కంకెప మంచుఁ బోవుచో. ౬౫

ఉ॥ ఏమిది! యీజనంబునకు నింతటిపక్షము వారియందుఁ, ద
న్మానము వీరి కింతగ మనమ్మున కెక్కఁగ నేల! కొవ్రిపు
న్మానము కోపపాత్రముగ నాటగ నేల! స్వదేశవాసు లన్
ప్రేమము గూడఁ గన్పడ దరిపత్రికరమ్మును మించి రీవ్రజల్. ౬౬

చ॥ అని మనమందు నెంచుకొని యవ్వలి పక్షపువారు "మీరు వ
చ్చిన పని చూచిపోవుటకుఁ, జెప్పెడిమాటలు పెద్దమాట, లే
ర్ఘను లయి మీకుఁ గట్టములు గప్పెదరి? రింతటి కంఠశోషకుం
బని గనుపట్ట" దంచు నుడువన్ "బని లేనిదె వచ్చినారమే. ౬౭

మ॥ కవితావాద మటన్నఁ జూచుటకునై కష్టించి యీసత్సభా
సువిశేషంబుల నాలకించుటకు నచ్చోనుండి యిచ్చోటికిన్
జవసత్త్వమ్ములు వెచ్చఁ బెట్టుకొని రాఁ జన్నే! వృథాహంకృతి
స్థవిరుల్ సించిన పత్రికల్ గని యథార్థం బంచు నూహించుచున్. ౬౮

మ॥ అదిగా కూరక వ్యాఘ్రముం గదుపులా గంతంత మిక్కైకి నె
మ్మదికి న్నెమ్మది దక్కి మీసములపై మాత్సర్యమున్ గ్రక్కి సా

గద యంచుఁ దల గ్రుక్కి పాటుకవులన్ గన్గొంచ జనన్ రాదె!యే
మిది! మీపూనిక యెంత డిందె!' నని పేర్మిన్; బల్కఁగాఁ గూడదే ౧౯

చ॥ అడిగెద మేము మీ; మ్మ్రదుగుఁ డట్టులె మమ్మ్రను మీ, రటన్న వె
న్నడమి యదెట్టిదో? కపటపద్ధతు లుద్ధతు లెట్టివో కదా! యా
గడబిడ లేమి యయ్యెనొకొ? కా లటు ద్రవ్వట దేడ కేగెనో!
మడమలు ద్రొక్కి మీసమును మట్టునడావడు లేడ డాఁగెనో. ౨౦

ఉ॥ "మీనము,, లంచు మీనములమీఁదికిఁ బోవుటె కాక వారియ
ర్థానసమంబుఁ జేరుటకు నానన మూఁచుటె కాక యెన్నియో
దోసపు బానలన్ గిలికి దండము కండుటె కాక పై రసా
భాసము చేసి పాటుటది భావ్యమె కొవ్వగపుంగవీశ్వరుల్. ౨౧

చ॥ సమరము చూచి ఖేచరులు సంబర మందుట యెందు విందు మ
య్యమరులుబోలె సభ్యులు జయాపజయార్థులు గాక వారు వి
శ్నము లిడ నెవ్వ "రద్దుఁడు వసన్ గనుఁ డర్దెద' మంచు వారు న
క్రమముగ వ్రాయ నందులకుఁ గాక పరాఙ్ముఖులైతి రేటికో. ౨౨

ఉ॥ గ్రుద్దె నఁ టాంజనేయుఁ డొక గుద్దను రావణుఁ బట్టి, మూర్ఛమై
నద్దివిజారి జాటి తెలి వంది "బళీ" యని మెచ్చెనంట? యా
సుద్దికి నంజనాసుతుఁడు సుంతయు నంతన మంద 'కౌరవ? నా
గుద్దురుచిన్ వచించు టొనఁగూడెనుగా? యని యంచె వక్త్రమున్. ౨౩

ఉ॥ "మీనము" లన్న "జు" ట్టనుచు మిమ్మ్రను వా రన వచ్చుఁగాదె! యే
వాసియు లేనివారియెడఁ బంతము ప్రాజ్ఞుల కేల? మీరసా
భాసపువ్రాఁతయే తెలుపుఁ బండితదూరు లటంచు; నశ్వఖా
ఖోనము మీది, మీ రిఁక నొదుంగక చేసెడి దేమి కైనరుల్. ౨౪

చ॥ "గురుతరలీల" పద్య మది కో! యని యార్చుచు నుండె మీరె పై
బరు విడుకొన్నవారలు సభం బొనరించుట కంచు, నేల యీ
పిటికితనంబు సేవ్వఁ డని బిట్టడుగన్ వలె నంచుఁ బోయి కొ
వ్వరపుకవుల్ కనంబడక వచ్చిరి వార్త్రముఁ జూడ నంబరో. ౨౫

చ॥ ఆపు దాకచోట విందునకున్నై చనియుంటిమి మేము మానివా
నవదము చూచి వీరలును జాతిరో! యని యాడుకొంచు న
ట్టిపనియు నుండునే! యనుచు, డీకొని కొట్టెడిసేన పోలిక న
య్యపరిమితప్రజానిచయ మయ్యెడకే చనుదెంచె నంతటన్. ౨౬

శా॥ అందుం గొందఱు బ్రాహ్మణుల్ మఱియు వైశ్యశ్రేష్ఠులుం గమ్మవా
రెందుం గన్పడి రిందఱున్ ప్రవితతై యేతెంచుటం జేసి యం
దం దించించుక గోష్ఠి గల్గు టనుమేయం బయ్యె నూయంబ! మే
మెందు న్మస్త ప్రనియుండ మిందఱను తాదృగ్భక్తిసంపన్నులన్. ౨౭

ఉ॥ నాలవజాతియందలిజనంబులు తూర్పున సుంద్రు గాని యీ
నాలవజాతివేఱు పయి నాగరికత్వముమాట కేమి వి
ద్యాలయములన్ ప్రాణముల నర్పణ చేసెడిపాటిభక్తులుం
జాలఁ గలారు కమ్మకులజన్ములలో శతమున్ సహస్రమున్. ౨౮

ఉ॥ వారలు నన్యులుం గడు నవారిగ వీధికె రెండువ్రక్కలన్
బారులు గట్టి నిల్చి యిట వచ్చుట, కొప్రపువారిఁ జూడఁగాఁ
గోరికతోడ నేగి తమకున్ మఱి వా రగుపట్టమిన్ వృథా
యై రహిఁ నిండ్లకున్ మరలు టాదిగ నొండొరు లాడుకొం చొగిన్. ౨౯

శా॥ అయ్యా! తిర్పతివెంకటేశ్వరులు! మే మత్యాశమై వేడ్క మీ
కయ్యంపున్ సభఁ జూడ వచ్చితి మిటన్, గా ల్ద్రివ్వినా రెవ్వ రా
యయ్యల్ మోమును జాటు వెట్టి రిఁక మా యాయాసముల్ వ్యర్థమై
యయ్యెన్, వచ్చినత్రోవఁ బోవుదుమొ, లేదా? యుందుమో? తెల్పుఁడీ. ౩౦

చ॥ ఎఱుఁగుదు మేము "కొత్పర' మదెట్టిదొ? వారిని జూడ రాము, మి
మ్మెఱుఁగము మీదుపాత్రముల నింపెసలారు "ఘాటోలు" దక్క నేఁ
డరసితి మయ్యె ధన్యము భవాదిక; మూరక పొమ్మటందురో?
దరిసెన మిచ్చి నందులకుఁ దగ్గఫలం బొసఁగం దలంతురో. — ౩౧

చ॥ అనుచు ననేకభంగుల జనావళి మాపయిఁ గల్గుప్రేమమున్
నుపడఁగ జేయుచున్, బలుకఁగా నప్పుడేము వసించుసౌధ మొ

య్యన డిగి నాటకాలయమునఁ దొకపేటికన్ బొనర్చి నే
ర్చినగతి వారికిన్ గలుగఁ జేసితి మగ్గల హైనహావముల్. ౮౧

సీ॥ "తిరుపతివేంకటేశ్వరులఁ జూచితి" మంచుఁ బలుమాఱు సంతసంపడెడివారు,
ఉద్వృత్తుకా లేచి యొక్కదండములిడఁ బడి నమస్కారమ్ము లిడెడివారు,
కోపరింపువార లీగోడవఁ దెచ్చుట మేలె యయ్యెఁబో యని పేర్మి నాడువారు,
కయ్యంపుసభఁ జూడఁగలభాగ్య మిఁక లేదు వారుపాటిరటంచు దూఱువారు,

గీ॥ పాటలేమి యొనర్తురు వారికన్న, సరుకు నెఱుఁగమె యని చర్చ సలుపువారు
ఐనచోఁ గాలు ద్రిప్పనేలనెడివారు, అనుగుమవ్వారి నటకేగుమనెడువారు.

ఉ॥ అన్నిట వీరిదృష్టిని శతాంశము వారలు గారు దద్దడన్
దున్న కవిత్వమందు వలఁతుల్ మనవారలె యౌదు, రంచు; నే
మున్నది దానిలో ననుచు, నుండిన దేదియు యున్న దంచు, నా
తెన్నొకకష్టమే యను, చుదీర్ణతరమ్ముగ వాదు లాడుచున్. ౮౨

ఉ॥ ఏమియు రానివార లెటు లేది యొనర్చిన మంచి దౌ సుధీ
గ్రామణు లట్లొనర్చునెడ గ్రాంథికు లొప్పరు సాఁగఁ దీతు రిం
తే, మనవారు వోలె నలతిర్పతివేఁకటపండితుల్ వచ
స్తోమము జార్చ లేరె యది వోసముగాఁ దలపోయ కుండుచో. ౮౩

ఉ॥ జార్తురు గాక నోరెటులొ చయ్యన, నొయ్యన నల్లి పద్దెముల్
గూర్తురుగాక వీరు "చెవి గోసిన మేఁకల" పోల్కిఁ జాలసే
పార్తురె! డయ్యరే? యుభయు లంత బలాఢ్యులె దేహదార్ఢ్యమం
దేర్తురు కొప్పరంపుఁ గవులీకవియుగ్మము నొక్క ద్రేల్మిడిన్. ౮౪

చ॥ అనునెడ దేహదార్ఢ్యమున కా యలవారలు గాలు ద్రవ్వి రి
వ్వనియెడ నేను జాలనొకో? పాండితియున్న భయమ్ము గాని వీ
రిని మఱి వారినింగలిపి రేనియు నాబుజ మొక్కటే సుఁడీ
పనిఁగొని యాఁపునం చొకడు బాహుబలాఢ్యుఁడు పల్కె నల్కమై. ౮౫

క॥ అని వారి వారికిన్ దోఁ, చినగతిగాఁ "బిచ్చపాటి" చెప్పికొనుచు భో
జనపుం బసలకుఁ జని మఱి, దినమున నటనుండి బయలుదేఱిరి వారల్.

చ॥ నెలవును ద్రావసె సూర్కొలునకుఁ జెచ్చెర వెంకటశాస్త్రి మున్నె, యీ
కలహము దేలునంతకును గాల్గదలింప నటంచుఁ బంతముం
గలిగి వసించె నప్పురిని, గయ్యపుసంగతు లాలకించి శి
ష్యులు మఱికొంద ఱయ్యెడకుఁ జూడఁగ వచ్చి తనున్ భజింపఁగన్. ౯౦

చ॥ సరసులు యోగ్యలౌజనులు సంతతమున్ గవితాదరమ్మునై
నెరఁగుచు విందులన్ దనిపి యెంతయు గౌరవ మాచరింప న
ప్పర మది వాసమై యచటిపూజ్యులకున్ దలలోనినాల్కయై
తిరుపతి యప్పు డప్పు డరుదేరఁగ, వెంకన యుండె నయ్యెడన్. ౯౧

శా॥ "ఆసీమాంత మొనర్చి గాని విడువం డా వెంకటేశుం" డటం
చా సీమన్ జనులెల్లఁ జెప్పికొన నిత్యమ్మున్ గవిశ్రేణి కెం
తే సంతోసము గూర్చుచున్ విమతు లంధీభూతచేతస్కులై
యూసున్ జెంది కృశింప మూడునెల లందే యుండె నుద్దండతన్. ౯౨

ఆ॥ వె॥ మొదటఁ గాలు వెట్టినది యల్ల*శిష్ట్లాహ, నూమదార్యగేహసీమ యచటి
నింబభూరుహంపునీడ సాక్షాత్కల్ప, పాదపంబునీడ గాఁ దనర్చె. ౯౩

ఉ॥ చావలు నిండి బల్లలకుఁ జాలి రజఃకణకీలితంబు భూ
మీపద మాక్రమించి పయిమిక్కిలి వీధికిఁ దాఁకి గేహపుం
దాపున నున్న యన్యసదనంబుల ప్రక్కల నిల్చి సారెకున్
శ్రీపతివేంకటేశ్వరులు చేయుప్రసంగము విందు రెల్లరున్. ౯౪

శా॥ అంబా! నింబము నీనివాస మదియో! యభ్రంకషానూనశా
ఖం బచ్చో నెపు డీవు పొల్చు టది సిక్కంబే, భవత్సాక్షికం

---

(గుంటూరినుండి బ[illegible]లు దేఱు సమయమునఁ జెప్పినది.)

*సీ॥ తిరుపతి వెంకటేశ్వరుని కొండకు నీకు భేదమే కనఁబట్టలేదు తల్లి, శ్రీ
శైలమల్లేశు శిఖరమ్మునకు నీకు భేదమే..., మధురమీనాక్షి వేశ్మస్థలికిని నీకు
భేదమే..., కాశికావిశ్వేశుగర్భగుడికినీకు భేదమే... తల్లి, తే॥ గీ॥ ఎట్టిసుముహూ
ర్తమందుఁ దాఁగట్టెనొకొ, ఘనుఁడు శిష్ట్లాహనూమదాఖ్యక సుకవి, అడుగు
వెట్టిన దాది బ్రహ్మసభఁజేసి, పంపుచుంటివి నినువీడ వలసె నేఁడు. (వెం॥ శా)

బుం బూజ్యాశయసాక్షికంబు నగుచుం బొల్పారుతత్తత్స్వభా
లంబంబౌ కవితాప్రసార మది యేలా నొక్కి వ్రాక్కుచ్చుటల్, ౯౫

మ॥ ఎటు నీభక్తులవాక్సుధాద్రవము లందేపారె, శత్రువ్రజం
బటుకున్ వచ్చి మనంబునందు నెటు "ఫే" లౌవార, లాకొప్రపం
గటువాక్యమ్ముల కెట్లు వారురక దుఃఖం బందువా, రెట్టుగా?
గుటకల్ మ్రింగెదివారొ? నీమది నెఱుంగున్ జెప్పఁగా నేటికిన్. ౯౬

ఉ॥ వినను శాఖ బాధ కయి యావలికిం జని తప్పుచొప్పులన్
బూని యవాచ్యముల్ గిలికి పుచ్చియు నెమ్మన మూఁగ లేక మా
పై నెనరున్నయట్టులుగ వచ్చి రనం బది గోడ్రిలి పోవు వా
రేని యథార్థముం దెలియునెల్లను నీవును డాఁగుచుంటు రే. ౯౭

చ॥ ఎలమి వచించి తీరవలె నీకపటాత్ములసత్స్వభావ; మీ
యలఘుల కేమి శత్రువులపై మఱి మావచనంబు లెట్లు వీ
నులకు రసాయనంబు లగునో? యని జీర్ణము లైన వెంట లే
ఖల కవవాదముల్ గిలుకఁగాఁ గరముల్ దురగాడు లెట్టులో. ౯౮

క॥ ఖలజనులవర్తనములకుఁ, దల యూని తోఁక యని చెప్పఁ దరమే? యలవా
పులకేమి నింబకుజమా, తలనభ లవి యెంతకేని దగు జగదంబా. ౯౯

చ॥ అరు లగువారి కిట్టు లెదయందలికుంటటివోలె నుండి యా
తిరుపతివెంకటేశ్వరులు "తీర్పరులన్ బిలిపింపుఁడీ, సభన్
జరుపుఁడి మీనముల్ తెలుకఁ జాలినచోఁ దెలుకుం డ,,టంచుఁ దీ
వరముగఁ దెల్పఁ గొప్పరపువారిబడాయికి నీమ్రక్కమమ్మగన్. ౧౦౦

ఉ॥ తగ్గి యిదెట్టులేనియును దప్పికొనన్ వలె నంచు నంతటన్
బగ్గెలు వ్రాయ మాని తమపక్షము దుర్బల మౌట నెట్టులు
న్నెగ్గ దటంచు లో నెఱిఁగి *నెయ్యుఱుకుం గడు గూఢవృత్తిపై
నగ్గతి డాఁచి స్నేహ మగు టర్హ మటంచు లిఖించుచు న్వినన్. ౧౦౧

---

చెన్నపురి; ఫెబ్రవరి, గురువారం.

*....నిన్న కొప్పరపుంగవులు నాపేర 8 పేజీల ఉత్తరం వ్రాసినారు, వివాదవ

సీ॥ వయికిఁ బ్రగల్భవాక్యములె పలుకుచు నప్పురమునందె తీరికన్
గయికొని కూరుచుండిరి పత్రికంపిత మైనమనంబు చందమె
ల్లయెడల నెల్లరం దెలిసి "లావణి" గంచు వచించుచుండున
ప్రియములు పూర్తిగా వినియు బీరము మానర వారు మాటలన్. ౧౦౨

ఉ॥ అంతట వారిపక్షమున కాదరు వౌకులవృద్ధుఁ "దక్కటా!
యంతన తేలి పోవు నని యంపు మటంటిమి పత్రమల్లవా
రెంతటివట్టు పట్టరో కో! యిప్పరి వీడరు కొప్పరంపువా
రెం తలవారిథాటి; కిపు డేమనుకొన్న మదేమి లాభమా. ౧౦౩

మ॥ పులిపై జెడ్డను వేసి చెట్టువయికిం బోవన్ వెసన్ దత్కుజ
స్థలమందే యది పీఁట వెట్టి యెటులో సాధించుఁ గావే పగన్
దొలి నాలోచన చాల దయ్యె నపు డేదో వ్రాయు మన్నార మి
ప్డలఁతిం బో కది "యేకు మే., కనెడిసామ్యం బయ్యె నెట్లో కదే ౧౦౪

ఉ॥ పాతము? "వారిదాసులము వారలలోన శతాంశమేనిఁ గా
మోపము వారి., కంచు నతిసౌగ్యుఁడు కొప్రిపు జ్యేష్ఠుఁ డప్డు తా

---

రిత్రిమును వ్రాసినారు, తమదోషము లేశమును లేదనియు వెం॥ శా॥ అన్యాయముగా గర్హించిరనియు, మొదలుగా వ్రాసినారు. దానికైఖరిచూడఁగా వివాదమునుండి తప్పించుకొనుట కిష్టపడుచున్నారని దోఁచుచున్నది. అట్టిప్రయత్నమున్నచో తప్పక మీరును అంగీకరింప వేఁడెదను ఈ వివాదసభలు కార్యకారులు కావు. నడుమ వారికి పండువు, పోరాడువారికర్వరకు శ్రేయము కన్పడదు, ఈసభలలో తీర్పుతీర్పువారెవరు? ఎట్లుసాగును? "లోకోభిన్నరుచిః., తత్రాపి స్వస్వపక్షాభిమానోబలవాన్ బాధతే, వారు "ఛాలెంజి,, ప్రచురించినందుకు, శివరామశాస్త్రి మరల ప్రచురించెను. ఇంతట నాఁగిన బాగుండునని నేను తలంతును నాప్రార్థన మిదియే. ... ఏవిధముననైనను తగవు మాపుకొనుట బాగు, నేను వారికేమని సమాధానము వ్రాయుటకును పాల్పోకయున్నాను, జబాబు వెంటనే వ్రాయించవలెను...."

వే॥ ప్రభాకరుఁడు.

నూపిన యంతవట్టు మొగ మోడక చెప్పె వృథాభిమానపుం
దాపము నాఁడు మామదికిఁ దదస్వచనమ్ముల నెక్కొ నీ దహో. ౧౦౫

ఉ॥ ఎంతటి ధైర్యమున్ మఱియు నెంతటిశక్తియు లేక యున్న ని
శ్చింతగ నాఁటి సత్సభ “ససేమిర వారల కాసనంబు మా
చెంత ఘటింపఁ గూడ” దని చెప్పఁగ నేర్చునె? వేఱు సీమ య
న్నంతన భీతి పుట్టవలదా? కలదా? యిటువంటిచేవయున్. ౧౦౬

చ॥ ప్రముఖుల మెంతమంది పని వట్టితి మక్కటా? వారిముందు మా
ఆ మయితి మింత కెంతటిపరాభవ? మూరక కొప్పరంపువా
రిమొరవ మిక్కుటమ్ముగనఁ బోరిం బోరిఁ దగ్గఁగఁ జొచ్చెనే యుపా
యమునను వీరిపైఁ బడునపాయముఁ బాయఁగఁ జేయఁగా వలెన్ ౧౦౭

మ॥ * అని యోజించుచు నుండె నంత నొకనాఁ డాయీప్రసంగంబు నె
ల్లను విన్పింప సభం బొనర్చి తగుహేలన్ విన్కి నేయంగ వ
చ్చినవా రెల్లరుఁ బత్రికల్ వినుచు మంచిన్ జెడ్డ యోజించుచుం
డు నెడన్ గొందఱు వచ్చి రయ్యెడకు నెట్లో యానద స్వాఁగఁగన్ ౧౦౮

* నిష్పక్ష పాత హృదయులును యథార్థపరిజ్ఞాతలును గుంటూరుపురవాస్తవ్యులు నగు నార్య సోదరులారా! కొప్పరపువారు ప్రతిజ్ఞా పూర్వకముగా 27 వ తేదీ ఆదివారమునాఁడు సభకురావలయునని ముందుగా మాపైఁ గాలుద్రవ్వి పత్రికవ్రాసి, యందులోని యసందర్భములను దెల్పుచు మేముత్తరమీయఁగా వానికిఁ దగు సమాధానము వ్రాయక యేవో కొన్ని యుక్తులతోఁ గొన్ని యుత్తరములు వ్రాయుచు సభ ఆదివారము దప్పించి సోమవారమునకుమార్చిరి తుద కాదివారమునాఁటిరాత్రి యనేకగ్రామములనుండి విచ్చేసిన మహాజనుల విఫలమనోరథులఁ జేయుట యుచితము కాదని మేమాదివారమునాఁడు వ్రాసిన యుత్తరములోఁ గొన్ని పండితసమ్మతములైన నిబంధనము లుదాహరించి “యీ ప్రకారము మీరు సభకూర్పుఁడు లేదా మేము కూర్చెదము అంగీకారానంగీకారములు శేపుదయమునకు దెల్పుఁడు లేదా మీరీయుద్యమము మానుకొన్నట్లే ప్రజలు దలంతురుగాక” అని స్పష్టీకరించినను దానికి జవాబు వ్రాయక సభానిర్ణయదినమునందుఁగూడ నుదయము 8 గం॥కు మరల రిమైండరు పంపినను దాని

ఉ॥ వచ్చిరిగాని యీసభ యథార్థముగా జరిగెన్, సమస్తమున్
విచ్చుననంటిపండుబలె విజ్ఞులదృష్టికి స్పష్ట మయ్యె "ని
ష్పచ్చర మెందు కీగతి గబాగబ లాడిరొకో?", యటంచు వె
న్నిచ్చినవారి దూటి "రిహిహీ? యిహిహీ?", యని కొంద ఱాడ్యెడన్. ౧౦౯

---

కిని నేమియుఁబలుకక చల్లఁగా నా దినమెల్ల దాఁటించి ఆమఱునాఁడు 29 వ తేదీని మాకవసరము లేకున్నను మేము మరల "మీయుద్యమము మానుకొన్నట్లేయగుచో తెలఁచి మేము కాకినాడ వెళ్లుచున్నా" మని వ్రాసిన యుత్తరమునకును దగిన సమాధానము నేమియు వ్రాయకుండుటచే వారు సభను మానుకొన్నట్లు మున్మాటికిని స్పష్టపడినది. పిదప సభమాటట్టు లుంచి మీ మా యుత్తరప్రత్యుత్తరములలోని సారాసారములను న్యాయాన్యాయములను ప్రాజ్ఞులమూలముగాఁ దీర్చికొని పిమ్మట విద్యావాదమునఁ బ్రవర్తింతమనియు, ఇందులకు రేపుదయము 8 గం॥కు లోఁగా జవాబిండనియు 29వ తేదీ రాత్రి 7గంటలకు మా వ్రాసిన యుత్తరమునకు నేఁడు 10, గంటలకు ననవసరపు యుక్తులతో దానికిఁగూడ నంగీకారమును దెల్పక "యుత్తరప్రత్యుత్తరములు ముగించుకొన్నాము" అని వ్రాసిన యుత్తరమునుగూడఁ జూచి వారికి జవాబు వ్రాయుట యింతతో ముగించుకొని ఆయీయంశములు లోకులకు శ్రుతపఱపఁ దలఁచి ఈనాఁటి సాయంకాలము 6ఘంటలకు శ్రీ ఫస్టుకంపెనీనాటకశాలలో నుపన్యసించుచున్నారము గానఁ దామెల్ల విచ్చేయఁ బ్రార్థితులు.

ఇట్లు,

గుంటూరు, 30-8-11. తిరుపతివేంకటేశ్వరులు. శతావధానులు.

పైనుదాహరించిన యాహ్వానపత్రిక ననుసరించి శ్రీ ఫస్టుకంపెనీ హాలులోనికి ననేకులు పౌరులును నితరులును నగు మహాజనులు నియమితకాలమునకు మున్నే వచ్చియుండిరి. పదపడి కాలేజి ఉపాధ్యాయులగు బ్ర॥ శ్రీ॥ మల్లాది వెంకటసోమయాజులవారి కోరిక ననుసరించి శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు బి. ఏ. ఎల్. టి. (వీరును కాలేజీ యుపాధ్యాయులే) గారగ్రాసనాధీపత్యమును వహించిరి. వీరు సంస్కృతాంధ్రములలో గ్రంథముల రచించిన పండితకవిసత్తములు. పిదప నాయాయీ యుత్తరములు తిరుపతివెంకటేశ్వరులు వినిపింపఁ దొడంగిరి. మొదట వెంకటశాస్త్రిగారు శ్రీకొప్పరపువారి మొదటియుత్తరమును మాత్రము

ఉ॥ పనిగొనియుత్తరాల్ వినుచుపట్టున నాసభ నాఁగుపూనికిఁ న్వ
చ్చిన యల శ్రీనివాసగుణిశేఖరు వైఖరి "కొప్పరంపున
త్తనములయుత్తరమ్ము లవి ప్రాజ్ఞసభాసనుకూలమర్వచః
ఖను లని యెల్లవారలకుఁ గన్పడఁ జెప్పక చెప్పె నొప్పఁగన్. ౧౧౦

---

వినిపించి ఆనాఁడే 12గంటలు మొదలు మూఁడు గంటలవఱకును గోర్టులోఁ గంసాలులనుగూర్చిన వ్యాజ్యములో సాక్ష్యమిచ్చి యుండుటవలని యాయాసము చేఁగా బోలును పదపడియుత్తరములను దిరుపతిశాస్త్రిగారిని వినిపింపుమనిరి. తిరుపతిశాస్త్రిగారు వినిపించుచుండఁగాఁ గొందఱు పెద్దమనుష్యులువచ్చి యంతతోఁ బ్రకృతసభ ముగించుటకై వెంకటశాస్త్రిగారిని గోరిరి గాని తగినంత హేతువును జూపి కోరనందున వెంకటశాస్త్రిగారందుల కంగీకరింపరైరి. పిదప గంభీరముగాఁ దిరుపతిశాస్త్రులుగా రాయాయియుత్తరప్రత్యుత్తరముల నుపన్యసించుచుండఁగా వేంకటశాస్త్రులుగారు దానినాఁపనుంకించువారితో సహేతుకముగా మెల్లఁగానుపన్యసించుచుండిరి పదపడి సభ నాఁపుడని కోరినవారు తామేదో మధ్యచెప్పుటకు నవకాశమిండని కోరిరి అందులకును దుట్టతుదకుఁగాని వీలులేదనియు నప్పుడేని యగ్రాసనాధిపతుల నడుగఁదగియుండుననియు వెం॥ శా॥ గారు బదులు చెప్పిరి. పదపడి యుత్తరములనెల్ల దిరుపతిశాస్త్రిగారు వినిపించినపిదప నెవరు సమర్థులో, యెవరు కారో, యెవరియుత్తరములు దురుసుగానున్నవో యెవగిపట్టివి కావో? యెవరు కోరిన షరతులు పండితసమ్మతములో యెవరివి కావో, యెవరి వెనుకతీఁతవలన సభ కాలేదో, లోనగు నంశములు సభ్యులకే కాక సభ నాఁపవచ్చిన యుత్తమపురుషుల హృదయములకుఁగూడ స్పష్టపడినవి. ఆ యీయంశములనే శ్రీ ఆగ్రాసనాధిపతిగారు తుట్టతుదనుపన్యసించుచు "మీసమూలపద్యము యొక్క యర్థమును గూర్చి,, తాముగూడ నిదివఱకుఁ బొరపాటుగానే యన్వయించుకొంటిమనియు నిప్పుడది స్పష్టముగాఁ దెలిసినదనియు నుభయభాషలు రానివారు దానిజోలికిఁ బోఁగూడదనియు సంస్కృతము రాని తెలుఁగు గణనీయము కాదనియు నుపన్యసించుచుండఁగా సభ నాఁగు పూనికతో విచ్చేసినవారు ప్రకృతమావిషయము నాఁగవలసినదనికోరిరి. దానిమీఁద నగ్రాసనాధిపతిగారు "వీరికోరిక ననుసరించి యాపద్యార్థమునిప్పుడు విస్తరింపక వదలితి"మని చెప్పి యావిషయము మానితమకీయుభయకవులయందును భగవంతుఁడు న్యాయముగాఁ జూపించిన యభిప్రాయమును వెల్లడించిరి. అదివిని సభ్యులెల్ల నా

ఉ॥ ఏమిటి కాఁగఁగా పలెను? యెల్ల రెఱింగినయుత్తరమ్ములన్
శ్రీమహితుల్ మహామహులు చేరినసత్సభ విన్కి నేయుచో
నామహితుండు ప్రాజ్ఞుఁ డగునట్టిఁడు గావున వారితప్పుఁడుం
బూమెలు కంపు గొట్టు నని బుద్ధి గలంగినవాఁడుగానిచో. ౧౧౧

క॥ ఉత్తరముల తత్తఱములు, సత్తములను నేహ్యమైన చందము గలవం
చుత్తముఁడు శ్రీనివాసుఁడె, విత్తములకు సాక్షి యని వివేకు లెఱుఁగుతన్.

క॥ *కుచమర్దనాదిపదముల. రచనం బచరించుకొప్పరపువారి వచో
నిచయము గలపత్రికలకు, నచటఁ గలసభ్యు లేవమందిరి పెలుచన్, ౧౧౩

క॥ ఆమెయి సాక్షాదశ్వ, త్థామన్ బరణించుతేజు దశదిశలలమం
గా మాశిష్యుం డలశివ, రామయ చనుదెంచె సభ కరం బలరారన్ ౧౧౪

ఉ॥ వచ్చి సభాంతమందుఁ దనవచ్చిన హేతువు, తాను విన్నయా
యచ్చెరువున్, సభాధిపతి యాజ్ఞను బొంది సభాసదుల్" బలే!

---

నందించిరి. పిదప శ్రీ వెంకటశాస్త్రులవారు కవితయన నేమో, కవియన నెవరో, ఆశుకవితయన నేమో, కవికివలసిన సామగ్రియేమో, తేటతెల్లముగా నుపన్యసించిరి; పదపడి సభనాఁగు ఫూనికతో విచ్చేసియున్నవారిలో నొకరగు మ॥ రా॥ రా॥ గోవిందరాజుల శ్రీనివాసరావుపంతులు బి, యే, బి, యల్. గారు సర్వసమ్మతమగు స్వీతమ మనోరథమును వెల్లడించిరి. వారిఫూనికకు వెంకటశాస్త్రిగారు తమ సమ్మతిని దెల్పిరి.

*(3) ఇంతనైన మీస్వకుచమర్దనములు మానుకొని"...

30-8-11 ఇట్లు,

కొప్పరపు వెంకటసుబ్బారాయశర్మ-శతావధాని.

ఉదయము—9—గంటలు.

$ పదపడీ యంతకొక యరగంటకును న్నై రైలుదిగినభాభవమునకువచ్చియున్నట్టియు, తిరుపతివెంకటేశ్వరుల శిష్యుఁడైనట్టియు, చిరివాడ గ్రామ కాపురస్థులు శ్రీవేలూరి శివరామశాస్త్రులవా రీక్రిందిపద్యములఁజదివిరి.

ఆ॥ వె॥ రాజశ్రీ భుజంగరావు. చెల్లతిరావుఁ గూర్చి యిటులువ్రానె గుంటు

నచ్చినశిష్యుఁ డీతఁడె'' యనన్ విని నింపగుకంఠమాధురిన్
హెచ్చగుగానపుంబటిమ యేర్పడఁగాఁ జదివెన్ గ్రమమ్ముగన్ ౧౧౫

క॥ పదపడి సభ్యులు సారెకు నెద శివరామకవి వాణి కెంతయుమెచ్చల్
వాదలఁగఁ గరతాళంపుని,నదములఁ జెలఁరేఁగఁ గ్రన్నన సభ ముగిసెన్

క॥ ఆమఱునాఁ డుదయము శివ, రామయ కోపంబుఁ గవిసి "రారమ్ము సభా
సీమ" కని యుత్తరంబు, ద్దామత లిఖియింతు" ననుడుఁ దద్దయు నెమ్మిన్.

ఉ॥ వెంకటశాస్త్రి పల్కె "నది విన్న బుధుల్ మము నవ్వ నల్లె ని
శ్శంకగ నిన్ను నవ్వుదురు శాస్త్రము నేర్చియు సాహితి న్నిరా
తంకతఁ జేర్చియున్ శతవధానివి యై యసమానకక్ష గాఁ
ఱంకెలు వైచెదే? "సభకు రం" డని కొప్రపువారిఁ బిల్చుచున్. ౧౧౬

క॥ † అసమానకక్ష యని మము, రస దూకెడివారియుత్తరము లివిగో? నీ
రస మీకయ్యముమాకున్, బోనఁగెం దనయంతఁ బూర్వపుంగర్మమునన్.

రిపురి, జరుగుచున్న వైరచర్యయందునఁదిర్పతికవి, వెంకటకవి, తెనుపుతప్పె॥1॥ చ॥ అనవిని యంత నామడలునామడలుంబడిపోయినట్లువ,చ్చిన నదిమిథ్యయంచుఁ దెలిసెన్ గవితాసభలేకపోయెఁగా,కనుఫుగధారణాబలమునందన నాశుకవిత్వమం దునన్. దనివిగఁ గొప్రపుంగవుల దారులుతీరులుచూచితీరనే ॥2॥ తే॥ గీ॥ కాశినాథబుధేంద్రుఁడు ఘనుఁడు శిరిని,వాసనూరియు నెందఱోవలఁతులైన, కవులుపీఁకనిమీసమ్ము కఱచిపట్టి, పీఁకనున్నారె కోపంబుఁ బిదపకవులు ॥3॥ తే॥గీ॥ కలదు నేత్రావధానంపుగరిమయొకఁడు, కలదు గర్భావధానంపుగరిమయొకఁడు, కలదు హస్తావధానంపు గరిమయొకఁడు, వీని నెఱుఁగని నూరులెందేనిగలరె॥4॥ ..."

---

1. †...యిదివరలో వున్నదే అసమాకక్షఅని అనుకుంటూ వున్నసంగతిలో పులిమీదపుట్రలాగున్న యిదివకటి వచ్చినది దీనిని గు॥ కొన్నిరోజులువ్యర్థ పుచ్చడమున్నూ శ్రమతీసుకోవడమున్నూ నాకుసుతరాం యిష్టంలేదు...."

ది 28-8-11 రా॥ వెంకటసూర్యరావు.

Masulipatam.

2. బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతి శాస్త్రులవారిసన్నిధికి, మీరుకృష్ణారా

నచ్చినశిష్యుఁ డీతఁడె'' యనన్ విన నింపగుకంఠమాధురిన్
హెచ్చగుగానపుంబటిమ యేర్పడఁగాఁ జదివెన్ గ్రమమ్ముగన్ ౧౧౫

క॥ పదపడి సభ్యులు సారెకు నెద శిథరామకవి వాణి నెంతయు మెచ్చల్
పొదలఁగఁ గరతాళంపుని,నదములఁ జెలఁగెఁగఁ గ్రన్ననన్ సభ ముగిసెన్

క॥ ఆమఱునాఁ డుదయము శివ, రామయ కొప్రింపుఁ గవిసి "రారమ్ము సభా
సీను'' కని యుత్తరంబు, ద్దామత లిఖియింతు'' ననుడుఁ దద్దయు నెమ్మిన్.

ఉ॥ వెంకటశాస్త్రి పల్కె "నిది విన్న బుధుల్ మము నవ్వ నల్లె ని
శ్శంకగ నిన్ను నవ్వుదురు శాస్త్రము నేర్చియు సాహితి న్నిరా
తంకతఁ జేర్చియున్ శతవధానివి యై యసమానకక్షగాఁ
అంకెలు వైచెదే ని "సభకు రం'' డని కొప్రపువారిఁ బిల్చుచున్. ౧౧౬

క॥ † అసమానకక్ష యని మము, రస దూలెడివారియుత్తరము లిపిగోని నీ
రస మీకయ్యెముమాకున్, బొనఁగెం దనయంతఁ బూర్వపుంగర్మమునన్.

---

రిపురి, జరుగుచున్న వైరచర్యయందునఁదిర్పతికవి, వెంకటకవి, తెవుతప్పె॥1॥ చ॥ అనవిని యంత నామడలునామడలుంబడిపోయినట్లువ,చ్చిననదిమిథ్యయంచుఁ దెలిసెన్ గవితాసభలేకపోయెఁగా,కనుపుగ థారణాబలమునందున నాశుకవిత్వమం దునన్. దనివిగఁ గొప్రపుంగవుల దారులుతీరులుచూచితీరనే ॥2॥ తే॥ గీ॥ కాశి నాథబుధేంద్రుఁడు ఘనుఁడు శ్రీని,వాససూరియు నెందఱోవలఁతులైన, కవులుపేఁ కనిమీనమ్ము కఱచిపట్టి, పేఁకనున్నారె కొప్రింపుఁ బిదపకవులు ॥3॥ తే॥గీ॥ కలదు నేత్రావధానంపుగరిమయొకఁడు, కలదు గర్భావధానంపుగరిమయొకఁడు, కలదు శాస్త్రావధానంపు గరిమయొకఁడు, వీని నెఱుఁగని సూరులెందేనిగలరె॥4॥ ...''

---

1. †...యిదివరలో వున్నదే అనమాకక్షఅని అనుకుంటూ వున్న సంగతిలో పులిమీదపుట్రలాగున్న యిదివకటి వచ్చినది దీనిని గు॥ కొన్నిరోజులువ్యర్థపుచ్చడమున్నూ శ్రమతీసుకోవడమున్నూ నాకుసుతరాం యిష్టంలేదు....''

ది 23-8-11 రా॥ వెంకటసూర్యరావు.

Masulipatam.

2. బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతి శాస్త్రులవారిసన్నిధికి, మీరుకృష్ణారా

చ॥ జ్వరితుఁడ నయ్యు సజ్జనులు సారెకు రమ్మని పిల్వక్షీరానిచో
గరువముగాఁ దలంతు రని కన్తి గణింపక వచ్చినాఁడ ని
ష్ఠురపు నియోగివైదికులపా త్రిసుమంతయు నే నెఱుంగ దు
ర్భర మనమాన కక్ష యిటు రాఁ దగి యుండఁగ నెల్లెఱింగెదన్.

ఉ॥ ఐనను గాలు ద్రవ్వదానఁ గాదెస నుండుటఁ జేసి యంత మా
పై నెపముండ దీ విపుడు పత్రిక నంపెదవేనిఁ బోరికిం
దా నయిపిల్చినట్లయి "తక్కెడ" సామెతగాఁ దనర్చు నీ?
మానఁగ దయ్య యిట్టియసమానపుఁ గక్షకు దీక్ష యేటికిన్.

ఉ॥ ఎప్పటికేని మాయెదుటనే పడఁగా వలె వార, లప్పుడా
తప్పుడుకైతపద్ధతులు తజ్ఞులకున్ విశదంబు కావలెన్
జెప్పి ప్రసంగముల్ సలుపు పెద్దలతోఁడుత నీకు నేల? నేఁ
జెప్పిన మాటచొప్పునకుఁ జేతము చొన్పుచు మిన్నకుండుమీ.

చ॥ వెనుఁబడి కాకవుల్ తనదువీపుజయిం జరణమ్ము లుంచి తా
చిన నది లెక్కగాఁ గొనక చిప్పకుఁ బూనక వైనతేయుఁ డే
మనక శిరమ్ము వంచుకొని యల్లనఁ బోవఁడె? శక్తిమంతు లెం
దును నలఁతుల్ పొనర్చు నలతుంటుడుకున్ గణియింప రంతగన్.

---

వుగారిపేరున వ్రాసిన జాబు చేరినది, మాయుభయుల నమస్కారములను అంగీ
కరింపవేడుచున్నాను, యథార్థవాదియొక్క వ్యాసము యథార్థముగనున్నను లే
కున్నను దానిసత్యాసత్యములు మేము గ్రహింపజాలము ........మీరీలేనిపోని
కలహములలో జిక్కుకొని ఆరోగ్యమును, బుద్ధిని చెడ గొట్టుకొనుట మాయ
భిప్రాయము కాదు. వారిని గెల్చినను మీకీర్తి హెచ్చునా? ఇదివఱకే మీఖ్యాతి ద
ద్విఖ్యాతమైనపుడు మీకీపోరాటము లెందుకు? వారుకుర్చీమీద గూరుచు ర
మన కేమి? ఇంటి కప్పుమీదగూరుచుండిన మన కేమి? మీబలాబలములు లో ంజు
ర్తిగ నెరిగియే యున్నది. ఈపోరాటములను గుంటూరు చెరువులో దీసి, కా
వెంటనే బయలుదేరి రావలయునని మాప్రార్థన..." మీసము

ంటికురగ

ఆ॥ నారాయణ చింపుండు కా

ఉ॥ ఇంతకు నీవు పత్రికల నెన్నిటి నంపిన నేమి లాభ? మా
వింతకవీశు లెన్నఁటికి విజ్ఞులు తీర్పరు లున్నసత్సభా
భ్యంతరమందు ని న్నెదురువా రసకోకుము వారితందనాల్
గాంతు రెవారు వారికడ గంతులు వేయుచునుం డ్రెలుంగుమీ, ౧౨౪

శా॥ "ఓ కెన్నొ్న మఱివంక" లన్నఁ దెలియఁ జోగింపఁగా లేనిస
ద్దీకుల్ వారికిఁ దోడు, వారిదియుఁ దాదృగ్వివిశేషంబె యీ
యేకాకారులు సత్సభాస్థలికిఁ దా రేమంచు నేతెంతు? నీ
వీకార్యమ్మనకుం గడంగకుము మేమే యుంటి మన్నింటికిన్. ౧౨౫

చ॥ అనుటయు నాతఁ డప్పటికి ననర్థము చెప్పక మిన్నకుండె నె
మ్మనమున బాల్యచాపలము మాసని చందము తోఁచుచుండె, నా
తని కొకకొంత తిర్పతి స్వతంత్రత నిచ్చె ననంతరంబు వెం
కనఁ గికురించి యిర్వురను గ్రక్కున నేగిరి "ప్రస్సు" ప్రక్కకున్. ౧౨౬

ఉ॥ * పద్దెము లచ్చు వేసి యవి పంపి నభోమణి రెండుయామముల్
ప్రొద్దును దాఁటునప్పటికిఁ బూర్తి యొనర్చిన మేటికార్యమున్
దద్దయు మెచ్చుకొంచు బసదగ్గఱకున్ జనుదెంచి చెప్పి రిం
కెద్దియుఁ జేయ రామి నహియించెను వెంకన కొంతనొప్పుతో. ౧౨౭

---

మ॥ రా॥ రా॥ శ్రీ కొప్పరపు వెంకట సుబ్బరాయశర్మగారికి.

* చ॥ తిరుపతి వేంకటేశులకుఁ దెంపరివై నరివైఖరిం గవీశ్వరుఁడను వాఁడు నోటనుడువన్ గడు సిగ్గిలు నాశుధారకున్, బురికొలుపం దలంచితె 'నమోనమ' యంచు వచింపకేటి య, ల్లరియిది సింగ మెన్నపలలంబు భుజింపక పూరిమేయునే. మ॥ అనిమిత్తంబుగఁ గాలుద్రవ్వి వత్వదీయాహంత నాఁపుందలం, పున నీనీరసనిర్గుణాశుకవనంబున్ జెప్పి నిన్నెల్ల నెం, చిన యస్మద్గురువర్యులన్ సకవితాశ్రీధుర్యులన్ మానిపిం, చి నినున్ గెల్వఁగ వచ్చినా నిదె సభంజేయింపులేవత్తువో. ఉ॥ గంటలు గట్టికొంటివట? "గంటకువందలు వేలుపద్యముల్, డమ్మనుమంచు' నేఁడు పరికించెద గెంటుటయెట్టిపోయి? నినుం, గెంటెద నేవధాన మైద నీరసధారయందు నీ, ఘంటికలూడఁ గొట్టెదను గాచుకొనంగమన్. సీ॥ గురుపాదసేవఁ జేకూఱిన వ్యాకృతిపాండిత్యగరిమ య

2. బహుశ్రయభాషాకావ్య విభవాభిరామమౌ పాండిత్యగరిమ యటుఁడని

శా॥ * రామస్వామి యనంతరమ్ముఁ గడుధీరత్వమ్ముఁ జెన్నార నే
మేమో పద్దెము లల్లి తెచ్చి యవి మమ్మాక్షింపుఁ డన్నన్ క్షణం
బేమిం జెప్పక పిమ్మటం జదివి" మే? లీపద్దెముల్ వారిదౌ
సామర్థ్యమ్ముఁ గదుగా యథార్థముగ నిచ్చల్ నచ్చి వాకుచ్చెడిన్ గుంటూ

---

చ్చి, రసవత్ప్రబంధనిర్మాణధీచాతురీపాండిత్యగరిమయటుండనిచ్చి, సురుచిరలక్షణభరితాశుకవిత్వపాండిత్యగరిమ యటుండనిచ్చి॥ గీ॥ ఆశుపఠనంబటుంచుఁ గొండాడఁదగిన, తావకాశుకవిత్వంపుఁ జేవఁగూడఁ, దావకశతావధానవిధంబుఁ గూడఁ, జూడఁదలఁచితి వేంకటసుబ్బారాయ! చ॥ తిరుపతివేంకటేశ్వరసుధీవర శిష్యుఁడ నాదుపేరు వేలూరి శివరామశాస్త్రి యని లోకము వాకొను నాఢ్యమైన వ్యాకరణముజీవనమ్ము నధికారము కావ్యపురాణనాటకా, కరములఁ; జేయఁజాలుదు నఖండమునాఁగ శతావధానమున్॥

గుంటూరు
31-8-11

ఇట్లు వినీతవశంవదుఁడు,
వేలూరి శివరామశాస్త్రి,
శతావధాని.

---

* మహారాజశ్రీ కొప్పరపు సుబ్బరాయశర్మగారికి—సీ॥ అఱవదేశంబున నవధానమొనరించు, టో కాదకి యిదియు గుంటూరుసీమ, పల్నాటిసీమలోఁ బద్యంబులను జెప్పు, టో కాద! యిదియు గుంటూరుసీమ. ఆయూరనాయూర నాశుకవితసెప్పు - టో కావ! యిదియు గుంటూరుసీమ, గుడివాడసీమలోఁ గొన్నియూళ్లనుజెప్పు - టో కాద! యిదియు గుంటూరుసీమ, గీ॥ యొల్లుదక్రించు కొందరో యిపుడుమీరు, నిండుకొల్వున మీకున్న దండిబిరుదు, లూరకేపోదు పూజ్యులఁ గాములఱవ, నాశుకవిసింహ కుండిన హంసలార. ఉ॥ బట్టులరీతిఁ బద్యములఁ బల్కెటె కాని శతావధానమె, వ్వట్టుల నేదిచేసితిరి, పండితులెల్లరు మెచ్చి...ర లో, గుట్టుగఁ బోవకీగతిని, గొంటెతనంబును జేయఁజూతురే, "పెట్టులుక్రొత్తవింజువయి, బీఁకముఁ జూపిన" లాగుఁదోఁపదో. గీ॥ జగతివైదికులౌట మీసాంచెసి, కొన్న నెవ్వరునవ్వరు; నిన్న నవ్వ, కుందురేకన్న వారు నియోగివర్యు మీసములఁగాచు కోలేక మిడుకుచుంద. క॥ గంటలఁ గట్టెదరే! ము, ...ంటితురగములకు హాలికవితానంబీ, గంటలు మఱియే కార్యము, పొంటె...చింపుండు కొ

ఉ॥ వారలకన్నఁ దెల్గునెడ వారక సంస్కృతమందుఁగూడ నీ
వారయఁ బెద్దపండితుఁడ వైనను వారలు బ్రాహ్మణుల్ మహా
శూరులు మేల్నియోగులును "శూద్రుఁడ వీ" వని యీసడింతు రి
వేరమునందుఁ గా లిడక వేగమ యేగుమ యంగలూరికిన్.

తే॥ గీ॥ వారితప్పడుభారను వడిగఁ బోయి, సభ్యులగరంప నీకు నసాధ్య మెవ్వ
డేని పనివడ్డచో మేమె యేగ వలయుఁ, బిదపనిదితప్పటంచు నొప్పింపవలయు.

చ॥ అనుటయుఁ బిన్ననవ్వు నగి యాతఁడు "చిత్ర" మటంచు నేగి యే
మని మది నెంచెనో? తుదకు నాతనిపద్దెము లచ్చులోనికిన్
జనుటయ కాక, కొప్పరపుసన్నిధికిం జనె వీని నెల్ల మే
మనిపినవే యటంచును యథార్థ మెఱుంగనివారు దూఱఁగన్,

ఉ॥ ఉన్నయథార్థ మియ్యది మహోత్తము లొప్పుదు రంచు మేము సం
పన్నగృహస్థులం దనుప వ్రాసితి మింకొకకుట్రశిష్యుఁడున్

---

ప్రపుంగవులారా. సీ॥ శతఘంటకవనంబునల్పుదు మన్న మీ- శక్తియడంప నేఁ జాలనొక్కొ, అష్టావధానంబు నాచరింతుమనమీ - శక్తియడంప నేఁ జాలనొక్కొ, ఆశుకవిత్వంబు నాచరింతుమనమీ - శక్తియడంప నేఁ జాలనొక్కొ, సద్గ్రంథరచనంబు జరపుదుమన్నమీ - శక్తియడంప నేఁ జాలనొక్కొ, గీ॥ ఇంగిలీషున వత్తురో యెఱిఁగియడపఁ - గరము నేఁ జాలనొక్కొ మాగురువు లేల, రంతు వేగమీబిరుదులు రెండు పెట్టి - పొందు నిండుసభను గొప్రపుఁ గవులార. గీ॥ ఓడినారని తలపోయువాఁడమీరు - నాకుఁ బ్రత్యుత్తరంబును నీక మౌన, ముద్రవహియింతురేని నీముచ్చటెఱిఁగి - ముందుపనిఁ జూడుఁడీ కొప్రపుఁగవులార. క॥ శివరామశాస్త్రిఁబోలెన్ । జవాబునొసఁగకయె వ్యర్థగ జంపునడిపినన్, వ్యవసాయము కలదు సుమ్మీ । వ్యవధిం గయికొనక యిండు ప్రత్యుత్తరమున్,

అంగలూరు,
3–9–191

ఇట్లు, బుధజనవిధేయుఁడు,
త్రిపురనేని రామస్వామి.

గ్రన్నన్ *గొన్ని పద్యములు గానుక గొప్పవారి కంపె నా
చిన్నతఁ జొక్క సాహసము చేసె వచింతుము తత్స్వరూపమున్. ౧౩౭

ఉ॥ బందరునుండి పద్యములు వారికిఁ బోస్టున బంపి మీఁద మా
కందఁగఁ జేసె దానిప్రతి; యక్కట! యాఁగుట యెట్టు? లిట్టులే

---

బందరు.

శ్రీమద్గురవే నమః.

(ఇయ్యది కొప్పవరపువారికి వ్రాసినయుత్తరమునకు సరియైన నకలు.)

*1. చ॥ ఉరుకరుణాయుతుండు, సమయోచిత ధీమహితుండు, భక్తులం, దతికిని గల్పకద్రుమవిధంబున నుండెడువాఁడు నట్టియా, తిరుపతివెంకటేశ్వరుఁడు తిన్ననిచూపుల మిమ్ముఁ జూచి యె, ల్లరును ముదంబు నొందునటులన్ దయ, మీకు జయమ్మొసఁగూర్చుతన్. 2. చ॥ ఉరుతరధీవిశేష మహితోన్నతులార! గుణాఢ్యులార! కొ, ప్పరపుకవీంద్రులార! వినవచ్చెను మీదు ప్రతిజ్ఞ; యెంతొ నం, బరము వహించి నాఁడను, రమాపతి మీకు జయంబు నిచ్చు, నా, తిరుపతివేంకటేశుల నెదిర్చి గ్రహింపుఁడు వారిమీసముల్. 3. చ॥ ధనము గడించియుంటి రవధానములం బొనరించి మీరలిం, దనుక శతావధాన లసనామముతో; నికమీఁద నట్లు కా, దనుచు శతావధానములనక్కడనక్కడఁ జేసిపండితుల్, వినుతియొనర్పఁ బసములఁ బెంకుఁడు నూతననామధాములై. 4. గీ॥ తెలుఁగు తిర్పతివెంకటేశులకుఁ గూడ, వచ్చుఁ గావున నోడింప భారమగును, గాని వారికి నేత్రావధానమందుఁ, బ్రజ్ఞ లే దందుమీరు గెల్వంగలారు. 5. క॥ నేత్రావధానమది స; ర్వత్ర జయంబిచ్చు మీకు, వదలక దానిన్, మాత్రమె పట్టిన నప్పుడు, శత్రులనోడింప మీకు సాధ్యంబగునే. 6. చ॥ వినుతగుణాఢ్యులార! యొకనిన్నపమున్ వినుఁడయ్య "గ్రుడ్డు పిల్లను గని వెక్కిరించినటులన్" గనుపట్టెను వీరియుత్త" రం, చు పిటజనుల్ వచించి రది యెంతయు నామది నమ్మఁబోవనే, మనిన నియోగిసాటిఁ దగవారి యది నమ్మమిముందవ్వజించుటల్. 7. మ॥ "సభమీరెవ్వటఁ జేయువార" లని ప్రశ్నన్ వేసిరవ్వారు, మీరుభయుల్ మాపురికేగుదెంచియిట సభ్యుల్ మిమ్ముఁ గీర్తింపఁగా, సభ నేయింపుఁడు, తోఁచినంత నఱకున్ సాహాయ్యమున్ జేతు నా. కభిమానంబది మీయెడం గలదు రండామోదముం బొందుచున్. 8. ఉ॥ "ఆరయ నీవు చేసెడిసహాయ మదెట్టిది? పిల్లవాఁడ" వం, చూరక నెంచఁబోకుఁడు మహోదధి వారిని బంధనంబు చే, కూఁడఁగ

కొందఱు *సూర్ఖులు శిష్యు లొకకొన్నిటి నంపిరి, మే మెఱింగిన
ట్లందఱు గాక యున్న జను లందఱు గొందఱు మాన్ప నేర్తుమే ౧౩౩

చ॥ "తిరుపతివెంకటేశులకుఁ దివ్యముగా సభ కేగుదెం డటం
చలిమిటి వ్రాసి కొప్పరపుటాయన దా సభ కేగుదెంచెనే?
"పరపర" వ్రాసి రమ్మనినఁ, బాఱుద మం చలసూర్ఖులుఁ గుఱ్ఱ లెం
చిరి యని తోఁచుఁ జర్చఁ దగఁ జేసిన యోగ్యుల కెల్ల నిప్పుడుల్. ౧౩౪

---

రాముఁడయ్యెడవిఁ గోతులసాయముగోరలేదె? సు, శ్రీగ్రహించి మీరు దయచేసి జయంబు వహించుఁడో బుధుల్. 9. క॥ తప్పక దయచేయుఁడు మీ. రిప్పరికి జవాబుదీని కిడుఁడు సరగునన్। మెప్పుగనుఁడయ్య వైశమ? కొప్పరపు కవీంద్రులార! గుణమణులారా!

ఇట్లు
సుకవిపాదరేణువు,
వడ్లమన్నాటి నరసింహశర్మ.
VIth Form C. Division,
Noble College,
Masulipatam.

---

శ్రీమత్పరదేవతాయై నమః.

11-9-11 బందరు.

*గురువర్యా! చ॥ మనమున భక్తినిల్పెదను మాధవపాద సరోజ యుగ్మచిం తనపరిలబ్ధదివ్యకవితా వనితా మహితప్రభావ సం । జనితలసద్యశః కుసుమ-జాలవినిర్మితహార ధారుసై । తన రెడు వేంకటేశ్వరబుధాగ్రణి? మీపదపాద కంజముల్ ఉ॥ ఇందులనుంచు పద్యముల నేనెరచించియు నచ్చువేయుఁగా, సందియ మొందుగల్గితమసన్నిధి కంపితి వానిఁజూచి నా,కుందయ వ్రాయవేఁడెదను గొంకక యెట్టులు నేయుమందురో? యందులనుండుదోషములనన్నియు దిద్దుచు నంపవేఁడెదన్ మ॥ తమసందర్శన మెప్పుడబ్బునని చింతాక్రాంతచిత్తుండనై,కుముదంబుల్ శశిఁగోరుభంగిఁదమవాక్సూనామృతాన్వేషసంభ్రమమే పారనెసంగువాఁడనిటఁ

క॥ ఎటు దోఁచిన సరియే మే, మిట లేశమెఱుంగ మెఱిఁగియే మెవ్వరి నాఁ
గుటకు యతించితిమో? వి, స్ఫుటముగ ఘనుసమున్న దానిఁ జూపితిమిక దా.

చ॥ చరితము గాన వ్రాయఁ దగుసంగతి వ్రాసితి మంతె కాని యే
ఱుఁగరు మేము కొప్రమున కిట్టులు శిష్యుల రేఁపి పంపుసం
బరమున కొప్పవారమె? స్వబాహుబలమ్మునఁ బోవువారమో?
యరులు నిజం బెఱింగియును నాడఁగఁ జూచ్చిరి వేఱురీతిగన్, ౧౩౬

చ॥ ఎఱిఁగినదేకదా? జగతి యెల్లఁ గుశిష్యుల రామకృష్ణులన్
మఱి యలయిర్వరందునొక మానిసి కన్న బహుశ్రుతుఁడు కొ
ప్పరమున వారి కంపెనొకపత్రిక *"నేత్రవధాన మందు వ
త్తురె,, యని రామకృష్ణు లటుదూఁకఁగఁజేసి రనంగఁ జెల్లునే॥ ౧౩౭

---

రాగ్రేసర స్తుత్యని,త్యము లేఖార్థమ చూచువాఁడఁగ్రవతోనంపంగఁ బ్రార్థించెదన్
చిత్తగించవలెను ఇట్లు తమశిష్యుఁడు

కోకా రాజారావు, హైస్కూలు, బందరు.

మ॥ రా॥ రా॥ శ్రీ. కొప్పరపు సుబ్బారాయశర్మ గారికి...మ॥ధరణీచక్రము గూలఁగా వలదె! సప్తాంభోధి భాస్వద్వసుం,ధరభారంబు వహించి మించునలమాతంగంబులున్ వీడి; కొప్పరపుంబండితమానులార? తమకున్ భాషాద్వయీ కావ్యనం,భరితుల్ తిర్పతివేంకటేశ్వరులతో వాదంబు శ్రేయంబొకో,,మ॥కరిశార్దూలమృగేంద్రసత్తములు గంగాభంగకల్లోలలీ, లవిజృంభించి పెనంగుచుండఁ గవిమార్జాలాదిసంపూజ్యలీ,రవధానంబు రచింపబూనితిర హా? హాస్యంబె యార్యోక్తియున్ 'శివుఁడుం దాండవమాడనాడ వెపిశాచీభూత భేతాళముల్...ఉ॥ చెప్పిన మాట చెప్పకయె చెప్పఁగ నేర్తుఁగవిత్వధారగా, నొప్పిదమౌవిధంబున బుధోత్తములందఱు మెచ్చనీరమున్,దప్పిక ద్రావుభంగి వచనంబున గెల్వఁగరండు నన్న మీ?,కొప్పరపుంవీశ్వరులకుందగదే మొకొ? నాప్రతిజ్ఞయున్......"

---

## *విద్యాచర్చాపత్రిక.

"అయ్యా? తమకును బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరమహాకవులకును, ఒకమానమునుండి జరుగుచున్న కవితా కలహంబును పత్రికాముఖంబున వింటిని

చ॥ పనిగొని రామకృష్ణులు "నెఱాసుఁ బకీరియని, కొప్పరంపువా
రొనరుచుతప్పు లన్నిటిని నొవ్వలు గాఁ దలపోయఁ జేరెఁ బిం
గని! దలవారిబంధు వను కారణ మొకట్టఁడె చూచి యట్లనన్
జనునె! యశక్తి దుర్జనత సర్వ విసృష్ట మహాప్రభంగులన్॥ ౧౩౮

క॥ ఇది యిట్టులుండె సమ్ముదన్ బదిబది, యాసీమ సుస్రాహ్మజ్ఞులు ప్రాజ్ఞా
స్పదులుగ నవధానాదుల్, బొదలించుచునుండి రపుడు పురపురఁ బొకటన్.

శా॥ ఆపైఁ గొప్రవక్షవారిపక్షమునవా రాలోచనల్ సేసి రిం
కీపై నెయ్యది కార్యమీ పురమునందే వారికిన్ సారెకున్
బ్రాపై గౌరవ మిట్టు లౌనె? యిది మెప్పాటన్ సహింపంగ నాఁ
గోపం బూనుటయే యనుగ్రహముగాఁ గూర్చుండి రవ్వారిటన్. ౧౩౯

సీ॥ చుట్టుపట్టులనుండి చూడ వచ్చినవారిసంఖ్య వందలకన్నఁ జాలహెచ్చు
వచ్చి "మాయూరికి విచ్చేయుఁ,, డనువారిసంఖ్య యేఁబదికన్నఁ జాలహెచ్చు
"రాఁజాల,,మన్నఁ "దీగదురాక, యనువారిసంఖ్య యిర్వదికన్నఁ జాలహెచ్చు
ఏమాట వినిచిన నింపునై వినువారిసంఖ్య యో! వేలకుఁ జాలహెచ్చు
తే॥ గీ॥ పద్ధతినియోగులం దెరో పట్టుదలకుఁ, నేగకున్నను నెల్లవారేగి వారి
చుట్టునుం గూరుచుం డిది చూచు టెట్లు, త్రిమతములు వారిపక్షమై తిరిగిపోయె
శా॥ * ద్వైతాద్వైత మొకండు దక్క నఖిలద్వైతంబు నద్వైతమున్
శైవంబున్ మఱి వైష్ణవంబు నొకటై ఛత్రంబుగా వారలన్

---

...సర్వసాధారణమైన యాశుకవితకేమి? తమకు నేత్రావధానంబున నెన్ని బిరుదములున్నవో... వానిని మీకంటె నతిశయించి కాకరపర్తి విద్వత్సభలో ది 20 సెప్టెంబరు 1911సం॥ రం తేదిని తత్తదంశంబులనెల్ల వెల్లియాడఁ జెలుకుచున్నాను గనుక నీనోటీసు అందిన వెంటనే ప్రతిజ్ఞా విశేషంబును గనుపఱచి నాతో జనకుఁ గాఁకరపర్తిమీఁదు రాఁగోరెదను "శ్రేష్ఠచో మితోవిద్యాచర్చలకు రాఁజాలను,, అని నాకొక జాబైనను వ్రాయఁగోరెదను....

ది 14—9—1911 సామవేదుల సూర్యనారాయణావధాని
నేత్రావధాని,అండష్టావధాని,మాకాంకాకరపఱ్ఱు అగ్రహారం, తణుకుతాలూకా

*ద్వైతాద్వైతము.

☞ వరా:—అనఁగా? నిది యొకనవీనమతము, దీనికే పద్ధతినియో

బావుంబంతులపోల్కిఁ జూచెదరు· రేపు స్వాప్ను నవ్వారితోఁ
బోరివై యుండకుఁ బుకంబు వారివచనంబుల్ వేదముల్ వీరికిన్. ౧౪౨

చ॥ ఇతరులమాట కేమి? మది నించుక గోపము కల్గి యున్న నా
కుతుకముగూడ వారసినఁ గొంతొకపర్వులు వాలు వారివా
క్ప్రతతి విసం గుతూహల మపారము గల్గియుఁ బోను వారిపెం
కెతనము నాకు నచ్చమియె కేవలమింతకు మూల మెన్నెయిన్. ౧౪౩

ఉ॥ "పెంకెలు గారు సాధువులు పేర్మికి నిక్కలు గర్వదూరు,, లం
చంకిలి లేక చెప్పికొనునట్టిగుణుం గల రల్లవార్; ప
శ్చంకగ వారు వారికటు చల్లఁగఁ దోఁచుటయు న్నిజంబె యే
వంకమెయ యత్రదాతులకు వారు రుచింపరు వేయునేటికిన్. ౧౪౪

ఉ॥ పాండితి లేని యీమనము పాండితిపట్టున వారి గెల్వ లే
మెండొక త్రోవఁ జూడవలె "హుమ్మను" వారిది మాపఁగా వలెన్
గండతనం బడంచుటకుఁ గాఁ గబురంపితిఁ గాని పెల్లపుం
గొండకవీఁద్రుఁ డేమిటికిఁ గొంకెను? "రా,, నని యుత్తరం బిడెన్, ౧౪౫

తే॥ గీ॥ తిరి కూర్చుండి పెట్టి రీవైర మనుచు, నతఁడుకొండొకనిరసించినట్లువినికి
యితరులకు నట్లైతోఁచుఁగాకిది యునట్టి, దెట్టులగు? నాసనముసేయ రేమిమనకు.

ఉ॥ పండితపామరుల్ గలిసి వారలకే హితు లైరి వారలన్
గండడఁగించు టెట్లు? మనకక్ష జయించుట యెట్లు? తోఁచ దొ
కణ్డు నుపాయ మంచుఁ దనగాదిలిపద్ధతివారితోడఁ గొ
ల్వుండి విచారణల్ సలుప నొండొకనేర్పరి పల్కె నీగతిన్ ౧౪౬

గమనియుం బేరు, ఇది సదుద్దేశముతోడనే శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితు
లవారు పుట్టించిరి, వైదిక లనుపలనియుఁ దాము దేవతలమనియు వారిసిద్ధాంత
ము, ఆయీయంశము, ద్వైతాద్వైత పదమే తెల్పెడిని, సుప్రసిద్ధాద్వైతము వీరికి
నసురాద్వైతము, విస్తరము వారివిశ్వపత్యసురవిజయము లోనగు గ్రంథము
లవలన నెఱుఁగఁదగు. ప్రకృతకలహమునకుఁ గారకు లేతన్మతావలంబులలో
స్వల్పసంఖ్యాకు లని చదువరు లరయుదురుగాక.

చ॥ అవమానం బడి యెంత గావలయునో యానర్వ మవార్వరికిం
జవిఁ జూపెన్ మనకొప్పరంపుఁగవి "మీనాల్కాటి సామాన్యమే?
యెవ రెచ్చో నలవారి నిట్లనఁ గలారే? యంతియే చాలు న
న్యవిచారం బిఁక నేలని నా కొకఁ యుపాయం బిందుఁ గన్పట్టెడిన్. ౧౪౭

మ॥ అవివేకంబో వివేకమో జరిగె నేలా "సంధి మిచ్ఛంతి సా
ధవ,, యన్ వాక్యముఁ బట్టి పోవుదము విద్వత్తాకవిత్వాభిజా
త్య విశేషమ్ములఁ జేసి యిందులకు వారంగీకృతిం జూప రం
చు విచారింపకుఁ డట్లు కావుటకె యీచో పూర్వహ్యా మెబ్భంగులన్. ౧౪౮

క॥ కొలుకంగ రానికొయ్యలు, తిరుపతివెంకటకవు లని తెల్లము సేయన్
బరికించితి నదుపాయము, గర మాలోచించి దీని గ్రహియింపుఁ డనన్. ౧౪౯

తే॥ గీ॥ వృద్ధుఁడిట్లను "బాగు నీవెఱవు; దీనఁ, గలదు కష్ట మొకండు లోకమునఁ
గొప్పరంపువారలసారులు గ్రామ్యకవులు, వారనేతాదృశు లటంచుఁ బేరుగలదు

తే॥ గీ॥ అట్టిచో సంధియనుటకు నర్థమేమి, యగునని పరికింపుఁ డదియసమర్థతకును
నపరపర్యాయమగు 'ననన తఁడువలుక-, 'నగునుమీరన్న నుడియు నేనరసినాఁడ.

గీ॥ కానియిపుడింతకన్నఁ జక్కని యుపాయ, మొండు గన రాదు సభ సేయకుండ వారి
నిత్పరమునుండి పంపుటకింక నొక్క,-సాధనం బేది? యానతి సల్పుఁడనుడు

తే॥ గీ॥ కొంత యోజించి యావృద్ధుకొసకు సమ్మ,తించి రాజీకిఁదగునట్టి మంచిమాట
లెల్ల వ్రాయించి వ్రాళ్లు చేయించుటకును, బెద్దలగువారి మొద్దికఁ బంపించుటయును.

ఆ॥ వె॥ ఈనడించువార "లిహిహీ" యనెడువారు, పెదవి విఱుచువారు "మొదలలేని
శాంతి యిప్పుడేల చాలావఁ బొందు పొం" డనెడువారు నైన మనసుపిటిగి

క॥ చనికడచినవృత్తాంత, మ్మును వృద్ధునితోడఁ జెప్ప నూగ మించుకనై
వనటం బడి తెప్పిఱి యే, మిని వోఁచక యుండె నపరిమితయోజనతో.

తే॥ గీ॥ "నే నిదురఁ గంటిలో వ్రేలు నీవు నాదు, నోట వేసిలిడు" మన్నట్టు "లేటికిట్టి
సంధి" యని యెల్లరాడునాచందమేను, మొదటఁ దెలిసియుఁ బంపితి మోసపోతి.

క॥ అని కొంతసేపు తన చే, సినయపలౌకికపుఁబనికిఁ జేతమ్మున నై
కిట్టన సిగ్గుకల్మిఁ జింతం, గొనుచు నుపాయాంతరములకుం గడఁగు నెడన్.

చ॥ మఱియొకఁ డిట్లుపల్కె "మఱిమాట వచింపకుఁ డింతకన్న నెం
డరయఁగ రాదుపాయ మొకరైదుగురేనియుఁ జాలు వాళ్ల కం
దఱు నొనరించినంత విలువై చెలువారెడు నంతపాగగా
దారక వలెన్ సరాసరిగఁ దూఁగెడువారుగ నుండఁగా వలెన్. ౧౫౪

తే॥ గీ॥ శాఖ కొక్కొక్కరుండు గాఁ జర్చ చేసి, యేర్ప్రాట్లు చేయించితిమేనిఁ జాలు
సంధి కన్నప్పుడేమని సమ్మతింప, రరయరే? "సంధిమిచ్ఛంతి" యన్న నొడువు.

సీ॥ ద్వైతులకెల్ల నాతనిచేతఁ జేయింత మద్వైతులకు నెల్ల నతనిచేత
నతనిచేఁ జేయింత మలవిశిష్టాద్వైతశాఖకెల్ల నతండు చాలువాఁడు
ఇంక ద్వైతాద్వైత మిందుఁ జేసెడివార లెందఱేనియుఁ గల రెంచ నేల
శుక్లయజుశ్శాఖ సుముఖులకెల్ల నయ్యనఘుచేఁ జేయింత మతఁడె చాలు
గీ॥ తప్పెవరిదేనియగుఁగాక తగు మనుష్యు,లిరువురకు సంధి గూర్చుచో నేమిపోనఁగు
పైకి నటియింతమిట్లు చేర్పాళ్ళు దొరకు, వఱకుఁ బిమ్మట మనయిచ్చ నుఱుకవచ్చు,

ఆ॥ వె॥ సంధి కొప్పిరేని "చాల లే" కందము, సమ్మతింపరేని "శాంతిదూరు
లంద మవల; దీనియట్టియుపాయమ్ము, మనకుఁ గానరాదు మఱియొకండు

క॥ చెఱియొకటిగఁ బంపినఁ గొ, ప్పరమునకున్ లాఘవంబు పైఁ బడ దెవరో
యొఱఁగిన వా రెట్టాడిన, నరయరు,దూరగులు యోగ్యు లందురు మనలన్।

తే॥ గీ॥ ఒకరొకరికి నెప్పట్ల నోడువారు, కారు తుల్యులు కయ్యమ్ము గలిగినప్పు
డేరి నేరు జయింతురో? యింతలోన, సంధి చేసిరి పైవారు శాంతి గోరి, ౧౫౯

క॥ అనుప్రథ గల్గిన మనకున్, ఘనతయె మనకక్షుల కింతకన్నను గొప్పం
గొని తేఁగలమే? మును పా, సన మేనియుఁ గోరు టీయశమ్మునకె కదా.

తే॥ గీ॥ ఆసనం బిడ నందుల కల్లవారి, మీసములు బీఁకుట మటన్న బాస చాలు
నిపుడు మనపన్ను గడఫలియించెనేని, "కోటలోఁ బాగవేయుఁబో? కొప్పరంబు

క॥ అనునతని మాటచొప్పున, ఘనుఁ డావృద్ధుండు నలుపఁగా నెంచియు వా
ళ్లను మాలింపమిఁ గొండొక, దనుకన్ మాకడకుఁ గాగితము రా దయ్యెన్

గీ॥ అంత బ్రాహ్మణకోడూరియగ్రజన్ము, లెల్లమమ్ము నాహ్వానించి యెలమినొక్క
సభను గావించి మేటియుత్సవ మొనర్చి, గౌరవించిరి వైరులు కళవళింప,

# బ్రాహ్మణకోడూరు శతావధానము.

సుగుణకలితకవితావనితానేతలును సురుచిరాలంకారవిధాతలును విలసితపాకశ్రోతలు నఖిలార్థదాతలు నగు శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల యవధానవిధానంబులం జరికించి యానందించి యీజంట సత్కరింపవలయు ననుతలంపున గుంటూరుమండలమందలి బాపట్లతాలూకాలోని బ్రాహ్మణకోడూరు నివాసులం దేకగ్రీవముగ నిర్ణయించికొని తద్గ్రామంబునకు నాకలంబిలువనంపిరి. కడచిన శనివారము 9-9-11 న వారలను, శ్రీమన్మహత్వశాస్త్రసంపన్నులును బాలసరస్వతీ బిరుదాంచితులును, లలితగతి శతావధానధురీణులు నుభయభాషాకవితాధురంధరులు నయిన శ్రీకాశీ కృష్ణాచార్యుల వారిని దద్గ్రామంబున కాపురజనులు రావించి గ్రామోపకంఠంబుననే యీత్రిమూర్తుల శిబికాసుఖాసీనులం గావించి నానావిధ హృద్యవాద్యంబుగ నూరేగించి బ్రహ్మశ్రీ పెరవలి పార్వతీశ్వర శాస్త్రులవారి భవనంబున విడియించి యుచిత సత్కారంబులు సలిపి సగౌరవంబుగ నాఁటికి వీడ్కొనిరి. అయ్యెడ నీక్రిందిపద్యముల నొక బాలుఁడు చదివెను.

ఉ॥ స్వాగతమయ్య! మీకు విలసత్కమనీయ యశస్సుధారస
శ్రీగురుతావిభూషిత విశేషనభోంతరరమ్యదీధితుల్
సాగరకన్యకాఘనకుచస్థలచందనచర్చితప్రభా
భ్యాగమరమ్యదేహు లగునార్యులు తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ॥ స్వాగతమయ్య సత్కవిహృదంతరదంతురితప్రభావసం
ధ్యాగమతర్పితాఖిలజనాహ్వచకోరులు దర్పవద్విరో
ధ్యాగతహుంకృతిస్ఫురదహంయులు నిస్తులితోరుశక్తి సం
భాగరిమావధానకృతిదాతలు తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ॥ స్వాగతమయ్య మీకు రచనాతిశయాన్వితకావ్య సద్యశో
భాగ విశేషవేష్టితవిభాస్వరలోకులు గౌరవప్రథా
సాగరమజ్జదుత్తమవిశాలయశస్కరిపుప్రభావు లం
హోగరిమ ప్రణాశన మహోయుత తిర్పతివేంకటేశ్వరుల్

ఇట్టియుత్సవంబునకు సుగుణ సంపత్తి గలపౌరులయుత్సాహము నైకమత్యమును సాగణములు, అప్పటి కాపులుం గరణాలు" వీరగ్రజన్ములు వీరలితరులంచు భేదభావంబుంచికొనక యెల్లరు సోదరుల భంగిఁ జెలంగి మెలంగుటం జూడ నేరికేని వింత పుట్టింపకమానదుఆహా! యైకమత్యమున్ననిదియకదా? యైకమత్యము, ఇట్టియైకమత్యముకదా భరత ఖండవాసుల నుద్ధరింపఁ గలదు మఱియు నీవర పౌరులు నలుగడలనుండియుఁ దత్ప్రజ్ఞాదర్శనంబునకై గౌరవనీయులగు మఱికొందఱఁ బెద్దలరావించి వారల నుచితవిధుల మన్నించిరి. వీరల సౌజన్యము శక్తి, సామర్థ్యము, నిష్కల్మషహృదయతయు, నెంతయు శ్లాఘనీయములు.

మఱునాడు 10-9-11ఆదివారంబున నవధాన సభ నేయ నిశ్చయింపఁబడియె, ఆనాఁడు భోజనానంతరము రెండుగంటలకు శ్రీనాగమల్లేశ్వరాలయపురోభాగంబున స్థాపింపఁబడిన నారికేళస్తంభవిలసితంబై పత్రతోరణంబులరాజిల్లు తాళదళంపుఁ బందిట సభకూర్పఁబడియె, అందు నానాగ్రామ సమాగతవిబుధవరులను గూడియుండిరి. నాఁటిసభ కగ్రాసనాధిపత్యము వహింప శ్రీకాశీకృష్ణాచార్యులవారు ప్రార్థింపఁబడిరి పిమ్మట వారియాధిపత్యము క్రింద నాసభయును ఖండుగఁ బ్రారంభమాయెను. అవధానంబును ముగిసె అంతటఁ దద్గ్రామవాసులు నితరులును జక్కని మృదుమధురశైలిఁ గొన్ని పద్దెంబుల, శ్లోకంబుల, రచించి యవధానుల నర్పించిరి. తదనంతరము సభ చాలింపంబడియె.

ఉ॥ రంగారావు, బి, ఏ., డిస్ట్రిక్టుకోర్టు వకీలు.

---

(అవధానప్రారంభపద్యములు.)

చ॥ "వయసుగతించుచున్నదిఁక వల్దవధానము,, లంచు మేము త
ద్దయు బతిమాలి యేటికి నవధానములన్ సమకూర్చెదన్న "నా
దయ కొకఁడున్నె వారకము తాత!,, యటంచు వచించెదేమొ య
ట్లయిన "తథాస్తు" నీయభిమతార్థమె తీర్చెదమమ్మ శాంకరీ॥ తి॥శా॥

శా॥ ఊరేగించుటె కాక మాయెడల మీయూరెల్లఁ జూపించు వి
స్తారోదారపుగౌరవమ్మునకు నేచాయన్ బ్రతీకారమొ
ప్పారన్ జేయఁగ నేర్తు మేము; కనవద్యాహారముల్ గొన్ని శ్రీ
వారిం గొల్చి గడించుకొన్న వెటులో వాక్సుత్తు మాలింపుఁడీ॥ వెం॥శా॥

(అవధాన పద్యములనుండి 2 మాత్రము)

(బ్రాహ్మణకోడూరు)

మ॥ గణనీయుల్ ద్విజు లల్లరాజులు యశస్సాంద్రముల్ కిరాటుల్ లస
ద్గుణగంభీరులు కమ్మవారు తనరన్ దోరమ్ముగా ధాన్యపుం
గణముల్ గొట్లుగఁ బుట్లు పండఁగల భాగ్యంబెందుఁ బెంపారు బ్రా
హ్మణకోడూరుపురంబు చెన్నలరు లక్ష్మీవాసమై వాసిమై. 5

ఆంగ్లేయులప్రభుత్వము.

శా॥ పాఱంజొచ్చె నృశంసవర్గములు, దైవారంగ నీరెల్లచోఁ
బాఱంజొచ్చె సమస్తమానవులకున్ బల్ సౌఖ్యసంపత్తి పెం
పారన్ జొచ్చె సితాన్యరాజ్యమున "నాహా! యిట్టి రాజుల్ ముదం
బారన్ వర్ధిలఁగావలెన్ మనకు విద్యాసంపదల్ గావలెన్. 23॥

అవధానాంతమున నితరులు చెప్పిన పద్యములనుండి కొన్ని.

మ॥ సకలాంధ్రావనిపాలకోత్తమ సభాస్థానమ్ములన్ సత్కవి
ప్రకరమ్ముల్ దలలూఁచి మెచ్చఁగఁ గవిత్వస్ఫూర్తినైకావధా
నకళోద్భూతజయేందిరా ప్రథితసన్మానమ్ములన్ గాంచుచున్
"శుకవీశేంద్రమృగేంద్రు"లన్ యశముఁ గైకొన్నారు వీరిద్దరున్. 3॥

శిష్టాహనుమచ్ఛాస్త్రి.

---

మ॥ కవితాకన్యనుఁ బెండ్లియాడియు మహాకళ్యాణముల్ పొందియున్
వివిధోపాయప్రధారణావనితనుం బెండ్లాడి తర్వాత నా
నవతుల్ గూడి యనన్యచిత్తలగుచున్ సంసక్తిసేవించ నా
రవితారం బగుకీర్తిఁ జెందుకవి సమ్రాట్తల్లజుల్ మీరెగా.

మొదలి నాగభూషణము.

---

సీ॥ ఎదిరిగాఁడు గుఁగన్న నీసడించెడిసాము లెవరికి ఛత్రమ్ము నెత్తువారొ
యొకరుగజంబెక్క నోర్వలేని మహీంద్రు లిభముపైనిడి యేరియుంపుగాంత్రో

కలనేన్నబురలచామరలఁ జూడ మనుదారక వీవన లెవరికి వేయువారొ
పైరాజులకైనఁ గప్పంబిడు టొప్పని యిను లెవ్వరికిఁ గానఁబడెడివారొ
తే॥ గీ॥ అమ్మహాత్ములు భారతీ హావభావ, విలసనము లెల్లయెడఁ జల్లి వెలయువారు
వీరె కనరయ్య! తిరుపతివేంకటేశ, కవులు కమలాంగనాఖర్వగర్వహరులు.
ఇట్లు సజ్జనవిధేయుఁడు తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి.

---

సీ॥ భువిలో ప్రసిద్ధమౌ భూసురాన్వయమందు నరుదారఁగా జన్మమందినారు
శైశవంబున నె శ్రీదేశిక సేవచే మించు విద్యల గ్రహియించినారు
శతవధానప్రవీణత రాజసభలందుఁ బలుమాఱు జయములఁ బడసినారు
వాణిగృహీతాది భాసురగ్రంథముల్ చేసి సత్కీర్తిని జెందినారు
తే॥ గీ॥ ఇట్టి సుగుణంబులను గల్గునట్టిమీరు, భవ్యతరకీర్తి నెన్నంగ వశమె మాకు
కీర్తికాంతానమాసక్త మూర్తులార: సరస తిరుపతి వెంకటేశకవులార.
తెలికపల్లి వీరరాఘవశాస్త్రి.

---

సీ॥ ప్రతివాదిజనభయ ప్రదమైన యస్మన్ముఖం బంతేవసత్స్వాళి కమృతమొనఁగు
సభ్యులకడ లిడఁజాలెడుయద్వాణి కబ్బంబులందు సౌఖ్యము ఘటించు
తథ్యాంశమన్న స్వతంత్రించు యద్ధాటి మిథ్యాంశమన్నఁ దామిన్నకుండు
త్రైలోక్యరంగనర్తకియైన యత్కీర్తి విబుధమనోగోష్ఠి నిమవకుండు
గీ॥ నట్టిరుకవీశితలును శతావధాన, ధారణాధోరణీ చిత్రితప్రముఖులు
నస్మదీయ గురూత్తములవని నాయు, వునుయశంబును గనుచుంటపొనరుఁగాత
సీ॥ ఆంధ్రదేశావస్థితాశేషభూమిభృత్కోటీరమణిఘృణిఁ గూడియాడి
కవితాకృతానేకగణనీయ పూర్వపుణ్యాతిశయంబులఁ జోతలంది
గోదావరీతీరకూలంకషామోఘపాండితీప్రథకు జీవంబు వోసి
కమనీయరచనాప్రకారకారణయశస్సీమంతినీలాన్యశేష మరసి
తే॥ సరససరసపుష్టి భావతత్సత్ప్రబంధ, బంధబంధురతతత్ప్రవిత్వప్రభావ
భావగంగాప్రవాహభాస్వత్తరంగ, రంగకలనయఖండచిత్రంబునొనఁగె
సరసతిరుపతి వెంకటేశకవులార.
సీ॥ అనాన్యదృశంబైనయశమును గర్హించుదోషజ్ఞబృందంబుఁ దూలనాడి
విషమపరీక్షావివేచనాప్రౌఢులౌ సంస్థానపతుల సంశయము దిద్ది
భిన్నభిన్నరుచిప్రభేదముల్ గల్గులోకుల నెల్ల నొకట మేకున బిగించి

# గుంటూరిసీమ, ఉత్తరరంగము.

అష్టావధానశతావధానామరభాషితపాండితీబలము నొసఁగి

గీ॥ అఖిలదిక్కుల జయవైజయంతి కాపి, జృంభణము మీకు ముందుఁగా నేసియుంచు
తమపురాకృతపుణ్యంబు దరమె పొగడ, సరస తిరుపతివేంకటేశకవులార!॥

అవ్వారి, సుబ్రహ్మణ్యశాస్త్రి

సీ॥ పట్టుమంచాక గీతపద్యముల్ వ్రాయరాదా! మేమి నోరు లేదాయెఁ గాని
ఆశుధారయటన్న ననలెమా చేతఁగాదా! యేమి ధార లేదాయెఁ గాని
అవధానతంత్రంబు లందు మాబుద్ధిపోదా! మేమి మేధ లేదాయెఁ గాని
వాఙ్ముఖమ్మున మాకు వక్రమించుక సాగదా! మేమి మాట రాదాయెఁ గాని
గీ॥ మాకు ననుకొను పండితుల్ మహిని నెందఱో కలరు గాని యీపేలు పోకలుట్టి
పడఁగ నవధాన మొనరించు వారు గలరె, ధరణిఁ దిరుపతివేంకటేశ్వరులు దక్క.

కాశీ, కృష్ణాచార్యులు, శతావధాని.

---

సీ॥ కన్నబిడ్డలవలెఁ గాపాడి విద్యల శిష్యాళి కెప్పుడు చెప్పుచుంద్రు
సాహితీగ్రంథముల్ చక్కఁగ బోధించి పండితులను జేసి ప్రబలుచుంద్రు
సారకవిత్వంపుసరణిని నేరిపి సద్గ్రంథములఁ జేయ సాకుచుంద్రు
ఆశుకవితధార నలవడఁగాఁ జేసి ఛాత్రులఁ గనుఁగొని సంతసింత్రు
గీ॥ పుడమి వీరికి సరియగు పురుషు లెవరు, నరుఁడు నారాయణుండు నుబరమకృపను
వరుసఁ దిరుపతి వేంకటేశ్వరులె యగుచు, జగతి జన్మించినారలు సత్యమిదియ.

నోరి, హనుమచ్ఛాస్త్రి.

---

క॥ నిక్కన నీల్గినఁ దమకిపు, డెక్కడి వారేని సామ్య మెవ యరునిక్కం
బిక్కరణి నేస్త్రవాయఁగ, నక్కఱ యేమే లేదు జగతి యంతయుఁ బలుకున్.

వలివేటి, వెంకటనరసింహము.

---

☞ దిఙ్మాత్రముదాహరించితిమి, తక్కినవి యచ్చయియున్న పుస్తకమునఁ జూడఁదగు దానివెల రు0—2—0 అణాలుమాత్రము.



క॥ పిదపఁ బిన పాడు లోనొక, సదస్సులె జరిగె నంత ఘాతుఁడొకఁడుగో
విదమయ మగు కాలేజీ, సదస్సులో శతవధాన చతురిమ నెఱపెన్. ౧౬౮

# శ్రీపినపాటిశతావధానము

ఆర్యులారా! జగత్ప్రసిద్ధులగు బ్ర॥ శ్రీ॥ తిరుపతి వేంకటేశ్వరకవులు గుంటూరు పురవాసులచే ప్రార్థితులయి అప్పట బ్ర॥ శ్రీ, కాశీ కృష్ణాచార్యుల వారి అగ్రాసనాధిపత్యమున అవధాన సభ జరిపి స్వకవితా సుధాసారముచే తద్గ్రామవాస్తవ్యులను సంతసపఱిచిరి, పిమ్మటవారిసమావేశమును జేసికొనదలఁచి మేము అతికుతూహలాయత్తచిత్తులమయి మాగ్రామమునకు దయచేయుఁడని వారిని(ముప్వరను)ప్రార్థింపవల్లెయనిరి 21-9-11 తేదీని సాయం సమయమున వారుదయచేసి మాచేనొనర్పఁబడిన వాహనాదియుత్సవముతోఁ గూడపురజనులు జయధ్వనులొనర్చుచుండ మాగ్రామము నలంకరించి భోజనానంతరమున కొంతతమకవితామృతముచే మమ్ములనానందిపఁజేసి నాఁటిరేయి సుఖముగఁబుచ్చిరి, మరువాఁడు అనగా 22-11-9పగలు మ॥ శ్రీ॥ కాశీకృష్ణాచార్యులుగారి యగ్రాసనాధిపత్యముక్రింద పగలు 3ఘంటలకు అవధాన సభప్రారంభింపఁబడియె నాఁటిదినంబున తెనాలిమున్నగుగ్రామముల లౌకిక వైదిక విద్వద్గణ్యులువిచ్చేసినసభనలంకరించిరి. మరునాడుసభబహుజనపూరితంబగుటంజేసి సమ్మర్దమెక్కుడుగలిగినందున 5ఘంటలకుమాత్రము 31 మందికి ఏకైకపాదక్రమంబున జెప్పి ఆమరునాడు సాయంసమయమున తక్కినది పూర్తి చేసి సభికులను శ్రవణానందము నొందచేసిరి. అవధానము సంపూర్తి చేయుటకు పట్టిన కాలము మొత్తము 8 ఘంటలలోపు అయియున్నది.

ఇట్లు విన్నవించువిధేయులు,

తెనాలితాలూకా

పినపాటిపురవాస్తవ్యులు.

---

(అవధానప్రారంభపద్యములు.)

ఉ॥ ఒక్కొకచోట నొక్కగతి నోజగదంబ! భవద్విలాస మ
మ్మక్క ఘటించు వస్తుచయమంతయు శక్తిమయంబు దానికిం
దక్కినవార లెందులకుఁ దా రసమర్థులటం చెఱింగి నే
నిక్కృతికిం గడంగెద నిహీని యనిపింపకుమమ్మ శాంకరీ. 1

ఉ॥ మానియుఁ జేయఁబూనిరని మాపయిఁ గోప మదేల నీకు, మా
పై నెన రూను ప్రేరకులపై ననురాగ మదేలని యొట్టులో

పూనితి మిష్ట పొమ్మనినఁబోదువె? "జోటశిరమ్ముఁ గ్రుక్కి జం
పూనఁ బనేమి రోఁకలి, కెటో నటియింపు శతావధానమా॥ 2॥ వెం॥ శా॥

మ॥ స్వయమేపారశతావధానకవితాసామ్రాజ్యమేలించి త
చ్ఛయశోమూలముగాఁగ, నీవగటివేషా లెన్ని నాళ్లింక, మా
పయి కేరే నరుదేర వారల నదల్పంజాలుధీశక్తి యి
చ్చి యెటో మన్పుట నీక భారమగు నీచిత్తంబు కామేశ్వరీ॥ 1॥ తి॥ శా॥

## అవధానపద్యములనుండికొన్ని.

### వైదికనియోగులకు సఖ్యమునుగూర్చి.

ఉ॥ ఎవ్వరు వైదికుల్? మఱియు నేరు నియోగులు? నొక్కవిప్రులే
చివ్వకు డీకొనన్ గలుఁగు చేటిఁక; దక్కిన జాతివారికిన్
నవ్వఁగ నందు గాదె! యటు నవ్వఁగఁ జేయుట ప్రాజ్ఞధర్మమే?
యెవ్వగనైన వీరిరువు రేకము గాఁ జరియించు టొప్పదే॥7॥

### బాసుగారిచట్టము.

మ॥ కలికిన్ గంటికిఁ బ్రీతిగొల్పునెడ వేడ్కన్ దేని నేనిన్ నరుం
డెలమిన్ గైకొనవచ్చు దానివయి నెందేఁ జేర్మె వో నప్పుడ
క్కలికిన్ వీడఁగవచ్చు నొండొకట భాగ్యంబున్న విశ్వస్తతోఁ
గలియన్ వచ్చును "బాసు,, చట్ట మురరీకారంబు గావించుచో॥15॥

### ఇప్పటివారి కవితా సంస్కారము.

శా॥ చారుశ్రీకములౌ నలంకృతులకున్ సన్మానము ల్దగ్గె శృం
గారంబెల్లను గారమయ్యె గుణముల్ ఖండంబులై పోయె సం
స్కారమ్మెల్ల నశించె భాషలకు దౌర్గత్యంబు ప్రాప్తించె సం
స్కారమ్ము ల్పొనరించువారికతనన్ సర్వంబు మాసెం జుఁడీ॥ 27॥

### పృచ్ఛకుఁ డిచ్చినవిషయము.

సీ॥ శాలివాహనుని దౌశకమునఁ బదుమూఁడువందలయేండ్లపైఁ బార్థివాఖ్య
వత్సరంబున మాఘబహుళచతుర్దశి శివరాత్రితిథి రాజశేఖరుండు
వీరనారాయణాభిఖ్య గల్గిన రెడ్డి శంకరమునికకలంక దాన

మహరఁగానగ్రహారము గాఁగ నొనఁగె నీ పినపాటిగ్రామంబు నుఁనఫు; నేఁడు
కారణంబెద్దియో గల్గి నేఁడి యయ్యెనైనను బంట లత్యధికముగను
తే॥గీ॥బండఁ జేసెడిహూణులప్రాభవమున, సిరియు సంపదయునుగల్గి చెలఁగుచుండె
నెల్ల కాలమ్ము నీరీతి నెసక మెసఁగ, వృద్ధిఁగాంచుత మీపినపాటియూరు ॥41॥

## సభ జరిగినచోటు.

సీ॥ ఎద్దానితూర్పున నెసకం బెసఁగుచుండు లీలమై మదరాసురైలురోడ్డు
ఎద్దాని వైశాల్య మెంచి కొల్పింతుమే నాలువందల గజాలై చెలంగు
ఎద్దాని దేహ మెంతే సొప్పఁ డేకు దూలములతోఁ డేకువాసములతోఁడ
ఎద్దానియంతరం బింపారు సత్క్రావిపటలిచే సద్గవీపటలిచేత
తే॥ గీ॥ పేరుగోష్ఠంబుగాని యేయూరనైన, మఱియుఁ బట్టణములనైన వఱల దిట్టి
"హాలు,, నాఁ జనునిద్దాని నాలకొఱకు, కొట్టకోటామగట్టించెఁ గుతుకమెసఁగ

## సమస్యాపూర్తి.

శా॥ కుంచాలన్ గొలిపించి యిచ్చితినిగా గుగ్గిళ్లకై యల్వలన్
గంచాలం దిడఁబోకు మన్న మిపుడెక్కన్ బోదు సంసారి "పా
వంచాలం డిగి దప్పిగొన్నవిరసుబ్బా! నీళ్లు వేవేగదె,,
(మ్నంచాలన్ బిగియించె గుంజలకు నమ్మా! బిందియన్ దేగదే?)॥ 62॥

## సమస్యాపూర్తిః.

శ్లో॥ నహి సంతతిస్తు నరకార్ణవాపహే, త్యతిదుఃఖి మాతృపితరం నిరీక్ష్య సా
తనయా దదౌ స్వతనయంతతస్త్వహో!(అనుజోబభూవ తనుజోఽపి యోషితః)

## అవధాన మొనరింపఁ జేసినవారు.

సీ॥ తూములూరికులాబ్ధిసోముండు విద్యాద్విధేయుండు కోటయ ధీరుఁ డొకఁడు
పినపాటి వంశాబ్ధివిధుఁడు శ్రీవీరభద్రయకవిత్వరసభ్రధానుఁ డొకఁడు
భళ్లమూడ్యన్వయవారాశిచంద్రుఁడౌ శ్రీరామనామకసూరి యొకఁడు
తూములూర్యన్వయేందుండు శ్రీసూర్య నారాయణాభిధకవి గేయుఁ డొకఁడు
తే॥గీ॥లక్ష్మీకాంత మొకండు సులక్షితుఁడయి, వఱలునన్నముభొట్లసువంశజుండు
వీరఘటియించి రవధానమారఁగఁబిన, పాటిసాంబశివాభిఖ్య భవ్యుఁడొకఁడు

అవధానాంతమున నితరులు చదివినపద్యములనుండి కొన్ని.

మ॥ తము సన్మానముఁ జేయ శక్తియొసఁగుమంతన్ లేదు మీశక్తియు
త్త మటంచున్ గ్రహియింపలేము నరనాథ ప్రార్థ్యమై యొప్ప కా
ర్యము చేయన్ సమకట్టినార మిట లోపాలోపముల్ దిద్దుమా
ర్గము మీదే యని వేఁడుకొందుము నమస్కారంబు గావించుచున్.

చంపకమాలిక.

తరతమభావమున్ భువిని దజ్ఞులు పండితు లెల్లవారు గొ
ప్పరపు కవిద్వయంబునకుఁ బండితులై యలరారుమీకు నీ
వఱకె గ్రహించినార లది బాగుగ లోకమువారు గూడ నె
ల్లరును గ్రహింపఁగా మనములన్ బొడగట్టినకోర్కె పేర్మిఁ జే
కుఱఁగను వారికిన్ దమకుఁగూడను గన్నులిఖించినాఁడఁ గొ
ప్పరమిట కేగుదేర దల వారికిఁ గార్యభరంబు పెండ్లికో?
............దీనికిని సాటిగఁ గొండొకఁ జెప్పఁబోవఁగా
వారకొనవచ్చునే! ఎచటఁ దోయజమిత్రుని ముందు దీపము
జ్జ్వలమగు? నేన్గుముందటను దోమను బోల్పఁగవచ్చునే? ధురం
ధరమయి యెల్లమానవులఁ దానయి పూతులఁ జేయు గోవు ముం
దర ఖరమున్ మహేశ్వరుని దాపున రాక్షసవర్గ మెందు నుం
తురె! యనిప్రేక్షకుల్ తమమదుల్ బయిపెట్టఁగ నొప్పనట్టి శ్రీ
తిరుపతివేంకటేశ్వరుల దివ్య కవిత్వ మహత్వ మిప్పు డా
దరమునఁ జూడఁగల్గె ఫలితంబుగనయ్యెను జన్మ మిత్తఱిన్.

తూ॥ కోటయ్య

---

ఉత్పలమాలిక.

నీతులు పల్కవచ్చుఁ బరనింద లొనర్పఁగవచ్చు నిట్టు లా
సేతు హిమాచలంబును బ్రసిద్ధి వహించు నృపుల్ సెబాసనన్
భీతులు త్రోవఁబట్టి తల వెన్కకుఁ ద్రిప్పుచు జాఱుచుండఁగన్
శాతవిరోధులే పలుకు సాగక యొక్కెడ మూల్గుచుండఁగన్

మూతులు విప్పి మొత్తువడి మూర్ఖులు కొందఱు తారుమాఱుగా
ఖ్యాతిఁ దలిర్చ పండితులయారె! భళీ; యవురా! యన..."

తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి చందవోలు.

---

సీ॥ చక్రశంఖాది లాంఛన విరాజితుఁడైన విష్ణుఁడే యీ కాశి కృష్ణుఁడంచు
కవితాసరస్వతి ఘనత నాడించుగీష్పతి దివాకర్లతిర్పతి యటంచు
కుకవిత్రిపురదైత్యకుంభికార్యత్తుఁడౌ నీశుఁడే యీ వెంకటేశుఁ డంచు
ద్రష్టలు లోన భేదము లేక గనుఁగొన్న మూఁడుమూర్తులు నొక్కమూర్తి యంచు
గీ॥ మానవోత్తము లేమహామహుల నెప్డు, పలుక్రుచుండెద రాకవిబ్రహ్మలను మ
దీయ హృత్పద్మమున వినుతించుచుండు, నెలమిఁ దిర్పతివెంకటకృష్ణకవుల.

ఇట్లు విధేయుఁడు, దెందుకూరి సోమనాథశాస్త్రి.

---

సీ॥ శేషాద్రిగాక యశేషదేశీయుల నిత్యోత్సవములచే నెగడినారు
వడ్డికాసులుగాక యడ్డులేక జనాళు లిడ్డకాసుల సంగ్రహించినారు
పరగూఢపదభోగవసతిగాక యగూఢపదభోగవంతులై పరఁగినారు
ఈశ్వరబిరుదు గ్రహించుటగాక కవీశ్వరబిరుదు గ్రహించినారు
గీ॥ కొండయెకిమాత్రమే మహానందమిడుట, గాక యందఱ కానందఘటకు లైరి
యిప్డు డాతిరుపతివెంకటేశు మించి, రిలను నీతిరుపతి వేంకటేశకవులు.

చ॥ గురుతరలీల నీసభను గూర్చిన బుద్ధిమదగ్రకోటికిన్
సరసశతావధానుల కెసంగు సభాపతికిన్ సభాస్థలాం
తరసకలప్రజాళికిని ద్రష్టల కీ పినపాటివారికిన్
నిరతసుఖంబు నిష్పితము నీశగణం డిడి ప్రోచుఁగావుతన్.

ములుకుట్ల, వెంకటకృష్ణశాస్త్రి, శతావధాని.

---

శ్లో॥ ఉద్గచ్ఛన్తు శతా త్పరేచ కవయో జల్పన్తు నిస్సంకటం
మాత్సర్యా త్క్వవితాప్రశస్తివిషయే సత్కల్పనా చాతురీ

ధీమత్పణ్డితమణ్డలీహృదయసంతోషప్రదౌ సద్గుణౌ
నైవాన్యం సముపైతి కిన్తు భవతో ర్జిహ్వాం విహాయ క్షణం

వేమూరి, శివస్వామిశాస్త్రి.

---

సీ॥ మీధారణాశక్తి మితిలేనిదనుటకు దండౌ శతావధానంబె సాక్షి
సాహిత్యసామ్రాజ్యచక్రేశు లనుటకుఁ దమరుకూర్చిన పుస్తకములె సాక్షి
కాకవీశ్వరమత్తకరివారు లనుటకుఁ గొప్పపుంగవుల నేకుటయె సాక్షి
అఖిలరాజన్యపూజ్యత నొంది రనుటకుబిరుదులున్నవి వేనవేలు సాక్షి
గీ॥ ఎలమిమిముఁబోలుసుకవీశ్వరులుధరిత్రిఁగలుగ రనుటకుమాఱువల[illegible] మిమె సాక్షి
విమలమతులార! తిర్పతివేంకటేశ, సుకవిమణులార! బహుతరాశుకవులార ॥3॥

గూడ, కృష్ణయ్య, పెరవలి.

# గుంటూరుకాలేజీశతావధానము.

చ॥ ఎఱుఁగడు పిల్లకాయ యెటులే నొనరించు శతావధానముల్
సరసులు మీర లెల్లరును సభ్యులు పేర్మి ననుగ్రహింపు డా
దరమునఁ దప్పులన్ విడిచి తద్దయు నొప్పులు చూచి మెచ్చుఁడీ
తిరుపతి వేంకటేశ కవిధీరుల శిష్యుని వృద్ధికామునిన్ ॥ (వెం॥శా॥)

☞ అవధానపద్యములన్నియు వదలఁబడినవి.

.............................................

శా॥ నీకున్ శ్రీయును ధీయుఁగల్గుత మఱి నీ కంఠసారస్య మ
స్తోకంబై యలరారుఁగావుత నినుం దూలింపఁగా లేరు దు
ర్ధీకుల్ గావ్యశతావధాను లిఁక వర్ధిష్ణుభావముం గఁ[illegible]
కేకాకారయశంబు నైకొనఁగదోయీ! ఛాత్రచూడామణీ. ॥3॥

మ॥ కుతుకంబొప్ప సరస్వతిం గొలిచి నేఁ గొంతార్జనం జేసితి
స్మృతిమన్ముఖ్యుని బ్రహ్మఁ గొల్చి మఱికొంతన్నేర్చితిన్ విద్దె ని
చ్చితి నీకు న్మఱిఁగొంతమందికి యశశ్శ్రీన్నిల్పితే వోజగ
న్నుతనామా! శివరామ! నీకు నొనరింతున్ దీవనల్ హెచ్చుగన్. ॥4॥

మ॥ ఎదిరిం దమ్ము నెఱుంగకే యెవరో మమ్మెంతేని నిందించునా
యవన న్వచ్చితి వద్దు చొచ్చితివి నీ వన్నవ్వారు లక్షింపవై
రది లోకం బెటులో యెఱింగె నభగణ్యత్వంబు నీ కిచ్చి ర
య్యా? దేనల్ నిండె భవద్యశంబు శివరామా! ఛాత్రచూడామణీ!॥ 5॥

సీ॥ నీతండ్రి వేదవిద్యాతత్పరుం డట నున్నచో నెట్లు నిన్నెన్నుమనుకొ
నీతల్లి లోకవిఖ్యాతదివ్యచరిత్ర యిది గన్నఁడా నెంత ముదముగను నె
నీయన్న విద్యావినీతితత్పరుఁ డట నిపుడున్న నెంతటి యెలమి గను నె
నీతమ్ముఁడవధాననిపుణుఁ డీకృతి గన్న నెంతయో మోదమ్ము నెనయు నొక్కొ
గీ॥ ఇది మహాత్మ్యంభవంబు నీయెల్లబంధు; వులును బొందెడి మోదమ్ము గలిసి యొక్క
నన్ను నేపొంపెడ భరము ఘనంబు మాయ, యెట్లు శివరామ! చెప్ప మాయురా! కుమార!.

మ॥ కలవిద్దెం బలుమంది కిచ్చితిని వీఁకం గొంద ఱెట్టెట్టులో
యెలమిం గూర్చిరి వంగనామ మిడి యొక్కొఁ గొంద ఱానందముం
గొలుపం బూనిరి నీకతమ్మున నఁ దగ్గుంగాక యాయొగ్గుఁ ద
గ్గులు; వేవే శివరామశాస్త్రి! మది పొంగుంగాక నాకుద్ధతిన్. 7.

శా॥ "సంతానం బది లేదు నా" కనుమనశ్శల్యంబు నీవైదుషీ
కాంతుల్ ద్రోచెఁగదోయి! తండ్రి! నిను నాకాంక్షింతుం డుఁ దద్భార్యయున్
స్వాంతం బుంచి యనుగ్రహించి బహుధా సంతుష్టునిం జేయుచున్
మంతు ల్గాంత సమస్తలోకమును సమ్మానించుఁగాత న్నినున్ ॥8॥

చ॥ "అఱువదియేడు లాయు,,వని యందురు గా కలిలోన, నల్వ దీ
వఱకె గతించె నిప్పటికి నాగ్రఘు మనన్ జర నోరువిప్పి మ
మ్మరయుచునుండె మాభరము నంతయు నీతలఁ దాల్చి చేయు మే
ర్పఱచిన తోవ్రి నోయి శివరామకవీ! బహుళావధానముల్॥ 9॥

క॥ "య,,న్ననుచుఁ గొందఱనఁగా, "బ,,స్ననుచుం గొందఱనఁగ బాలుఁడవయ్యున్
నిస్సీమ యశముఁ గొంటి మ హాస్యాగర! వృద్ధినందుమా! శివరామా!॥ 10॥

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతావధాని.

మ॥ జగతీనాథులు పెక్కుమంది ముదితస్వాంతంబునం గానఁగా లం
పఁగ సాంగంబు సలక్షణంబుగ శరద్వావింశతిం బేర్మి నె

చ్చఁగ వహ యేలిన యావధానకవితాసామ్రాజ్యభారంబు మో
యఁగఁ బూనంగదవయ్య తండ్రి! శివరామయ్యా! చిరంజీవివై॥ 1॥

మ॥ రిపులే తెంచిన రూపడంచుచు ధరిత్రీనాథు లర్పించు న
య్యుపదల్ గైకొనుచుం బ్రజాపత్యుఁడవు గా కుద్యన్నన్న వేందుండవై
విపరీతం బగు త్రోవఁబోక కవితావీథుండవై వర్ణనీ
యపరా క్రాంతి వహింపుమయ్య శివరామయ్యా! చిరంజీవివై॥ 2

శా॥ బాల్యోద్రేకము హెచ్చి నెదిర్చితివి కొప్రంపుంగవిం గ్రంథసా
కల్యంబుం బొనరింతొ లేదా యని నీకై కొంకు నన్మనన్మన
శ్శల్యం బిప్పటి కూడఁదీసితివి వత్సా! సత్సభాశోభివై
కల్యాణంబులఁ బొందుమయ్య! యిఁక వీఁకక్ శిష్యచూడామణీ. ॥3॥

మ॥ అవనీదేవులు నిస్సమానకవితావ్యాహార వారాశినం
భవపీయూషరసాభిలిప్తలలితవ్యాహారనీహారులై
యవలోకింప శతావధానమున మాకానందముంగూర్చి గౌ
రవము న్నిల్పితివయ్య మాఋణము తీఱక్ శిష్యచూడామణీ. ॥4॥

శా॥ స్వర్ణీలావతులెల్ల రద్భుతపదవ్యాపార మేపార మా
చర్లబ్రహ్మసుధీగురూత్తమునిశాచాపూర్తిఁ గీర్తింపఁగా
గీర్లాభంబునుఁ గోరిమాదరకి భక్తిన్ శిష్యు లేతేరఁగాఁ
దర్లంజేసితి వస్మదీయగురువిద్యావంశచూడామణీ. ॥5॥

దివాకర్ల,తిరుపతిశాస్త్రి, శతావధాని.

సీ॥ శతవధానవిధానసందర్భములనెల్ల నేర్చి దిక్కులఁ గీర్తిఁ దార్చినావు
అవధానమునఁ బెట్టినట్టి చిక్కులనెల్ల నూర్చి నీపని నీవ తీర్చినావు
నడుము క్రుంగఁగ వ్రాయి నడిమివారల కష్టమార్చి గీతిని వారిఁ దేర్చినావు
పున్నామనరకంబు పోవునాయనుచింత దీర్చి యొజ్జకుఁ దుష్టిఁ గూర్చినావు
గీ॥ మేలు, శివరామశాస్త్రి! నిన్నోలి గురుని, కనుపమయశంబు ఘటియించునట్టి శిష్యుఁ
డరిది, గురువులతోఁ గ్రుద్దులాడ కెపుడు, గురుయశంబుల నార్జించికొనఁగదయ్య.

కాశీకృష్ణః, శతావధాని.

... ... ... ... ... ...



క॥ మాకును మాశిష్యులకు న, నేకులు ప్రాజ్ఞు లిటు లెల్లయెడఁ జేసెడియ
స్తోకపుగౌరవముల కల, లౌకికు లెంతేని జింతలన్ జివికి వెనన్. ౧౭౩

సీ॥ యత్నమెంతేని యొనరించియు "విశద, వాఙ్మయదగుష లైలోనఘనమ్ముఘటించి
రానభావిశేషంబుల నరసి తీర, వలయు నంతియె యంబ? నీ వరయ లేదె.

గీ॥ వాని "కలవాటు లేనియాపాసనములు" కొప్పరపుసామ లొనరింప నొప్పికొనరు
పాప? మేమి నేతురు వారిఁ బట్టికొనిన, గ్రహములనుబట్టి మిక్కిలి కష్టపడిరి.

క॥ "తాటికెగఁ బ్రాఁకఁబూనిన, చోటన్ మఱియెంత దనుకఁ 'జోచో' యనుచున్
మాటికి నెగఁద్రోయుదు,, రను, మాట కుదాహరణముగ శ్రమంబది యొప్పెన్.

సీ॥ కొప్పరం బవధానంబు కోఱకుఁబూని, *వశము గాకపడెడిభంగపాటులెల్ల
మావ యనిబోల్పఁదొడఁగిరిమంత్రిబలము, చాలఁగలకూటలౌకికాచారపరులు.

మ॥ అవధానం బెటు చెడ్డ నేమి, "బళి, మే, లాహా, జగమ్మందు లే
రవధానుల్ మఱి యొక్క రిట్టి రని యాహాకారముల్ వ్రాసి తా
నెవఁడో పత్రిక కంప దానిఁ గవి "యిట్లే నిక్క మంచున్ జగం
బవలోకించు మనమ్మునందు నిజ మేలా తేలు నప్పట్టునన్. ౧౭౪

ఉ॥ §"బాగుగ నుండెఁ గొప్పరపువారి" దటంచు లిఖించునప్పుడున్
డాఁగియె గిల్క రెండఱొ హుటాహుటి వ్రాఁతలు డాఁగనేల? యే
వాఁగుడొ వెళ్లఁ బెట్టునెడ వ్రాయనకాఁ డటు నేయుఁ గాక "మేల్?
బాగు? భళా? భళా" యనెడిపట్టున డాఁగుట కర్థ మేమగున్. ౧౭౫

---

* ఈభంగపాటులనుగూర్చి పూర్వరంగము 108, 109, 110, 111, 112, పుటలుచూ.

§(1911 సం॥ రం 13వ అక్టోబరు తేదీ, ఆంధ్రకేసరి పత్రికనుండి.)

(గుంటూరి శతావధానము.)

...సభ అనమానవైభవంబుతో జరుపబడినది. 51 పృచ్ఛకులకు నిరాఘాటముగా జరుపబడినది. అవధానపుపద్యములైనను ప్రబంధపద్యములను మించియున్నవి యిదియంతయు జూచినతోడ ప్రతిపక్షులకు నోరెత్తుటకున యినను సందుదొరికిన దికాదు అంత సభానంతరమున ప్రతికక్షివారిచే కూడ మెప్పువడసిరని వ్రాయుట

క॥ కలనిజమెల్ల నిటులె యీ, కలహమ్మునఁ దెలిసికొనినఁ గాక తెలియ దే
వలుగో పేర్మార్చి యెదో. గిలికెడి నిజ మెట్లు తెలియుఁ గృతబుద్ధులకున్.
ఉ॥ ఇయ్యెడ భిన్నభిన్నతను వేటికి నెత్తిరొ? ప్రత్తిపాటికా
మయ్యయు, రామకృష్ణులును, నందఱ బాఁకెడి కాళ్లకూరినా

---

కు గడునంతసిల్లుచున్నారము యిదివర కీగ్రామంబున జరిగిన సభలలో నేదియు
నింత జయప్రదముగా జరిగి యుండలేదు,

ఇట్లు, యథార్థవాది.

---

(ఆన 1911 వ సం॥ అక్టోబరు 4 వ తేది ఆంధ్రపత్రిక నుండి.)

గుంటూరు సమాచారము.

గతనెల 18 వ తేదీని గుంటూరుతాలూకా "విశదల" గ్రామమున కొప్ప
రపు సోదరకవిశ్రేష్ఠుఁడగు బ్రహ్మశ్రీ వెంకటసుబ్బరాయ శర్మ కవిగారిచే
శతావధానము జరిపింపఁబడినది. నాటిసభకు బ్రహ్మశ్రీ కొండా వెంకటప్పయ్య
పంతులుగా రగ్రాసనాధిపత్యము వహించిరి. నాటి శతావధానమునకు గుంటూరు
నుంచి యుద్యోగస్థులు, విద్యార్థులు, న్యాయవాదులు, పండితులు, కవులు సుమా
రు 150 మంది వచ్చియుండిరి. వారికందఱికి పిండివంటలతో సహా భోజన సదుపా
యములు జేయబడినవి. వీరిధారణాశక్తియును, సమయోచిత యుక్తి శక్తులును, కవి
తాపటుత్వమును మేధాశక్తియును, శ్లాఘనీయములు. సభానంతరము కొందఱు
పండితులు, కవులు తమయుత్సాహములను దెలుపుచు కొన్నిపద్యములను జదివిరి.

ఒకపృచ్ఛకుఁడు.

☞ ఇట్టివ్రాఁతలు పెక్కులు, లోపల నిజమెట్టేఁగియుఁ గప్పి
పుచ్చి శాఖాభిమానమును వెల్లడించునీవ్రాఁతలోఁగూడఁ జక్కఁగఁ
బరికించువారికి "విశదల"లో నవధానముకన్న భోజనమే కొండొకమె
ఱు గనుతత్త్వార్థము దొరకకపోదు. అది యటులుండె, ఈరసాభాసావ
ధానము మాయవధానముకన్న వేయిరెట్లధికముగ నున్నదని వ్రాసిన
యతనివ్రాఁతను పూర్వరంగము 46 వ పుటలోఁ జూడఁగోరెదము.

రయ్యయుఁ జట్టిసింగయయు నట్టిరె నాఁ దగుపోచిపోత లీ
యయ్యలు పూర్వజన్మమునయం దొకరే యని తోఁచు నఁటి కా. ౧౨౮

కం॥ అవధానం బారీతిగఁ, జవుటం బడువిత్తులట్లు నమయుడు శాఖా
యువతీమనోహరులు తమ, సువివేకము నెల్లఁ దెలుపఁ జొచ్చిరి పెలుచన్.

శా॥ వెంకటరామకృష్ణులను వీరికిఁ దోడుగఁ దెచ్చి తిర్పతిన్
వెంకన నూడఁ బుత్త మిది వీ లని కొండఱు వారికోనమై
చంకలు గొట్టికొంచుఁ జని సారము గన్గొని "సీ" యటంచు ని
ట్రింకుల నింకినట్లు జను లెంచఁగ వింటిమి నుమ్మి శాంకరీ. ౧౨౯

చ॥ "కునికిన బోసిన కర్పూరయిఁ గొండొక తాటిఫలమ్ము పడ్డ" య
య్యనువున రామకృష్ణు లిది యారసి యుండవలెన్ దెగించి యి
ప్పని వయిఁ బెట్టికొన్నఁ దమపాండితి బైటికి రాదె యారవుం
జనులు సమీపగుల్ బలె స్వశక్తిమహత్త్వ మెఱింగి నవ్వరే. ౧౩౦

తే॥గీ॥ "ఎడమచేయియుఁ బుచ్చ చేయియు" నటన్న, సాహితయొ వీరికవధాన చర్యవట్ల
తమ సామగ్రిలోన భేదంబుబోలెఁ, డెనఁగుఁగొవర్ధంబు నకు రామకృష్ణులకును,

ఉ॥ వచ్చిన రాకయున్నఁ దమవాక్పటిమఁ, దోడుగ నంపు లేనియున్
మెచ్చు ఘటించుఁగాక యనుచు మేటులు చేటులు "శృంగభంగముల్"
వచ్చిక మోఁపులుం బలె నె వంపిరి పాపము! రామకృష్ణు లే
మిచ్చఁ దలంచిరో! నిజ మెటే బయ లౌ నని తా రెఱుంగమిన్. ౧౩౨

ఉ॥ వెంకటరామకృష్ణులవివేకవిశాలపు 'శృంగభంగమున్'
జంకల నూని జన్మదినసమ్మున నే యనధీన తాప్తి ని
ట్రింకులు గొన్ 'శతఘ్ని'ఁ, బఠియించుచుఁ గొవ్వురువారి బందుగుల్
పంకపుఁ దోవలం బడి స్వపద్ధతి వెళ్లఁగఁ బెట్టి రంతటన్. ౧౩౩

తే॥గీ॥ బందుగులటన్న దగ్గఱవారు కారు, ఏకశాఖీయులని యె నీవెఱుఁగుమంబ!
వారు లోలోనఁ గొప్రంపువారి నత్త, నెఱుఁగ రనుకోకు మెఱిఁగియు నిట్టులైరి

తే॥గీ॥ ఒకరొ యిర్వురొ తక్కనీయోగులందు, గొప్పరపుధారయన నొప్పుకొనని వారె
కాని యానన చర్యాభిమానదూన, మాన సాంతరులై మేను మఱచిచెడిరి. ౧౩౪

సీ॥ "పండితబ్రువ" యంచుఁ బండితోత్తములుతిట్టిరెవ్వాఁడుతనహైన్యమెఱుకపఱచె,
"సత్యవాది" యటన్న చాటుపేరన లేనిపోనివాదుల నేఁడు పూని వ్రాసె,
అతని కెక్కుడుగ "యథార్థవా" ద్యభిధానమున నెవ్వఁడులిఖించెననృతములను,
వంటబ్రాహ్మణునుత్సవమ్మున కెవ్వఁడు తనయశ్వము నొసంగి ఘనతఁజెఱిచె
తే॥గీ॥ కొనియెనీచలువ్వరును మఱికొంతమంది, దక్కుమాయందు ద్వేషంబుదగులుజనులు
లేరట నియోగులందు నివ్వారికతన, వ్యృథగ నెందఱికో చెడ్డ పేరు వచ్చె.

మ॥ జననీ! కొప్రపువారిపక్ష మది నీచంబో ఘనంబో! కనుం
గొనుమీ! వంటనియోగి నశ్వముపయిన్ గూర్చుండఁగాఁ బెట్టి యూ
రున నేగించిరి వాద్యఘోషములతోఁ (గొంగొ)త్తదీపాలతో
"ననయుల్ వీరికి బుద్ధి లే" దని పురం బాబాలమున్ గోలగాన్. ౧౮౮

మ॥ శివరాముం డవధానమున్ సలిపి వానిన్ బేర్చుడన్ వానిగో
రవ మొప్పన్ ఘను లట్లు చేసి రని యోర్వన్ లేక కొప్రంబు దా
నవధాన మ్మిట్టు చేయఁ జాల డెటు లట్లో నుత్సవం బంచుఁ గుం
దు వెలార్చన్ దమపాచకాధముని నెందుం ద్రిప్ప రప్పట్టునన్. ౧౮౯

తే.గీ॥ దీనిచేతనె సకలంబు తెలిపినట్టి, దయ్యెఁ బ్రాజ్ఞుల కిఁక నన్య మనవసరము
ఐననా యాయినందస్ఛుంతొ యింతొ, తెల్పుకున్నదూరగులకుఁ దెలియుటెల్లు

చ॥ "విశదల"లో వధాన మది వెల్గ్రిగఁ దోఁచినమీఁదఁగూడ నీ
ర్ష్యాశయము దక్కి గుంటురుపురిన్ సభఁ బెట్టి చెడంగఁ జూచి "దు
ర్దశులకు నుత్సవం బనినఁ దప్పగ నుండు" నటంచు నెంచి యీ
పశుకృతి కిచ్చఁ జేసి నగుఁబాటుబడా లయి రంబిలౌకికుల్. ౧౯౧

మ॥ అభిమానంబనగర్తపూస్థితనియోగన్యాగేనరాధీన మం
చు భయం బించుక లేక చెప్పఁ దగు నెచ్చో వార లద్దానికై
శుభదూరంబు నసత్యమున్ శుభద మంచు న్నమ్మి భాషింతు రే
రభసప్రక్రియ కేని సిద్ధపడి యారంభింత్రు దుర్వ్యాహృతుల్. ౧౯౨

క॥ శుకక్కుశ్వముపై నెక్కిన, నిక్కువసంతోసమందునిపుణులు కవులం
దెక్కువ తక్కువ లరయుదు, రొక్కొకని యెడివిన్న నవ్వరొక్కొ? విబుధుల్.

క॥ ఇదియిటులుండుత రాజీ, కుదిరింపఁగఁ బత్రమది యొకొండు మునుపె యా
సదమతులు వ్రాసియుంచిరి, కదె తచ్చరితమ్ము వినికి గావింతు మిఁకన్.

క॥ ఇరువదినాలుగు దినములు, పరిపరి యోజించి తుదకుఁ బత్రిక మా కి
చ్చిరి తెచ్చి *గౌరవస్థులు, మఱిమూఁగురు; దానిఁ గాంచి మదిముద మొదవన్.

ఉ॥ అంతకుమున్నె "పత్రికిటులా గతమా," నని విన్న నాఁడె వా
కాంత యనుగ్రహమ్మున నొకానొక కల్పన దోఁచఁగా,, యశః
కాంత వివాహముం,,గుఱిచి కట్టియ యుంచిన పద్యసప్తకం
బెంతయుఁ బేర్మి వారు విని హెచ్చిన మోదము గాంచి రయ్యెడన్. ౧౯౬

---

*(1911 సం, అక్టోబరు 20, తేదీ కృష్ణాపత్రికనుండి.)

బ్రహ్మశ్రీ తిరుపతివెంకట కవీశ్వరుల సముఖమునకు. ఈదిగువ సంతకము చేసిన వారు నమస్కరించి వ్రాయువిజ్ఞాపన:—

ఈపురమున నీమధ్య శతావధానసభ జరిగినది మొదలు దమకును గొప్పరపు సోదర కవులకును వైషమ్యములేర్పడి ఉత్తర ప్రత్యుత్తరములు నడచినవి. మాగ్రామములో తమ తమ మధ్యవైషమ్యము లేర్పడుట మాకు మిక్కిలి శోచనీయముగానున్నది. తమరును కొప్పరపు కవీశ్వరులును మాకు గౌరవార్హులేయగుట మాగ్రామమునుండి వాగలను మిమ్ములను సఖ్యపరచి పంపుట మాకు యుక్తమనియు గౌరవమనియు దోచుచున్నది. కావున మాయుద్దేశ్యమును మీరును అంగీకరించి మీరాసభ మొదలింతవరకు నొండొరులంగూర్చి వచించినవియు లిఖించినవియు మరల్చుకొనుచు నొకరినొకరు లిఖితరూపముగ తెల్పుకొని యెప్పటి స్నేహభావమవలంబించిన మేము మిక్కిలి సంతసించెదము. మావిజ్ఞాపన నాదరించి మీవైషమ్యకారణము లను మరచి మాకు సంతసము కూర్పుదురని నమ్ముచున్నాము.

గుంటూరు. }
4—9—11 }

చిత్తగించవలెను.
ఇట్లు తమ విధేయులు.

యేకా రామయ్య, జి. రామనాథయ్య. వంకిపురం కృష్ణమాచార్యులు. న్యాపతి హనుమంతరావు. కొండ వెంకటప్పయ్య.

## యశః కన్యకాపరిణయము.

సీ॥ తారతమ్య మెఱింగి తరలి వచ్చెడియారు కొప్పరం బం చెఱుంగుదురు మీరు
తప్పెటల్ మ్రోగంగఁ దరలి వచ్చెడియారుకొప్పరం బం చెఱుంగుదురు మీరు
తరుణతాభరముపైఁ దరలి వచ్చెడియారు కొప్పరం బం చెఱుంగుదురు మీరు
తగుబాంధవులతోడఁ దరలివచ్చెడియారు కొప్పరం బం చెఱుంగుదురు మీరు
తే॥ గీ॥ తిరుపతియొకకన్యకాదాత తెరువు వదలి, వచ్చుచోనిఁ తయాతిథ్యమిచ్చు రాక
యున్నచో నప్పుడే పెండ్లి యున్నయయ్యె, నొకరు వారింపనేటికో యోగ్యులార. 1
సీ॥ కలదొక్క కూఁతురు కలిగెఁ బెండిలికాక మున్నొ వడుగు గాక మున్నె మాకు
నాంధ్రగీర్వాణభాషాంగనాతిలకమ్ము లిరువు రక్కన్యయ నెత్తి పెంచి
రీడేటి నెందఱో యీకన్నెఁ బెండ్లాడఁగా నెంచి యత్నించి కడకు దీని
చే నీసడింపుల నూనిపోయిరి తల నరయంగఁ దతియయ్యెఁ బరిణయంబు.
తే॥ గీ॥ లేకయే పోయె ననుకొనుపాక మెఱిఁగి, కొప్పరపువారు తరలి రాఁగోరి రంత
నంతసించితి మంతనే జాఱఁదొడఁగి, రూరకుంటిమి తప్పేమి యోగ్యులార. 2
సీ॥ 'తల నరసిన నాతిఁ గలయుట కామశాస్త్ర విరోధ'మని మదిఁ దలఁచిరొక్కొ?
'ఉభయభాషలు నేర్చు నువిదఁ బెండ్లాడఁగాఁ దగ'మంచులోలోనఁ దలఁకిరొక్కొ
'పెక్కుమాటలు నేర్చు పెంకెపిల్లను గొన్న మాటదక్క' దటంచు మానిరొక్కొ
'ఎందఱో జంకిన యెమ్మెలాఁడిని గొన్నఁ బరువు దక్క'టంచుఁ బఱచిరొక్కొ
తే॥ గీ॥ 'కట్నమే చాల' దనుకొని కనలిరొక్కొ, వారు గోరిన దిచ్చు మానేరమేమి
ఎట్టులో పెండ్లిపొనఁగించితొలమిపైన. దన్యమునఁ బండితులఁ దన్పఁ నలఁపుఁడయ్య. 3
సీ॥ వియ్యమ్మునకు వారె విందుల నంపింపఁ దుల లే దనుచు మున్నె పలికినాము
"కాదుకూడ,, దటంచుఁ గాల్వెకల్పు కరాగ "మంచిదే" యని సమ్మతించినాము
ఒకమీనమే కట్నమోలిపైఁ గోరఁ దక్కిన మీనమును గూడ నునిచినాము
కన్యావరణదాఁకఁ గార్యంబొనర్చితి మంతలో సుముహూర్త మగున టంచు
గీ॥ దలఁచుచుండఁ బురోహితుల్ దగినవారు, కావలసి వచ్చి రంతటఁ గాలివాన
వచ్చి కథయాఁగె నిందలి పొచ్చె మెఱిఁగి, యేల నెవపెట్టెదరు మమ్మహీనులార. 4
సీ॥ "ఎంత మీనమ్మైన నివి వెండ్రుకలె,, యంచు నీసడించిన రోసమేమి మాకు
"వైదికకన్యక వలదు కైకొను,, టంచు నీసడించిన రోసమేమి మాకు

"శాస్త్రంబు చదివిన నతియేల మాకంచు నీసడించిన రోసమేమి మాకు
"వాచ్యవంగడపు మీయింతి మాకేల" యంచు నీసడించిన రోసమేమి మాకు
గీ॥ మొదటఁగోరిరి పిమ్మటఁ జదువు సంటె, లెతిఁగిరో? యేమొ వెనుదీసి రెండు కేని
సమ్మతించితి మింక మీర్నెమ్మిగూర్పఁ; బూనుటది పునరుక్తి మోజ్ఞానులార 5
సీ॥ రుద్రాక్షపూస లటులఁ దాల్చువారికి బంగారు వారి కేబాంధవంబు?
పలిబూది దాల్చు వారలకుఁ దిర్మణి తిరుచూర్ణాలవారి కేచుట్టరికము?
"ఇత్యర్థలితిభావ" లేవేళఁ బల్కు వారలకుఁ దెల్గులతోడ రాజియేల?
గురుపాదసేవఁ జేకొనిన విద్దియకు బాజారు విద్దియతోడ సఖ్య మేల?
గీ॥ ఏడ 'తిరుపతి,' 'కొప్పరం,' బేడ సహవా, ఆహవమె కాని మఱి వివాహంబె కాని
స్నేహమే కాని మాకెల్లు చెల్లుఁ జెప్పుఁడ, నరసులార, గుంటూరు వాస్తవ్యులార 6
సీ॥ గోదావరీనదీ కూలమ్ములకుఁ గొండవీటి కూపమ్ముతో వైర మేల?
ఆమ్రాదితరుజాల మలరుతోఁటలకు గోఁగాకుభూములమీఁదఁ గాఁక యేల?
ఎచటఁ జూచిన నిక్షులే వాల్చుపొలముల కేలయ్య? జొన్న పొలాల చెలిమి
తిరుపతివేంకటేశ్వరున కంకాలమ్మ జాతరమీఁది విశ్వాస మేమి?
గీ॥ ఇంతకును గాలుద్రవ్విన దెవ్వరో యె, యుంగుదురు మీ; రలెవరిన్వరూపమెట్టి
దో యెఱుంగుదు రరక యేతోవిధమున, మమ్ము నెపపెట్ట నేల? యోమాన్యులార.7



చ॥ పదపడి కొన్ని పద్దెములు పత్రికలోఁ *బ్రకటించి సంశయా
స్పదులగు లోకులం దనిపి ప్రాజ్ఞుల నంధికిఁ గొల్పు యోగ్యులన్

(*1911 సం, అక్టోబరు 20, 28 తేదీ కృష్ణాపత్రికనుండి.)

పైసంతకము లొనర్చినవారికి నమస్కారపూర్వకముగా మా యొనర్చుకొను వినయపూర్వక పద్యమయ విజ్ఞాపనము:—

ఆర్యులాలా! 4-9-11 తేదీగల తమ పత్రిక 28-9-11 వ తేదీ సాయంకాలము సుమారు $5\frac{1}{2}$ గంటలవేళ మ॥ రా॥ రా॥ కొండ వెంకటప్పయ్య పంతులుగారు బి. ఏ; బి. బిల్; గొల్లపూడి రామనాథయ్యగారు బి. ఏ; బి. యల్; గోవిందరాజు శ్రీనివాసరావు పంతులుగారు బి. ఏ; బి యల్; అను పెద్దమనుష్యులవలన మాకు నందియపారానందము నొనర్చినది. దానిపైఁ గొన్ని పద్యములు భగవతి తోఁపింపఁగా నయ్యవి యన్నియును దమసన్నిధి కంపికొన దలఁచితిమి గాని

ముదమున మించి యచ్చటనె మోదమెలర్పఁ గవిత్వగోష్ఠి పెం
పొదవఁగనుంటి మావయికథోదయముక్ వినుమంబ పేర్మిమై ౧౯౩౪

(అప్పుడుప్రకటితమైనపద్యములు)

సీ॥ అనవసరమ్ముగా నాసనమ్మును గోరి యవధానవిఘ్నమ్ము నాచరింప
"మది యయుక్తం" మటంచు నగ్రాసనాధిపుఁడనిన పిమ్మటఁగూడఁ బెనఁగబోము
పెనఁగియుఁ దుద కది గొనలేక సభవీడి యవలి కేగి యసూయనందఁబోము
అందియు నాటకాభ్యంతరమ్మున నుండు నప్పుడు పద్యమ్ము లంపఁ బోము.

గీ॥ ఎఱుఁగకే మీనములఁబట్టి యెట్లొ వ్రేలఁ, బడము దుందుడుకందము వలికినట్టి
పలుకుమూఁడులోకమ్ములనిలిపికొనఁగఁ,జాలుదుము పండితులయొద్ద సరసులార 1

సీ॥ ఒకని పెండిలిలో మఱొకరుఁ డావల్లకీ నిఱుక నుంకించు టెంతేనిఁదప్పు
ఎఱుఁగక యత్నించిరే యంద మాపైనిఁ దెలిసియుఁ బెనఁగు టెంతేనిఁ దప్పు
అధ్యక్షుఁ "డిది కూడ" దంచుఁ జెప్పినమీఁద నేని యాగమి మఱెంతేనిఁ దప్పు
అక్షరతత్త్వంబు నరయ కాపై భీతి దీఱ కాల్ద్రవ్వు టెంతేనిఁ దప్పు

తే॥గీ॥ "మీనముల" పద్యతాత్పర్యవాసనయినను,మంత తెలియక వ్రేలాడు టెంతయేని
దప్పు "తప్పని" నేఁ జెప్పటొప్పగాదు, పండితులచేతఁ జెప్పింపవలయుఁజుండు2

సీ॥ తిరుపతి వేంకటేశ్వరులతకున్నయును గొప్పరంబునవారి గొప్పఁదనము
ఆంధ్రగీర్వాణభాషావరత్వము గ్రామ్యభాషావధూటీప్రభావగరిమ
ననియమాశుకవిత్వమునఁగల్గు లోపం బనియమాశుకవనిర్ణిద్రమహిమ
అవ్యాజరచనాపహాస్యత్వమును బూర్వసంచితపఠనప్రశస్తతయును॥

గీ॥ సభయొనర్చినపైఁగదా!సహృదయహృద,యావగతమగుఁ, గాల్ద్రవ్వుటలఁతి
వారు, నేయఁదగు కార్యమా!యెంత చేవయేని,నుండియేతీరవలెఁ జుండియోగ్యులార!

---

గ్రంథవిస్తరభీతియును విలువగలతమకాలమునకు లేనిపోని పని గల్పించినవార
మగుదుమేమో యను సందియమును వెనుకంజ వేయించుటచే నందలిదశాంశమును
మాత్రముఁ బంపికొనుచున్నారము. వ్రాసి పంపినచోఁ దమకుమాత్రమే యింద
లి మంచిచెడ్డలు బోధపడునుగాని యావదాంధ్రలోకమునకును బోధపడవని పత్రి
కాముఖమునఁ బ్రకటించికొంటిమి. ఇందుఁగలతప్పులనుమన్నింప వేఁడుకొనుచు
న్నారము. (తిరుపతివేంకటేశ్వరులు)

సీ॥ ఊరూర నూరేగుసుత్తరప్రత్యుత్తరముల కేలాగు నాశము ఘటిల్లు,
నొప్పు తప్పుగఁ దప్పు నొప్పుగా లిఖియించు "సత్యవాదుల" వ్రాఁతసమయు టెట్లు
ఇహపరమ్ముల దెలుంగకే ప్రవర్తించు "యథార్థవాదుల" ధార్ష్ట్యమడఁగు టెట్లు
తిరుపతికన్నఁ గొప్పరమెక్కుడ నెడియీ పాటిబండలగోల దాఁటు టెట్లు?
తే॥ గీ॥ ఊరకే స్నేహమును గూర్పఁగోరినారు, మీ రమాయికు లివియన్ని యెరికతనఁ
గల్గెనో యింత యోజింపఁగా భవద్ఘనత్వము నుతింతు మింక విజ్ఞానులార॥౮॥
సీ॥ అకటా! కవులకు నపయశంబచ్చెఁగా! యనెడి మీహృదయంబు నరసినాము
అది యాసనప్రసంగాధీనమనెడి మీయాశయం బాసాంత మరసినాము,
ఆప్రశంసను దెచ్చు నమలాత్ము లెవ్వరో ఆమూలముగ మున్నె యరసినాము
ఈ సఖ్యమొనఁగూర్చు యింతకుమూలమున వార నఘాత్ము లగుపూనిక నరసినాము
గీ॥ ఆపులించినఁ బ్రేవుల నరయఁగలరు, కవులు, రవియెఱుఁగనిచోట్లు గాంచఁగలర
కొప్పరపుసోదరులెయెఱుంగుదురు సకల, మకటా! యాసనంబెంత చిక్కుదెచ్చె
సీ॥ "ఒడలెఱుంగనిసివమున్నదే" యెందేని మాశక్తి నెఱుఁగమే మాన్యులార
ఈఁతకు మించులోఁతెందేనిఁ గలదె? కానిండయ్య యొకసారి నిండుసభను
వైదికత్వమున కేవం జేటి కెట్లో మీసాలు దీయుండుఁడీ నరసులార
విద్వద్వినోదముల్ వినుటగ్రామమున కేమపయశమ్ము నుగూర్చవరయఁ డనఘ
తే॥ గీ॥ లార! సత్యవాదులును, యథార్థవాదు లిప్పరమ్మునఁ బుట్టుటెంతేనిఁదప
గాని విద్యలలో నేరుఘనులుగారియెఱుఁగు! పూనికలుతప్పగావయ్య పూజ్యులార
సీ॥ "కాశికృష్ణబుధుం డె కరమంతు లిఖియించినన్నఁ జేసిన', దెంత సత్యమయ
"అభిమానమున మమ్ము నర్చించిరే కాని "శుద్ధమూర్ఖులె"యంట సూనృతం?
"రామకృష్ణులఁబట్టి రహిఁదిట్టినా" రన్న వ్రాఁతయెంతటి సత్యవంత మయ్య!
"నలుబది మందికే సలిపి రివ్వా"రని వెక్కిరించుట యేటిఘక్కి యయ్య!
తే॥ గీ॥ తమరెఱుంగని దిందులేశమును లేదు! అనన మెం తెచ్చిపెట్టె నీయనృతముల!
నిజము దెల్పి యశమ్ము చే నెగడరయ్య! వలదు జంపింక గుంటూరు వాసుల
సీ॥ "కృష్ణలో" వ్రాఁత నిష్ఠేని మీరొకసారి పరికింపుఁడీ హితవాదులార!
"దేశమాత"యొనర్చు దివ్యోపదేశమ్ము లరయుఁడీ యొకసారి యార్యులార
"ఆంధ్రకేసరి" లోని యంశమ్ము లొకపరి చూడుఁడీ యిష్టేని శుద్ధులార
తక్కుపత్రికల యథార్థంపు వ్రాఁత లింకేనిఁ జూడుఁడి మహాజ్ఞానులార॥

గీ॥ సభను జరిగినయట్టి వాస్తవమదెట్టి? దెట్లువ్రాయుచున్నారొ, యెఱిఁగిశాంతి
చేయుఁడీ వ్రాఁతప్రోలికిఁ జెడ్డయశము, గూర్చు నిజ మెట్లొ పైకి రానేర్చె నేఁ.

సీ॥ వేనవేల్ సత్యవిజ్ఞాను లుండియుఁజెడ్డకీరితిఁ గొనునె గుంటూరుపురము
సభ నున్న మీవంటిసరసులకన్న నాకాశంపు సూర్యుఁడా? కర్మసాక్షి
పంచభూతముల మాపాండిత్యతత్త్వంబుఁ జెప్పఁగా నప్పగించెదరె పౌరు
లెవ్వరో యొకరిద్దఱే హేతువై పురమ్మున కప్రతిష్ఠ రాఁబోవునయ్య.

గీ॥ 'రజకువాక్యమ్ములనువిను రాము'లౌట, యుచితమయ్యెమీవంటియోగ్యులకుసకల
మెఱిఁగినందుకు ఫలమేమి? యిట్టిపట్టు, నందుదాసీనులగు టెంత యర్హమయ్య

సీ॥ "ఆసనం బొప్పలే"దని కోపగింతురా? అది గోరుటే పెద్ద యనుచితంబు
"అనుచితం"బనుట కేయాధారమందురా! కొంపుకవిదాఁచికొనుటెసుండు
"అనుచితంబగుకోర్కె ఘను"లెట్లుకోరువా రందురా! అది ప్రమాదాతిశయము
మఱిప్రాజ్ఞులకును బ్రమాదమాయందురా! § "వారికే"యంచునిర్ధారణంబు.

గీ॥ చేసిరివ్రాసిరి వ్యాఖ్యాతృశేఖరులు, ప్రమాదములు విశ్వసింపమిమాకుఁ దప్పె
అంతమాత్ర తానగంతులకనుమతింత్రె, సోదరులుచెప్పఁడయ్య! యోసూరులార.

సీ॥ ఉచితమో యనుచితంబో చేయుపండితుం డరయఁ గావలె భవిష్యత్ప్రశంస
అని * భర్తృహరిచెప్పనైనఁ జూడక యేరిప్రేరణమ్మునను దుర్వారు లగుచు
గాల్ద్రివ్వి యెన్నియోగాటులు ప్రకటించి తలకుఁదగని ప్రయత్నము లొనర్చి
"పండితసభ"యన్న పైఁ గొంత శాంతించి పండ్లబిఁక మొకిఁతవ్రాఁతయందుఁ

గీ॥ జూపి, ప్రాజ్ఞులనమ్రతి పాపకార్య, మనుచు మము వెక్కిరించిన యట్టివారి
సఖ్య మది మాకులేకున్నఁ జచ్చిపోము. వృథగ నెపవెట్టకుండుసుప్రథితులార.

సీ॥ 'ఓంశాంతి'యనెడుమీయోగ్యత వేనోళ్ళ శ్లాఘింపవలెఁజుండు సరసులార
ఈయూహ మీకప్పుడే పుట్టెనేని మీసములమీఁదికి వారు చనరుసుండు
అంతకొక్కింత సైనైనఁ బుట్టినవారు "కుచమర్దనములు" పేర్కొనరుసుండు
సకలఘ్ము జరుగుపై శాంతిఁజెప్పుటకన్న నన్యాయ ముండునయ్యా! మహాత్ము

---

§ శ్లో॥ ప్రమాదోధీమతామ" పీత్యతో, ఆపిశబ్దఏవకారార్ధక ఇత్యభియుక్తాః.

* శ్లో॥ ఉచితమనుచితం వా కుర్వతా కార్యజాలం, పరిణతిరవధార్యా యత్నతః
పండితేన. (భర్తృహరిచూ)

గీ॥ లార! విద్వత్తలోఁ దప్ప నన్యవిషయ, మందుఁ గొప్పవారిసఖ్యంబు మాకు
సమ్మతము, దానిలోఁ గూడ సమ్మతింతు, మేని భారతి మ మ్మింక నీసడించు.
సీ॥ చోరవమై నెదిరించి సొరకాయకోఁతలు కోసినారు కటార్లు దూసినారు
అవధానమందు మిమ్మతిశయించెద మంచు వ్రాసినారు నవాళ్లు చేసినారు
మీఁది మీఁదికివచ్చి మీసాలపైఁ జేయి వేసినా రైదుగుడుల్ గూసినారు
మసిపూసి యెట్టులో మారేడుగాయఁ గాఁ జేసినా రత్త్ర మైడఁ బాసినారు
గీ॥ పెనఁగి మామీసమింతేనిఁ బీఁకకుండ, నెదిరియవధానమున నమ్మఁ గదుమకుండ
నేటి సఖ్యంబు మాకు? మీ కేటిభరము, సభను సమహాన్యుఁడయ్య! యశస్వులార.
సీ॥ బందరేమయ్యెనో? "ప్రెస్సు" లేమయ్యెనో? పుస్తకా లేమయిపోయెనొకొ
అచ్చేమి యయ్యెనో, ఆస్తి యేమయ్యెనో? వర్తకం బేమి కావలసెనొకొ
'నూక' లేమియయ్యెనో? బాలురేమయిరొకో? యుద్యోగమేమూలనుండెనొకొ
ఇ ల్లేమియయ్యెనో! యితరమేమయ్యెనో? మిత్రవర్గంబు లేమి యయిరొకొ
గీ॥ వచ్చినది రాకయయ్యె నీపాటికేము, సెలవు గైకొనుచున్నాము స్నేహభావ
ముంచి పంపింపుఁడయ్య! యేముండె! 'వడ్ల, గింజలోబియ్యపుంగింజ' గేస్తులార.
సీ॥ శ్రావణమాసానఁ జనుదెంచితిమి భాద్రపదమాశ్వయుజము నిప్పట్టణమునఁ
బూర్తిగాఁ గడచె నిప్పుడు కార్తికము వచ్చె నిప్పటికేని మాకింటి కేగు
నిచ్చ పుట్టుట లేద, యిదియెల్ల నీసీమవారియాదృతియు నుదారమైన
మీమైత్రియునుమాదు § మీసాల మహిమయుఁ గొప్పవారి మిక్కుటపుఁ జేర్మి

---

☞ ఈక్రింద నుదాహరింపఁబడు పద్యములు, ప్రకృతము మద్రాసులో బి. యే (B. A. Honours) చదువుచున్న శ్రీ వారణాసి శ్రీనివాసరావుగారు తత్కాలమం దంపిన 200పద్యములనుండి సంగ్రహించి కైకొనఁబడినవి, గ్రంథవిస్తరభీతిచేఁ గొంచెముమాత్రమే యుదాహరించిన మహ్మవ్వారు మన్నింతురుగాక.

§మ॥ తొలుదొల్తన్ గలనూఁగు లేఁ జెమట నెంతో కాంతులన్ గుప్పఁ గ్రై, తలఁ జెప్పించితి ధారుణీపతుల హృత్పద్మంబులో పాపర ని, శ్చలవాగ్ధోరణిమారుతిక్రమము సాష్టాంగంబుగా వ్రాలఁగా. బళిరా! మీనమనీనకు నీవసరి ద్విప్పన్ జెల్లురా ని

గీ॥ యనుజుఁడీ! లేక యున్న మే మొకటనింత, కాలముండుటెప్పట్టునఁగల్గుఁబెట్టు
తక్కిన ప్రసంగములకేమి దైవకల్ప, తమ్ము లాజ్ఞ యొసంగుఁడీ ధన్యులార.

సీ॥ ప్లీడర్లమా? కాము, బీ.యేలమా! కాము, ధనికులమా? కాము ధన్యులార!
అర్థులమా! కాము, వ్యర్థులమా! కాము, ప్రభువులమా! కాము, ప్రథితులార!
దీనులమా! కాము, మానులమా! కాము, హీనులమా? కాము, మాన్యులార!
క్షుద్రులమా! కాము, బద్ధులమా కాము, వృద్ధులమా? కాము, వేత్తలార!

---

న్నిఁకన్. మ॥ కలరుర్విన్ గడునుక్కు ఫుల్ మదవశుల్ గర్వాంధు లన్యాయబూ, తుల నేసీతులటంచు రోఁతలను నెందున్ గైత లేయంచు ని, శ్చలదంభప్రతివిక్రమోత్సుకతమై సంచారమున్ జేతురా, బళిరా! యెల్లెడ, వారిఁగాంచి నినుఁ ద్రిప్పన్ జెల్లురా, మీనమా? మ॥ తలమీఱన్ దలపోసియీసుగొనిగద్వాలాత్మసూరార్థివేంద్రులనంస్థానములందుఁ బండితులు నిన్నున్ దీయ యత్నింపను, జ్వలవాగ్వాహిని గొట్టి వేసి తివిక్రాంచత్ప్రాంఢితీవైఖరిన్, బళిరా! మీనమ? నీకు నీవసరి త్రిప్పన్ జెల్లురా నిన్నిఁకన్. సీ॥ నీనూఁగు నీవూడ్చనే యూడ్చ వచ్చడే గురుకీర్తి కాపాడికొంటివయ్య, నృపసభాప్రకరసాన్నిధ్యంబునన్ జైత్రపత్రికలను దెచ్చి ప్రబలితయ్య, ఆశుధారాకవిత్వాశ నెల్లెడ నేగి యలరారు బిరుదంబులందితయ్య, వాగ్విలాసము దేల పలు కావ్యములు వ్రాసి కవికేసరిఖ్యాతి గాంచితయ్య, గీ॥ నిన్నుఁ జెనయఁగ నెవ్వారు నేర్తురనఘ, చాల రటుగాన పెంపంగఁజాలు దీవ, త్రిప్పఁద్రిప్పంగ మఱిత్రిప్పఁద్రిప్పఁ ద్రిప్పఁ, ద్రిప్పఁ ద్రిప్పంగ నినుఁ జెప్పి చెప్పవలయు॥ సీ॥ విస్ఫుల నెక్కించి పృథ్వీపతులు గొల్వ నిక్కింపఁ జేసితి నీవ కావె, వాదింపఁగా వచ్చువారి వాదంబుల నీఱుగావించితి నీవ కావె, వర్ధాశనస్థితిఁ బడయఁగా దగురాచనెమ్మిను ద్రేకింతు నీవ కావె, మాన్యంబు లిప్పించుమార్గంబు చూపించి నేస్తంబుఁ జాటుదు నీవ కావె, తే॥ గీ॥ మీనమా? గాఢ గౌరవావానమైతె, నెంతఁ జేసితి మున్ ముందిఁకెంతఁ జేయఁ, జాలవెప్పుడుఁ గడుఁ బెంపఁజాలియుండు, త్రిప్పఁద్రిప్పంగ నినుఁ జెప్పి చెప్పవలయు. క॥ నినుఁ దీయుపదునుగల క, త్తిని జూడను స్పైషలు మేకు, తిరున నేమో, యని కొంకుదు ధరణికిఁది. క్కనవచ్చినఁ గాదె? కొంత గాఁదగు శస్త్రఘ్నీ. క॥ కానర మానర నుడి నఁ, తోసిల్లఁగ నానుకయితతో సాగెడినీ, వీనవు కైనరులేనరి, మీనమ? నినుఁ దీయఁ గలుగు మేధాగతికిన్. చ॥ మన మెటు చాలియుం

గీ॥ కవుల, మిప్పటి 'రూల్సు' కుఁ గట్టఁబడము, ఘనులు * పండితరాయాదికవులు చూపు
త్రోవలం బట్టి పోదుము దేవునైన, లక్ష్య పెట్టము † మాకు వల్లభులు లేరు.
సీ॥ తిరుపతి వేంకటేశ్వరుల పేరులు మీకు జ్ఞప్తిలో నిల్పునాననపుఁ జర్చ
అల్లకొప్పరపు సోదరుల పేరులుమీకు జ్ఞప్తిలో నిల్పు నాననపుఁ జర్చ

---

దు మని మంచియుఁ జెడ్డయు నెంచకుండఁ బైఁ, జని మన పైకిఁదెచ్చి కొని సర్వవిధంబులఁ జింతసేయ నె,య్యనువునఁ బాయుని వేసితిమి! యుద్ధోకఁడంతన జాలియుంటిమం, చునః దలపోయుచుండి రిఁకెఁ జూడుము కోపము మానిమీసమా. చ॥ కలరు కవిత్వపార్థులును గల్గుదు రీకవితాభిమన్యులుఁ, గలరు కవిత్వ భీములును గల్గుదు రీకవిమాద్రిపుత్రులుఁ గలదు కవిత్వధర్మమిఁకఁ గల్గునమస్తము గల్గకుండినన్, గలుగవె నీవు కృష్ణుఁ డనఁగాఁ దగి దుష్టుల నెంచ మీసమా. చ॥ దుడుకుదనంపు పోకలకు దోసపుసేఁతల కాలవాలముల్, కడు నెగురంగ నంతకు సుఖంబుగ డిగ్గదు వారిపేఁచమె, షడఁపఁగ ఫాలలోచనము వచ్చిన వెంటనె నీవువత్తు వి,ప్పడు దయఁబూనుమా! యలుకఁబూనక మానుమ? నీవుమీసమా, సీ॥ అలబృహద్రిథుశక్తి దరియనప్పుడ నీళ్ల మ్రింగినవిప్పచ్చుమీసమెంత, దుర్యోధనుని గూల్పఁ దోడుగాఁ గృష్ణుండుమిణికిన వలలాంకుమీసమెంత, వాలినివధియింపవంచనావృత్తిపైమెమేస్త యనిన రాముమీసమెంత, ఇంద్రజిత్తునికీలు నెఱిఁగి త్రుంచుచుదూడ నేసిన సౌమిత్రిమీసమెంత, గీ॥ నీవ మీసంబ వీమహి నీవ 'కుంతి, తంబు, నాఁగలపల్కు నెత్తఁటి నెఱుంగ, వెప్పు డసమానవిక్రమంబె వహించి జయము గొంటివి జగతి మీసంపుఱేఁడ, చ॥ అలఘుకవిత్వకీర్తిఁ గొనసందఱకున్ దరమా నె? మించునె, త్రులగమకింపసందఱకుఁదోఁచు నె? తోఁచిన 'జీలుగెత్తు' గా, వెలయదె? మేకుమాటు మఱిపించదె పెంచదె గీరతంబు;నీ, వలుగకు సంస్కృతాంధ్రకవితైకమహత్త్వమ? చాలు మీసమా. మ॥ సుమనిర్యన్మకరందగంధకవితాశుద్ధాంతభృంగీరవో, పమభక్తప్రతిపత్తితో వెలయుచున్ బాండిత్యగంధానిలం, బమలంబై తెమలంగ లోకజనసమ్మాన్యక్రియం బొల్తు వో, కమనీయప్రతిభావిలాసమ? నమస్కారం బిదే మీసమా. (13)...

---

* శ్లో॥ మనస్వీ మ్రియతేవాఽపి స్వోత్కర్షం నైవ ముంచతి।
అపి నిర్వాణ మాయాతి నాఽనలో యాతి శీతతామ్॥

‡ నిరంకుశాః కవయః

విద్వత్కవీంద్రసంవిద్విలాసము మీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁ జర్చ
కేవల కవుల యకించనత్వము మీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁ జర్చ
గీ॥ మేటి యాసన చర్చకు,మీకుసత్య,వాదులకు, మాకును, "యథార్థవాదుల"కును
మఱియు మామీసములకుఁగొప్పరపుసోద, రులకు,దీర్ఘాయువిడిసల్వ ప్రోచుఁగాక.

---

(పరిశిష్టపద్యములలోఁగొన్నిమాత్రము.)

సీ॥ కాళిదాసుని మార్గ గరిమంబు నెఱిఁగినవా రంచు మిమ్మెంతు ధీరులార
భవభూతి యనుమహాకవిమార్గ మెఱిఁగినవారంచు మిమ్మెంతు ధీరులార
పండితరాయలదండితన మెఱుంగువా రంచు మిమ్మెంతు ధీరులార
ఆంధ్రకవీంద్రనిరాఘాటత నెఱుంగువా రంచు మిమ్మెంతు ధీరులార
తే॥ గీ॥ పల్కనైపల్కఁ డెప్పట్లఁబండితుండు,తల్కనానిల్పునే గాని భయము గొనఁడు
ఇదియె విద్వత్కవీంద్రుల కింపునింపు, మార్గమని మీ రెఱుంగరే మహితులార.
సీ॥ మాకపకీర్తి సంపాదింపఁగా నెంచి దేశమాతకు దూఱు దెచ్చినారు
మాకప్రతిష్ఠ సంపాదింప నెంచి కృష్ణను నప్రతిష్ఠచే నడిపినారు
మాకు దుష్కీర్తి సంపాదింప నెంచి కేసరిని దుష్కీర్తిపాల్పఱచినారు
మాకు దుర్యశము సంపాదింప నెంచి యాంధ్రపుఁ బత్రికకు నదితార్చినారు
గీ॥ ఎందఱో "యథార్థవాదు' లిం కెందఱేని, సత్యవాదులిప్పరమున జననమంది
నారు శివరామశాస్త్రి యీనాఁటికి శివ, రాముఁడయ్యె మాకేలకొప్రంపుఁజెలిమి.
సీ॥ సఖ్యపఱచి మమ్ము సాగనంపుటకు మీచేయుయత్నము గడు శ్రేష్ఠ మయ్య
సాగనంపక మున్నె చనువాగమే కాని చుట్టుపట్టుల నుండుసూరివరులు
సభలు చేయుటఁ జేసి చనకిందు నిల్చితి మంతియే కాని సభాంతరమున
కింకను సోదరు లేతెంతు రని కాదు గాయత్రి సాక్షి నిక్క మ్మెఱుఁగుఁడు
తే॥ వారి సేమంబు గోరినవారు గాన, సంశయించుచు నున్నారు సకల మెఱిఁగి
నట్టిమాకడ డాఁచ నేలయ్య! వారి, వదలి చిరకాలమయ్యె సహృదయులార.
సీ॥ వ్రాసి యుండంటిరే? వారితోఁ బోరాట మాని కొంటిమటంచు మాన్యులార
వ్రాఁత వ్రాసిన యంత నే తప్పిపోవునే! కాల్ద్రువ్వువారి బింకంపుఁగంపు
కాల్ద్రువ్వ బెట్టిరో గనఁ గొన్నపైఁ గాని నిదురఁబట్టదు మాకు నిక్కమయ్య
యీయూరఁ గాకున్న నేయూరనైన మీసమ్ముఁ బీఁకుట చూచి సఖ్య మంతఁ

గీ॥ జేసి విశ్రుతుము మామీఁద సీసు గొనకుఁ, డనఘులార! దెబ్బను దిని నట్టిపులికి
నూరుపెట్టులబ్బు మీరెన్ని యోర్పు మంత్ర, ములను బఠియించు రేసియు ననఘులార.

సీ॥ పుట్టుపుట్టునఁ జిట్టిబుట్టు లచ్చొత్తించి పట్టణంబునఁ బంచిపెట్టునాఁడు
"కాంపిటీషు" నటం చెకాయెకీ నరుదెంచు ప్రజలకోరిక భంగపఱచునాఁడు
అక్షరతత్త్వ మావంత తెలియంగక మీన లాగిఁ బట్టియయ్యాల లూఁగునాఁడు
ఎఱుఁగని వ్రాఁత లేవేవియో గిలుక్రుచుఁ "గుచమర్దనములు" పేరొక్రనెడునాఁడు
గీ॥ మీర లేమైతిరో కొక్రా! యిమ్మోయిని జేయి, కాలుమీఁద నాకులకు యత్నాలివేల
యద్భవతి తద్భవత్యేవ, యనెడిమాట, లెఱిఁగి వర్తింపుఁడయ్య యింకేటిసంధి.

సీ॥ సత్యవాదియెవరో "జంట్లిమన్" పదవాచ్యుఁ డేయంటఁ! యాసూరి నెఱుఁగుఁడయ్య
అతని జ్యేష్ఠభ్రాత యగు "యథార్థప్రవాది" గూడ నట్టిఁడె యంట! చూడరయ్య
ఈ యవతారమ్ము లెత్తువారల రసనాంచలమ్ములకు భర్మాంచితములు
భూషణమ్ములు దెచ్చి పొల్పుగా నర్పించి వానిపై నూరేగఁ జేసి పిదప
గీ॥ సోదరులకును మాకును వాదుతీర్పఁ, బూనుఁడయ్య తరతమత్వములను బట్టి
మారుక్రల నొసఁగుఁడయ్య మీమతిశేష, మెల్లవిద్వాంసులును మెచ్చ నెసఁగుడయ్య

సీ॥ "మకక్రతోఁకను బట్టి గోదావరీఁదువా" తిరుపతి వెంకటేశ్వరులు కారు
"వేఁడినీళ్లనె యిండ్లు వెలిఁగింపఁ బూనువా" తిరుపతి వెంకటేశ్వరులు కారు
"గానమ్ముచేఁ జింతకాయలు రాల్చువా" తిరుపతి వెంకటేశ్వరులు కారు
"కంజాప్తు ధూళిచేఁ గప్పనెంచెడివారు" తిరుపతివెంకటేశ్వరులు కారు
గీ॥ పైకి రాకున్న నెవ్వరి పైకిఁగూడఁ। జనరు తిరుపతివెంకటేశ్వరులు వారి
భారతీతత్త్వమును జూచి వారవీరి। తారతమ్య మెఱుంగుట తగదె మీకు.

సీ॥ పిలువని పేరంటముల నొనర్పరు గౌరవార్థుల నవమానమంద నీరు
ధూర్తుల నైఁపరు ధూర్జటియైనను దగవుమాలినచోటఁ దగవుపెట్టి
తీరదు రూరక యేరిని గదలింప రెవరేనిఁ గదపిన "నితఁడు తగఁడు
మనతోడఁ బోర"నం చనుకోక యవ్వాని నెదిరించి తమకున్న కదనశక్తి
గీ॥ అంతయో యింతయో యర్థులైన పండి। తులు పొనర్చెడి సభలోన నిలిపికొనఁగ
బూనుదురు పక్షపాతుల పూనికలను। వినరు తామెఱిఁగిన యట్టి విషయమొయిది

సీ॥ 'సత్యవాది' పదంబు చంతాలమయ్యె నద్దానియాపద దీర్పఁదలఁపుఁడయ్య
ఆదరాపదయె 'యథార్థవాది' పదంబు గనియోఁదద్దుఃఖంబు కడపరయ్య

శాస్త్రీయమైనట్టి నరసాశు కవిత ధిక్కృతయయ్యెగెలుపోదు తెలుఁగుఁడయ్య
పదియాఱుకళల యవ్వారితో రిక్కల నైనఁజేయుపూనికల్ గొనకుఁడయ్య
గీ॥ కీర్తికాములరై కవితార్తిఁబాపి, పక్షపాతులవ్రాఁతల వలనఁ గలుగు
దేశఘోషంబు నుడిపి యుదీర్ణగరిమ! వఱలఁజెలువారుఁడయ్యధీవరులు మెచ్చ

సీ॥ లేదు శాస్త్రజ్ఞత లేదు కావ్యజ్ఞత సంస్కృతజ్ఞానలేశమును లేద
శబ్దమంజరిఁ గూడఁ జదువంగలేదయ్యె నదియట్టులుంచుఁ డింకాంధ్రమందు
లేదు వ్యాకరణంబు లేదుపాండిత్యంబు లేదు సారజ్ఞత లేదు శిష్యు
లకు భారతాదుల నొకపద్యమేని పాఠముఁ జెప్ప శక్తి నిక్కముగ నేరి
గీ॥ కట్టియయ్యలు మమ్మాంధ్రమందు నెట్టి! మీసములు పీఁకుటకు నెట్లు మీసములు మ
హాత్ము లొప్పుదురో? తెలియంగవలయు, సభనునమకూర్చుఁడయ్యా యశస్స్వలార

సీ॥ తాఁ జెప్పినట్టి పద్యమునకే నర్థమ్ము చక్కఁగాఁ జెప్పఁ జాలుఁజుండు
తా నుచ్చరించు పదములకే నర్థంబు చక్కఁగాఁ జెప్పనఁ జాలుఁ జుండు
కవనంబనఁగ నేమొ కవు లున్న సభలోనఁ జక్కఁగా జెప్పఁ జాలుఁజాఁడు
పద్యమ్ములటులుంచి గద్యమేయనుకొండు చక్కఁగాఁ జెప్పనఁ జాలుఁజుండు
గీ॥ ఆంధ్రమంతయు వల్వదచ్చాంధ్రమైనఁ, జక్కఁగనుపన్యసించినఁజాలుఁజుండు
మేమువదలెద మూరకే మీసముల మ! టంచు మీసముఁ దలపెట్టు టర్హమగునె.

సీ॥ మచ్ఛిష్యుల నటుంచి తచ్ఛిష్యులకుఁ గూడ శుశ్రూష జేసి నేర్చుకొనఁదగిన
పాటిపాండితి లేనివారు మామీఁదికి వచ్చి కాఱులు వ్రాసి హెచ్చుతగ్గు
లెఱుఁగక మీసాల నెత్తి పీఁకెద మన్న మాట కేమర్థంబు మాన్యులార
శాఖాభిమానపిశాచంబు వైదుష్య మీ నేర్చునయ్య యహీనులార
గీ॥ తగినమందులు పక్షవాతమ్మునకు ల! భించుఁ బక్షపాతముకు లభింపఁ బోవు
"కొఱవిఁబెట్టి నెత్తినిగోఁకికొనియు,,నిప్పు! డేటిరాజీలు మా వారి కెఱుఁగఁ జెప్పుఁడి

సీ॥ ఆంధ్రమ్మునందేని యష్టావధానంపు నామ మెత్తఁగ వీరి కేమిహక్కు?
శతవధాన మ్మనుశబ్దంబు నెత్తంగ వీరిదే యూరయ్య వేత్తలార?
నేత్రావధానమ్ము నిగమజ్ఞులదికదా! దానిపే ర్వీరలెత్తఁ దగునయ్య?
నిజమైన శక్తియుండినఁ "బండితులుగల్గు సభ" యన్నయంతనే జాఱుకేటి
గీ॥ కయ్య! వారుమన్నించు టాశుకవిత! యంద యుక్త మామాత్రమేయైన మేము
విశ్వసింపకయున్నను విశ్వమెల్ల! నమ్మతించుట కొంతేని సంభవించు.

సీ॥ "ఆశుకవిత్వమ్మనందేని మీ రేల విశ్వసింప" రటంచు వేయఁ బ్రశ్న
కుత్తరమ్మాలింపుఁ డూరకే యెల్లెట్లొ "బడబడ" వాఁగునప్పట్టునందు
నేరేనిఁ జాలుదు రేషూనవుబో దాని మెచ్చిన నా మెచ్చు మెచ్చు గాదు
పండితులగువారు "పకపక"నవ్వుదు రవ్వారు నవ్విన నాశుకవిత
గీ॥ అందు వేరొక్క నామంబునట్టిదాని, కెవ్వఁడీకొను "నిహిహిహీ! యిహిహి, యిహిహి
యిహిహి," యనిపండితులు నవ్వనిట్టిపూన్కి గొనరు విద్వత్కవులుగ నుంగొనుఁడు మఱియు

సీ॥ కట్టుఁబాటులు గల్గు గానంబె గానమో? కట్టువీడినదియే గానమొక్కొ?
కట్టుఁబాటులు గల్గు కాంతయే కాంతయో? కట్టుదప్పినదియే కాంతయొక్కొ?
కట్టుఁబాటులు గల్గు? కాయమే కాయమో? కట్టువాసినదియే కాయమొక్కొ?
కట్టుఁబాటులు గల్గు కవనమే కవనమో? కట్టూడ్చికొన్నదే కవనమొక్కొ?
గీ॥ మీమనమెఱుంగదే? మేరమీఱి మంచి, చెడ్డ లరయక యెన్నియో చెట్టలఱచు
వారి నేరంబు సైఁచుట పాడిగాదు, కూకలిడుఁడయ్య నతికీర్తి గోరుఁడయ్య.

సీ॥ సంస్కృతగ్రంథవాసనయె లేకున్నచోఁ దెలుఁగుగాదది పెద్దతెగులుగాని
ఆంధ్రరహస్యసైయాత్యమే లేనిచోఁ దెలుఁగు గాదది యొక్క యెలుఁగు గాని
శబ్దశాస్త్రప్రవేశము నుంత లేనిచోఁ దెలుఁగు గాదది మేనినలుఁగుగాని
నాటకాలంకారనైపుణుల్ లేనిచోఁ దెలుఁగుగాదది చెడ్డపలుగు గాని
తే॥ గీ॥ ఈరహస్యంబు నెఱుఁగనివారె మీరు, తెల్గులో నేని వీర లెదిర్చి యేమి
నేతు రనుకొంటిరో? నుంత చెప్పుఁడయ్య, సంధిసంగతికేమి యోసరసులార.

సీ॥ ఏపండితుఁడువచ్చి యివ్వారితో మమ్ముఁ దులఁదూఁచి తనకీర్తి నిలిపికొనును?
ఏకవీంద్రుఁడువచ్చి యివ్వారితో మమ్ము సరిఁజేసి సద్యశశ్శాలి యగును?
ఏ జమీందార్వచ్చి యివ్వారితో మమ్ము నెనఁజేసితా వన్నెకెక్కఁగలఁడొ?
ఏదైవతము వచ్చి యివ్వారితో మమ్ముఁ బురుడించి దీప్తినిల్పుకొనఁగలఁడొ?
గీ॥ చూచియేతీరుదుము మీఁదఁ జూడవచ్చు, సంధిసంగతుః లెల్లేని సభయొనర్పఁ
గడఁగుఁడయ్య! వేఱొకగతిగాంచఁబోకుఁడయ్య? వేత్తలఁ రప్పింపుఁడయ్య! యొయ్య

సీ॥ చెప్పింపుఁడయ్య! దేశికు నొక్కరుని బిల్చి చదువునందెలు మనశగ్న కింక
చేయింపుఁడయ్య! యీప్రాయమందున నె శుశ్రూష కావ్యజ్ఞు నిచ్చోట నిల్పి
మాన్పింపుఁడయ్య! "డమాడమాడమడమల్" "పాశ్జీ లీపోకలొప్ప" రని చెప్పి
బోధింపుఁడయ్య "యీబుడబుడక్కల" "కాశుకవితాప్రశస్తి దక్కం" దని నొకిటి

గీ॥ మీకు యశ మబ్బు వారికి మేలుగల్గు, మమ్మెదిర్చినపనికి లాభమ్ము వెంట
నే కనంబడు మాకెంతయేని మోద, మబ్బు సంధియు నామీఁద ననుఘటించు.

సీ॥ వైదికలౌకిక వైషమ్య మెవ్వారు తెచ్చిపెట్టిరో? నూఁత తెలియుఁడయ్య
ఆత్మగౌరవమునకై పాడుపడువారె దీనిఁబెట్టుదురు సందేహ మేల
తగుగౌరవంబు విద్వత్తకుండును గాని యన్యమ్మునకు నుండ దనుట ధ్రువము
గానఁ "దదన్య లీకక్షకుఁ గారకు" లని యెవ్వరేనియు ననకమాన
గీ॥ రకటా? విప్రులు, దేవాంగులట్లు వశ్య, తో హరులయట్లు వెలివెట్టి త్రోవఁబోవఁ
గావలెనె? దీని మానుపఁగ డఁగుఁడయ్య, సంధి గోరుమీ కియ్యది చనుఁగదయ్య.

సీ॥ ఆంధ్రభారతకర్త యైనతిక్కనసోమయాజిజన్మస్థానమైనకతన
శ్రీనాథకవిరాజశేఖరు నేలినకొండవీటికిఁ బ్రక్క నుండుకతన
ప్రాకృతంపుఁగవుల సంభావించుగద్వాలరాజ్యంపుఁ దోవలోఁ గ్రాలుకతన
వెనుకకాలమునందు వినుతింపఁ దగుపెద్ద విద్వత్కవులు దీన వెలయుకతన
గీ॥ నింతకవితాదరంబు మీ కిచ్చె మెచ్చ, వలదె గుంటూరిపురిని విద్వత్కవీంద్ర
జనని, కేవలకవితిరస్కారిణి, దీని, మహిమ మెంతేని శ్లాఘ్యంబు మాన్యులార.

సీ॥ నిందింపనేమయ్యె? నిజమైనసత్కీర్తి గలిగించు "సత్యవాదులు" గలారు
గర్హింపనేమయ్యె? గణుతి నర్పించుయోగ్యు లగుయథార్థ వాదులు గలారు
కయ్యాలకేమి? సత్కవికదంబములపై ర్వెలయింపఁగలనియోగులు గలారు
అభిమానమున కేమి? యాత్మీయకతన శత్రులఁగూడ మన్నుమాన్యులు గలారు
గీ॥ ఏరిచే మెచ్చుగొనదు గుంటూరిపురము, నగనతకుఁ దావు బలువన్నెనిరుల ప్రోవు
మీకు మీప్రోలికిని మేరమీఱునిరుల, నిచ్చు భగవంతుఁ డింకమ మ్మెగ నిండు.

సీ॥ ప్రేమించితిమి మున్నె పెద్దతికము నిల్పుకొన్నచో వారి కేకొఱఁత రాదు
వారిసేమముఁ గోరువారె "యాదవకుల మునకు ముసలము" నానసపుఁ జర్చ
కల్పించి రదిపూర్వకవిసమ్మతము గామి మాకు సంగీకృతి లేక పోయె
దీని నామీఁద వైదికనియోగపుఁగక్షగాఁ బోల్పి రెవ్వరో ఘనులు వారి
గీ॥ నెఱుఁగుఁడయ్య! 'యనవసరమిట్టి కక్ష, లింపుగాఁబో'వనుచు మందలింపుఁడయ్య
యెవరు వైదికులు? నియోగు లెవ్వరి? రొకట, విప్రులే గారటయ్య! యోవేత్తలార.

సీ॥ ఘనుఁడు వయోవృద్ధఖండపాండిత్యభూషణుఁడు సీతారామశాస్త్రికన్న
సుభయభాషాకవితోపాయశాలి శిష్టాహనూమచ్ఛాస్త్రికన్న
కృతి యభినవసరస్వతి నేత పట్టాభిశబ్దపూర్వక రామశాస్త్రికన్న
ములుకుట్లకులుఁడు నిస్తులుఁ డాశుకవి గుణశాలి వెంకటకృష్ణశాస్త్రికన్న
గీ॥ మఱియునుంగలశాస్త్రవిద్వాంసులకన్న, మొలచిన వెకొమ్ములితరుల మోములందు?
నవసరము లేనియాసనం బడుగనేల?, చర్చ పెంచఁగనేల? యశస్వులార.
సీ॥ వేదవేదాంగాదివేత్త చేవలివెంకటకృష్ణశాస్త్రుల కెన యన్యుఁ డగునె?
రామడుగుకులుండు ధీమన్మణియు రామకృష్ణశాస్త్రులఁ బోలనెవని వశము?
కంఠపాఠము నాటకములెల్ల శ్రీనోరి హనుమద్బుధుని కెవ్వఁ డగును దీటు?
అతిశాంతమూర్తి సాహితిపట్టు శ్రీపార్వతీశశాస్త్రికి సాటి యొరుఁ గలఁడె?
గీ॥ మఱియు నెందఱు లేరు ధీమంతులందు, వీరిలో నేరు కొవ్రింపువారు చెప్పుఁడ?
వారికేయాసనంబును గోరనేల, చర్చ పెంచఁగనేల యశస్వులార!.
సీ॥ కవి హూణభాషావగాహి వంకిపురవంశజుఁడు శ్రీకృష్ణమాచార్యకన్న
బలిజెపల్లి కులసంభవుఁడు కవిత్వవిస్ఫూర్తి లక్ష్మీకాంత సుకవికన్న
సకలకళానైపుణికిఁ దావు మేటి మల్లాది వెంకటసోమయాజికన్న
నాలువేలనియోగి యనఘ జూపూడివంశజ హనూమచ్ఛర్మశాస్త్రికన్న
తే॥ గీ॥ మఱియునుంగల సత్కవిమణులకన్న, లౌకికాగ్ర్యులకన్నను లాఁతివారి
కాసనము గోరనేలయ్య! యనుచితముగఁ, జర్చపెంచఁగ నేలయ్య సరసులార?
సీ॥ శొంఠి భద్రాద్రిశాస్త్రులవారిశిష్యుండు తచ్ఛైలి గలకైత దనరు సుకృతి
"అవధాన మేఁ గూడ నాచరించితి నని స్వయముగాఁ జెప్పికోఁజాలుధట్టుఁ
డొకశైలి నేకాక ప్రకటితంబుగఁ బలుశైలులఁ గవనమ్మొనలుపు జాణ
ఎపుడు రచించినట్లే కనుపట్టకే పలుకృతుల్ ప్రకటింపఁ గలయుపాయ
గీ॥ శాలి బ్రాహ్మణప్రభు వనాచారపరుఁడు, ప్రథితమంత్రిప్రగడవంశభవుఁడు శ్రీభు
జంగరాయలకేల యాసనము నడుగ?, రొరులు వీరికి మిన్నలే యోగ్యులార?

మ॥ పటుజంఝానిల ధోరణీరణరణత్ప్రాగ్భారసన్నాటవీ
తటశాఖాపటలాంతరుద్గతనితాంతస్ఫారఘోరాగ్నిరు
ఘ్ఘుటనాధూపితభస్మసాత్కృతకురుటాండంబుతో వహ్నికిన్,
ఘటియింపం దలపెట్టినారు కద! సఖ్యం బార్యచూడామణుల్.

మ॥ స్వకృతాగఃప్రకర ప్రచారనిహతాపారస్వయోధ ప్రజా
నికరాత్మైకశరణ్యసర్వధరణీ నిర్ణేతృతాభాగ్యబా
రకృతాహంకృతితో సుయోధనునితో భ్రాజిష్ణునిన్ ధర్మపు
త్రికునిన్ గల్పఁదలంచినారె? యిది ధర్మ్యం బెట్టు లోహో! హితుల్.

సీ॥ "గర్వం"బనెడి మిష గల్పించి దుఃఖంబు దీర్చుకో నుంకించు ధీరుఁ డొకఁడు
"పండిత లక్షణ" ప్రస్తావమిష చేతఁ బడదిట్టునట్టి సర్వజ్ఞుఁ డొకఁడు
"వంటబాపనికుత్సవం"బంచుఁ గల్పించి రసఁ బేరుగనుయశో రాముఁ డొకఁడు
"రామేశ్వరీయ"మన్నామంపు పొత్తాన బూతు లేకరు వెట్టుపుణ్యుఁ డొకఁడు
తే॥ గీ॥ మఱియు నెందఱొ శాఖాభిమాను లిట్లు, బయలు దేఱిరియింక నుబయలు దేఱఁ
గలరు కీరితి చేకూర్పఁ గలరు సంధి, కొప్పరపు వారి కేటికిఁ జెప్పుఁడయ్య.

సీ॥ "ఈలకూరకుఁ బోయి యిల్లటం బున్నట్టు"లయ్యె మావర్తనం బార్యులార!
అలపాశుపతమహాస్త్రాగ్ని హోత్రజ్వాల లాఁగిపోయెను దీన ననఘులార!
కాఁకరపర్తి "శృగంపుభంగపు" వ్రాఁత లడఁచుపూనిక దీన నడుగుఁబట్టె
చర్ల నారాయణశాస్త్రి "బార్హస్పత్య" మరియు వేదుక దీన నంతరించె
గీ॥ గీరతము సారెకుం గోరు గీరతులకు, తూహలమ్మునకించుక దొడరె విఘ్న
మికఁ బ్రతమ్మన, నిఁక నింటి కేగ నాజ్ఞ, యొసఁగుఁడయ్య గుంటూర్పురీయోగ్యులార.

సీ॥ కొప్రింపువారు మాకుఁ గనిష్ఠు లవ్వారి కరయఁగా జ్యేష్ఠుల మగుదు మేము
కొప్రింపువారు మాకు సుశిష్యు లవ్వారి కరయఁగా నొజ్జల మగుదు మేము
తత్కవిత్వంబు "నదరు మరాటా రైలు" "మదరాసు రై"లయ్య మాదు కైత
మిత్రుల నవ్వారు మెప్పింతు రేము శత్రులఁగూడ మెప్పింపఁ గల మొకింత
గీ॥ వయసుకా! పెద్దలము మేము, వారుపిన్న, లింతియే భేద మింతకునింత కలహ,
మెందులకు? స్నేహితులమైతి, మింక మీరు, శంక దక్కుండు సెలవు నొసఁగుఁడు మాకు



క॥ ఉరుకీర్తి నరసరాట్పుర, 'వరవాసుఁడు వంగనామవంశ్యుఁడు సుగుణో
ద్ధురుఁడు నరసింగరావప్పరమునకున్ మమ్మును స్వయముగఁ దాఁబిలిచెన్

తే॥గీ॥ అతఁడు శాఖాభిమానుల, కహితమైన, పనికిఁ బూనిన కతన నప్పట్టణంపు
శాఖలోని గుణాఢ్యులు సాగకుండఁ, జేయవలె నని యత్నంబు చేసి రంబ,

ఉ॥ *ఆపురికేము రేపు చనునట్టికుతూహల మూనియుండ నే
పాపియొకాని యయ్యన ఘుపజ్జకుఁబోయి "వృథాప్రయత్న మే
లా పొనరింతు? విప్పరికి నల్లకవుల్ చనుదేర ఖ్యాతి లో
దాపర మయ్యె వారి" కని తా నొగి బొంకి కలంచె నాతనిన్. ౨౦౦

చ॥ కలఁకు ప్రసిద్ధ వంశ్యుఁ డరికాండము నైతము మెచ్చఁ వర్ధి
బలమున కిక్కడ యా "పయిడిపాటి" నివాసి, యశస్వి త్యాగి వి
ద్యలకు నిధాన మంబ? కవితా వనితా హృదయంగముండు పే
ర్వెలసిన "రామరా" వనెడి బెల్లముకొండకులీనుఁ డున్నతిన్. ౨౦౧

---

*(నర్సరావుపేట శతావధానపీఠికనుండి.)

...నర్సరావుపేట.
ది 30-9-11

నాప్రియమైన ఆర్. హనుమయ్య గారికి— శ్రీ "తిరుపతి వెంకటేశ్వరకవీంద్రుల"నిక్కడకు దయచేసి వారి కవితాసైపుణ్యమును జూప నిక్కడకు రమ్మని యావాహన జేసియుండుట మీకు తెలిసినవిషయమే కదా; వారిని ఆవాహన చేయుటకు తగుప్రయత్నములన్నియు సిద్ధపర్చుకొని యున్నాము. నోటీసులు పంచిపెట్టి సొమ్ముపసూలుచేసి పెండాలువగైరా సిద్ధముచేసి యున్నాము. వారురేపిక్కడకు వత్తురని నిరీక్షిస్తూయున్నాము. అవధానము రేపు 1 గంటలకాయితు ఆరంభమగునని నోటీసులలో ప్రచురించినాము. ఇక్కడ శతావధానమే లేదనియు, యిది యంతయు నబద్ధమనియు, పి. నరసింగరావు నవరుకవులను మోసగించదలచినట్లున్న, ఎవరో వారితో చెప్పియున్నట్లు,వినుట మిక్కిలి విచారకరముగా నున్నది, అట్టిమాటపేమెన్నడు తలంచ లేదనియు, యీశతావధానము కైపూనినవారందఱు మరియానగల పెద్దమనుష్యులనియు, మేము రూఢిగా చెప్పుచున్నాము. అవధానమిచ్చట జరుగుట యిష్టములేనివారలు పన్నినకుట్రమాటలై యుండునని మేముతలంచెదము. ఈవిషయమై మేమింక వ్రాయవలసినయవసరముండదు. నదరు విద్వత్కవుల మనస్సునగల సంకోచము మీరు నివర్తించకోరుతాము, రేపుదయం 9 గంటల రైలుమీద వారు యిక్కడికి దయచేయవలయును. ఈ వుత్తరంతెచ్చినవారు ప్రత్యేకించి వారినిక్కడకు తీసికొనివచ్చేనిమిత్తం

చ॥ అతనికి మాయెడన్ మఱియు నాయనయందున మాకు విన్క్రియై
నతితరమైన "సేర్మి యలరారెడి నప్పురిలో వధానమున్
గుతుకముపై నొనర్చి కనుఁగొంద మటంచుఁ దలంచుచుంటి మ
ట్టితఱిని బెట్టె నొకక్రొఁడు కడిందిగఁగయ్యము దయ్యముంబలెన్. ౨౦౨

---

పంతబడిరి. రేపు వారు ఇచ్చటికి రానియెడల మాకవమానకరముగా నుండును, దయయుంచి వారు రేపు బయలుదేరులాగు చేయకోర్తాము. ప్రస్తుతము గుంటూరులో యితరులు "శతావధానము" చేయుచున్నను, వీరిప్రఖ్యాతి యిదివరకే లోకములో పాదుకొనియున్నది. కాబట్టి దానిని లక్ష్యము చేయక తప్పకరా గోరెదము.

ఇట్లువిధేయులు
ఆర్. కృష్ణమూర్తి.
పి. నరసింగరావు.

ష.రా.—(ఇంగ్లీషు వుత్తరమునకు సరియైన తెనుఁగు.)

---

చంపకమాలిక॥ "భయపడినారు రా" రనుచుఁబల్క్రిన వాఁడెట? యెవ్వఁడో
మహాశయుఁడు భవత్సమీపమున; జం కనునట్టిది మాకుఁ జెప్పదుర్ణయుని క్షమిం
చుతావక ఘనత్వము శ్లాఘ్యము "సత్యవాది" దుర్ణయము, "యథార్థవాది" యపరాధ
ము,నింతకుమున్ను పత్రికల్,స్వయముగ వెల్లడింపఁగని వారలవారణ మెట్లటంచు
న్నా,మాయెదియుఁదోఁపకేవగచునన్మదఖండరుషాగ్నికీలక్,వ్యయితదురూహదుర్ణయ
ములాజ్యము గాపుటకించుకేని సందియమును గల్గునే!యకట!తిర్పతివెంకటశాస్త్రు
లెందుకో?, భయపడుటల్; రిపుల్ మునుపె పాఱిరి మాఱిరితోఁచినంతయున్,నయ
మొకయింత నేరనియనాథలు వాఁగుట తప్పనస్యమే,దియుభయకారణం బరుగుదేర
చు వారలనోరుమూయమీ,కెయనఁగనేల! రుద్రునకునేని యశక్యమె? దేవుఁడెందు
ని, శ్చయముగ లేఁడ"టంచనెడి సాహసులన్ భగంతుఁడేని యే,మియు నొనరింప
నేర్చునె! యమేయునకేనియసత్యవాది దుర్జయుఁడె స్వయంకృతమ్ములపరాధము లే
తుదిరాపుమాప్రచో,గయకరుగన్ వలెన్ దురితకారకులో యొఱకుల్;తదీయనిర్ఘయత
శవర్తనంబడఁతరా పరివృద్ధికి వచ్చుటే ?నఁడీ, యయ యొనఁగూర్చు నజ్జనుల; కద్ది

చ॥ కలహము పెట్టుమానిసియు గవ్వకు మాఱెడివాఁడు గాఁడు పై
నెలమిని వాని నూఁత గొని యెన్నియొ ముగ్గులు వెట్టుచెట్టు నీ
డలమురిపంపుజీవన పుఁడెక్కురు లాతని పాటి వారెయ
య్యలఘుఁడు రామరా వొకఁడె యాఢ్యుఁడు సర్వవిధాల నంబికా. ౨౦౩

---

రా! పైకి నమస్కృతుల్ మృషాప్రియములు పల్కుచు నెలువుఁ బ్రేలుసు మాటిచిమాఱ నేర్చు సంశయశముకోసమై మిగులఁ గష్టమొనర్చెద నంచు వాఁగు నిర్ణయము సమస్తముం దెలిసి నాస్తికుఁడై యనృతమ్ము లాడు గో, మయజల సేచనాఢ్యుఁడగు మానవుఁ; డాయవివేకితోడ నాభయరహితాత్ముతోడ నలపాతకపుంజముతోడ నట్టి సంశయలవశూన్యుతోడ నలసాహసికాగ్రణితోడ నట్టిమృణ్మయయశుతోడ నట్టి పితృమాతృవిరుద్ధునితోడ నట్టియామయముఖుతోడ నట్టిఖలమాన్యునితో నటువంటి జెట్టతో, నియతదురాశుతో జితమనీషివరేణ్యునితో నపాత్రుతో, నియమితలజ్జతో నెవఁడు నేర్పుఁ బెనంగఁగ; మిమ్ము వంటివారియశమునందె యెట్టులో పరిశ్రమ చేసి కళంకు నిగప నిర్దయుఁ డాయతించెఁగా! అపుర! దంభ, మహో యవివేక! మార! దుర్ణయ, మఘరాకుతంత్రి! మవురా! కలికాలము! పతిక్రామహా, శయులను బోలె మిమ్ముఁ దన సంచిని నించఁదలంచెఁగాదు రా, మయుఁడు; మయుండు పన్ను నలమాయలు వన్నెడివీని సాహసో, దయమిటు లేప్రివృద్ధిఁగ నితద్దయు వానికిఁ జేటు దెచ్చుఁగా, కయతనితోడనేమి! కటకంఠుఁ దెదుర్పఁగ వచ్చెనేని యుణ్ "భయ,, మనుమాట మాగృహాము వజ్జ వసించెడికుక్కకేని లే, దయుమొనఁ గూర్చు కాళికజయంబె వుడుణ్ సమహార్చితీరు దుర్ణయులుహతాశులై చెడి యనాథవివాహపుమంగళధ్వని, ప్రియముఖులై యడంగుదు, రుపేక్షయొనర్చుటె మేలు వీరిపై, నియ్యఁకమటెంత కాలమునశింపక నిల్చును? చూత మోమహో, దయ! నరసింగరాయ! మమతణ్ ముముఁ బిల్చిన మిత్రునిన్నునె, మ్మొయిఁగి కురింతు! మెవ్వఁడో యమేధసుఁడే మన నేమి యాదురా, శయులు నశింతుని గాక విలసద్యశమబ్బెడుఁ గాక నీకు మా, కయి శ్రమ చేసినందులకు నంబిక నీకు శుభమ్ము గూర్చి మా, జయము నకొక్కకంబముగఁ జక్కఁగ నిల్పెడుఁ గాక యిప్పరిణ్, సీ॥ స్నేహితుల్ పిలిపించి చేయించునభకంటె శాత్రవసభయే యశస్క్రవదంబు, జయము గోరెడి సభాసదులకంటెను బరాజయము గోరెడి సభాసదులె హితులు, నీరసప్రశ్నముల్ గోరువారలకన్నఁ గఠినసంప్రశ్నకుల్ కరము హితులు, స

క॥ అతఁడింట నుండియే తం, డితులం బిలిపించి విద్య నేర్పెన్ శాస్త్ర
స్మృతిముఖ్యానంతప్రాకృతకళా, గతి ననవృషుఁ డంతెకాదు కవితాన్వితుఁడున్
తే॥గీ॥ నరసరావుపురి శతధానంబుఁ మొదట, జరిగె నందునొకానొక జనుఁడు రాము.
రాకు పడిగి సమస్యవైరంబుక తనఁ, దెచ్చి మాకిచ్చె నదిమాకు నచ్చ దయ్యె. ౨౦౫

---

# నరసరావుపేటశతావధానము.

ఉ॥ మాకొక కొక్క బ్రహ్మను సమస్తకళాకరు సృష్టి చేసి యా
వ్యాకరణామృతాంబుధికి వారిదముల్ పొనరించి మమ్ము; మా
స్వీకృతశిష్యులన్ నదులఁజేసి యశం బనిశంబు నించి లో
లాకలనంబునన్ నరసులన్ దనియించుపరాంబ నెంచెదన్.

ఉ॥ రెండవసారి యర్జునుఁ డరిందమయాత్రకు నేగుపట్టునన్
ఖండనమందు గాండివము పార్థునిహస్తమునుండి జారిన
ట్లొండొక చో స్ఖలద్గతియు నుండిన గెలిమొనర్పకుండు మా
చండిక వచ్చి వెంబడినె సర్వము నిర్వహణం బొనర్చెదున్. వెం॥ శా॥

ఉ॥ "ఎందులకై జనించితిరొ యేపనికై మఱి పూనియుంటిరో
అందులకై శ్రమఁబడక యందును నిందఁ జరించుటేల" యం
చుం దరిలేనినీదయను జూపఁగ నెంచితి వోమదంబ! యీ
చందమున గావధానములు సాఁగఁగ నిమ్మటులేని యీశ్వరీ. తి॥ శా॥

సభ్యులిచ్చినకల్పన.

సీ॥ చుట్టుపట్టులనెందుఁ జూపట్టదే సింగ మని మనంబున ధైర్యమును వహించి
జంబుకమ్మొక్కండు జంకింతయునులేక గర్జించె నఁట! "సింహగర్జిత"మని
ఆనమోపస్థకుంజాంతరమ్మున నిద్రఁ గనుచున్న యొక్క సింగమ్ము కన్ను
లర విచ్చిచూచినయంత నే యానక్క వీఁక యంతయుఁ జెడి తోఁక ముడిచి.

---

మ్మౌన మొనరించు సజ్జనావళికంటెఁ బడఁదిట్టువారె యాప్తవ్రజంబు తే॥ గీ॥ మాకనుచు నెంచు లోకనమ్మతులె కాని, "శతుఁసభ" యంచు మదిలోన జంకిపాఱు, వంచకశతావధానులవంచలోని, వారు తిరుపతివెంకటేశ్వరులు కారు. (తి॥వెం॥)

తే॥ గీ॥ పాఱిపోయెను "సింగమే పాఱిపోయె, నంచు నవ్వంగఁ జొచ్చె యథార్థవాది
సత్యవాదియనౌచు నిచ్చలును గడఁగి, యిట్లెగా! శక్తిహీనులమొత్తములకట. ౮

## సత్కవిత్వము

శా॥ సారాసారవివేకముల్ గలిగి శాస్త్రప్రక్రియాధురంధరులై
పేరుంగాంచిన సత్ప్రబంధవితతిన్ విన్నాణమౌ నయ్యలం
కారాదుల్ గనుపట్టు మోద మిడు, సత్కావ్యగ్రంథముల్ మెచ్చు, రే
వోరీతిన్ జెడుగుబ్బ గూయ నదివిందుల్ సేయునే యేరికిన్. ౯

## పృచ్ఛకుఁడిచ్చినకల్పన—కవిరాజవిరాజితము.

తిరుమలలో నలదేవుని భక్తులు తేఁకువమై నెటు పూజలచేఁ
బరమమహోత్సవముల్ పొనరించుచు భక్తిమెయి స్తుతియింతు రటుల్
తిరుపతివెంకటనాముల మమ్ములఁ దీరికమైఁ బిలిపించి మహా
దరమున నూఁదున నేఁగఁగఁ జేసిరి తద్దయుఁ బౌరులు నర్సపురిన్. ౨౬

## చిల్లపెంకు.

సీ॥ ఎద్ది దా నీటిలో నెగురవైచినయంతఁ గప్పగంతులు వైచి గుప్పచుండు
నెద్ది దా వీథిలో నేగుచోఁ గాలిలోపలఁ గ్రుచ్చుకొని బాధపడఁగఁ జేయు
నెద్దానిఁ బొంకఱచో నెగిరి తిట్టుచు ముసలమ్మలు మడినీళ్ల గుమ్మరింతు
రెద్దాని బాలురెంతేఁ బొంకఱుడుంబిళ్ళయాటలో నుపయోగమనుచుఁగొందు
తే॥ గీ॥ అట్టిచిల్లపెంకుదరినిబట్టి బీఱ, పాదు చేఁదుబీఱను పేరఁ బరఁగుచుండు
దానివర్ణించుచును గవితనురచించు, వారికవనంబు చేఁదుగావలయు నేమొ. ౨౧

## దశావతారములు-

క॥ జలచరకూర్మవరాహా, మలనరసింహావటురామమానవరామో
జ్జ్వలబుద్ధకలికిమూర్తిన్, దలఁచెద నే నాదశావతారున్ ధీరున్, ౨౮

## రాజు — కవిరాజు.

ఉ॥ ఆతఁడునన్నరసార్థి, యితఁ డన్నను నన్నరసార్థి, శ్లోకసం
పాతమనోహరుండతఁడు, పద్యస్తుతవృత్తమనోహరుండు వి
ఖ్యాతుఁ డితండు నట్టిఁడ తగన్ బరిశీలనచేయ నిద్ధరా
రాతినృపాలుఁడున్ సుకవిరాజు సరానరివారలేక ౨౬

ఇప్పటికొండవీటిసీమవైఖరి.

శా॥ జొన్నన్నంబులు పోయె నెల్లరకు మెచ్చుల్ గొల్పుపేల్ రాజనా
లన్నంబు ల్లభియించె మిన్నయగుగోఁగా కన్నఁ గర్వమ్యో సం
పన్నంబై తగుహూణపాలనము సంప్రాప్తించు నీకాలమం
దన్నా! జార్జినృపాల! నీకుకృప నెంతైశ్వర్య మింకబ్బునో. ౨౭

శార్దూలమార్జాలములను గూర్చి.

శా॥ చాలల్, కన్నులుఁ, గూరుచుండుగతి, మార్జాలమ్ముగా నొప్ప ఝం
కారంబుల్ గనుకొన్న మేనిపటిమన్ గన్గొన్న భేదించు బల్
ఘోరాకారము గల్గువ్యాఘ్రములు గైకొన్నట్టిశౌర్యంబు మా
ర్జారంబుల్ పొనరింప నేర్చునెటు లోజన్ జచ్చి జన్మించినన్. ౨౮

(అవధానాంతమున, ఇతరులుచెప్పిన పద్యములనుండికొన్ని.)

సీ॥ ఆశుకవిత్వంబు నల్లుట జగతికిఁ జవిఁ జూపినట్టియానరసమశులు
అవధానసంపద నతిలాఘవముఁజూపి కీర్తిఁ గాంచినయట్టికీర్తియుతులు
సంస్కృతాంధ్రములందు సరిలేనిపాండిత్యగరిమగాంచినయట్టి గణ్యయశులు
ఎలమిరాజులచేత నెంతేనిమర్యాద లందియు, నందుచున్నట్టిఘనులు

తే॥ గీ॥ నౌచు నీయవధానమింపలరఁ జేసి, మమ్ముఁదన్పిరి నిండుప్రేమంబుతోడ
సుకవిశేఖరు లంచనుసూరిజనుల. పలుకు నిజమయ్యె నీప్రజ్ఞ పరిఢవిల్ల.

ఇట్లు, భువనగిరిబుచ్చిపరదేశి సోమయాజులు.

క॥ అరయంగనరసరాట్పుర, వరమున విబుధేంద్రులెల్ల బళిరేయనఁగాఁ
దిరుపతివేంకటసుకవులు, మురిపమున శతావధానమును సలిపిరొగిన్.

గడియారం వెంకటకృష్ణుఁడు.

చ॥ ఇపుడు సజీవులైన మనయెల్లరపట్ల శతావధానపున్
సువథము మాడభూషికులసోముఁడు చూపెను వెంకటార్యుఁ డీ
విపులను దత్ప్రపర్శితనవీనపు నీయవధానమార్గమున్
విపులము చేసి కైకొనిరి విశ్రుతి తిర్పతివేంకటేశ్వరుల్.

ఉ॥ ఇట్టిపథంబు చూపుటనె యొందజొ యష్టవధానులెంట కాఁ
బట్టి వధాని తైలపతివానికిఁగూడ ననన్య భక్తిపై
వధాను

మొట్టమొదల్ తదీయపదముల్ భజియించుటయొక్క లేనిచో
దిట్టఁడెయౌతఁ గైత గురుధిక్కృతిఁజేసినవాఁ డనంబడున్,

జానపాటి పట్టాభిరామశాస్త్రి,
అభినవసరస్వతీ పత్రికాధిపతి.

సీ॥ "చంద్రుఁ డెవ్వరికైనఁ జల్లగా నుండఁడా? పద్మాలభాగ్య మాపాటిగాక"
వెలుఁగేరికైనను జెలువుగా నుండదా? గుడ్డిగూబల నోముకొలఁత గాక
కలకండతీయనివలపుఁబుట్టింపదా? పైత్యరోగుల పాపఫలము గాక
కోయిలగానంబు హాయిగానుండదా? విరహులదుర్దశావిధము గాక
తే॥గీ॥ మీకవిత్వంబు మీలీల మీదుఫణితి, నరసులకుఁ గాదె కర్ణరసాయనంబు
సరసతిరుపతి వేంకటేశ్వరకవీంద్రు, లార! శాశ్వతకీర్తి విస్తారులార.

ఉ॥ కూరిచినారు మంజురసఘూర్ణితదివ్యకవిత్వతత్త్వ మే
పార ననేక కావ్యముల నందఱు ప్రాజ్ఞులు మోదమంద మీ
పేరులు సర్వదేశముల విశ్రుతముల్ వివరింపనేల? మీ
ధారణకు న్నమస్కృతిశతంబులు తిర్పతివేంకటేశ్వరుల్

ఇట్లు,
రాయప్రోలు సుబ్బారావు.

సీ॥ ఎవ్వారిశుభనామ మేప్రొద్దునుడువంగ! పాపచయంబులు పాఱిపోవు
ఎవ్వారి మిత్రత్వ మెల్లభంగుల మాకు సుఖమును వృద్ధియు సౌరిదిఁజేయు
ఎవ్వారికావ్యంబు లేవేళఁ జదువంగ నాహ్లాద మిడుచుండు ననఘఫణితి
ఎవ్వారి దర్శన మేపట్ల నబ్బిన శారదఁ గాంచినతీరు మీఱు
తే॥ఆట్టి జగదేక కవిసింహు లనఘపదులు, సరసముగ నవధానముల్ నలువఁబూని
పూర్తిగావించి మించి రీపురములోన, వారివర్ణింపఁదరమె యెవ్వారికైన

స్వయంపాకుల సీతారామమూర్తి,
బ్రహ్మశ్రీ శిష్టాహనుమచ్ఛాస్త్రి గారిశిష్యుఁడు

చ॥ పరమపవిత్రమై మిగుల భవ్యతరంబగు గౌతమీతటిన్
జరలకులాబ్ధిచంద్రుఁడును సత్పథవర్తి ప్రశాంతచిత్తుఁడై

వరభవకేశ్వరంబున నివాసముఁ జేసినబ్రహ్మశాస్త్రి భూ
సురవరుసిద్ధశాస్త్రిములు సుస్థిర తన్మతిమించి వారిప
త్త్రమున నన్నముం దినుచుఁ దత్కృతపద్యముఁ బోలిఁ జెప్పులన్
సరసకవిత్వమార్గములు సభ్యులు మెచ్చ నేర్చి వారి యు
త్తమయశముం బొందిన సద్గురుని దద్దయు భక్తి నుతించి వేగమే
తిరుపతివెంకటేశ్వరసుధీమణు లిద్దఱు ప్రాజ్ఞులై భువిన్
దిరిగిరిసర్వదేశములు దేజమెలర్పఁ గవిత్వకన్యకా
వరులయి రాజ్యపూజ్యులయి వందలువేలు ననంగరాని సొం
దరపతకాదిభూషల సుధారధనంబులఁ గొంచు నర్సరా
ట్పురమున కేగుదెంచిరి సుపూజ్యత నీయఁ దలంచు మంజనా
వరతనయా! యటంచు నభివాదన మేనొనరింతుఁ బూనితిన్

బూసుగుపల్లి లక్ష్మీనరసింహాచార్యులు,

మ॥ వితతాల్పీయశతావధానకవితా విద్యావహోరాశి సం
భృతశిష్యాంబుదవాక్సుధామృతరసప్రీతాఖిలాంధ్రక్షమా
భృతరత్నప్రతికావతంసకృతవందిస్తోత్రమాలావిభూ
షితు మావెంకటశాస్త్రి నేఁ బొగడెదన్ శిష్యస్వరూపమ్మునన్.

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.

☞ అవధానపద్యములేమి, అయ్యవధానాంతమున నితరులు చెప్పిన పద్యములేమి కడుస్వల్పముగా మాత్రమే యుదాహరించితిమి, ఇందు దివాకర్ల తిరుపతిశాస్త్రి, అనుచేవ్రాలుగల పద్యము, అష్టావధానాంతమున, వెం॥ శాస్త్రినిగూర్చి చెప్పినది. ఆయష్టావధానపద్యములను, అచ్చయియున్న నరసారావుపేట శతావధానమందే చూడఁగోరెదము. దానివెల రు 0-3-0 లు మాత్రమే.



క॥ అందుఁగల "పశ్య" శబ్దము, సందేహాస్పదమై కాక సరసతరముగా
డెందమున కుఁ దగులదు త, త్సందర్భము కతన దుష్టతకుఁ దావనుచున్. ౨౦౯

సీ॥ పృచ్ఛకుఁడు మూర్ఖుగాన నష్టేమియనక, పైడిపా డేగి మఱునాఁడువచ్చి వచ్చి
నప్పుడా రామరాట్కవి నటకుఁ దెచ్చెఁ, "దప్పెటులౌ తెల్పుఁ" డనెడి వాదమ్ము కొఱకు

క॥ గతదినమే కౌముదిఁ జూ, చితి మే మద్దానికొఱకు, శ్రీకరుఁ డలదీ
క్షితుఁ డటఁ "బశ్య" యనియుదా, హృతిఁ జూపెఁ సూత్రమందిఁ కేమన వచ్చున్,

తే॥ గీ॥ పాపి! మల రామరావల్లబలమయూరి, వాదమున కేగుదెంచి యవ్వానరమున-
దలుపు నష్టావధానంపు సమయమందు, మరల నడుగంగఁ జేసె నమ్మొఱకుచేత

ఉ॥ అంత నొకింత పూర్వమే* సమస్యను బూర్తియొనర్చి మేము సి
శ్చింతగ నుండియున్ "మునుపు చెప్పితి కాఁగద! తప్పటంచు సి
ద్ధాంతము సేయఁగా వలయు నానుడి యట్లొనరింపమేని బు
ద్ధాంతులు వైరులిక్కృతనఁ దాండవ మాడుదు" రంచు నెంచుచున్. ౨౧౦

క॥ అది యెట్లు తప్పగునొకో! త, త్పరిహాయము చూడకయె వెసన్ సాహసమున్
మది నూని మున్నుబలెఁ "ద, ప్పది" యని పలికితిమి మే మనాతంకముగన్.

ఆ॥ వె॥ "ఎట్లు తప్పసెప్పఁడీ?, యని యతివిన, యంబుమెఱయమమ్ము నడిగె మొఱకు
'ఇపుడుగాదు పిదప నీపని తీరిచి, చెప్పవార' మనుడుఁ జెయ్యుబుడిగె. ౨౧౨

ఉ॥ కౌముదిఁ జూచియుండియు నఖండుఁడు రామకవీంద్రుఁ డన్నదు
ద్దామత కోపగించి మది ధైర్యము చాలక మిన్నకుండె నం
బాపి ముగిసెనవధానము క్రమమ్ముగ నంతట రాత్రి యయ్యె నా
యామహితుల్ గృహమ్ములకు నమ్మొయి నేగిరి నంతనమ్మునన్ ౨౧౩

ఉ॥ ఏమును నింటి కేగితిమి, యేగెడునంతకె శ్రీయుత్తరం బొకం
డేమనుజుండొ తెచ్చె నట నెందును రామకవీంద్రువ్రాలు లే ౨౧౪

* శ్లో॥ యః పశ్యతి జగత్సర్వం యో న పశ్యతి సర్వతః, తావుభౌ పరమా
త్మానం పశ్యాపశ్యౌ న పశ్యతః॥ (విస్తరమునకు 'పశ్యాంపుశ్యాం' చూ)

---

శ్రీబ్రహ్మశ్రీ తిరుపతి వెంకట శాస్త్రుల వారికి,

బ్ర॥ ......... రావు వ్రాయున దేమనగా! నిన్నటి దినము శతావధాన
ములో బ్రహ్మశ్రీ ......య్య, అనునొక పృచ్ఛకుడు అడిగిన "పశ్యాపశ్యా న పశ్య

దామెయిఁ జూచి "రామకవి కంతగ ధైర్యము లేదులే"దటం
చేము మదిన్ దలంచి *ప్రతి యించుక పంపితి మల్లజాబుకున్.

---

తః" అను సమస్యతప్పని మీరు అనేక పర్యాయములు వక్కాణించి యున్నారు. ఈరోజున ఉదయము కూడా "తప్పలేదని చెప్పిన పండితుఁ డెవ"డని పండితదూషణతో ఉల్లంఘన జేసియున్నారు. ఈరోజున అష్టావధానసమయమున తిరిగి ఆపృచ్ఛకుడే ఆవిషయమును అడుగగా సభానంతరమున మీరు చెప్పిన విషయమును సమర్థించుకొందుమని చెప్పియున్నారు. గనుక మీరు చెప్పినప్రకారం తప్పను చూపించుటకు సామర్థ్యము కలిగిన యడల పండిత సభచేయించుటకు సిద్ధముగానున్నాము. అందుల కీయకొననిచో వ్రాతపూర్వకముగా సమస్యలో తప్పలేదని యొప్పుకొనుచు "సమస్యతప్ప అనిచెప్పుటయేతప్పు" అనిమీరు తెలియపరచవలయునని కోరుచున్నాము. పండితదూషణనివృత్తికొరకై యేది విధియో ఆప్రకారము జరుపవలయునని కోరెదము. సాహసముగా సభలో పండితదూషణ చేసినందుకై ఇట్లు వ్రాయవలసివచ్చినది. వెంటనే జవాబీయగోరెదము. కాలయాపన ఉభయత్ర కష్టము.

Yours Sincerely,

(ఇంగ్లీషుచేవ్రాలు.)

2-10-11

Narasaraopeta.

---

*శ్రీమత్పరదేవతాయై నమః.

మహారాజశ్రీ ......... రావుగారికి—

అయ్యా,

తమయుత్తరమందినది. అందప్రస్తుతవిషయములు కొన్ని వ్రాసినారు. మేము పండితదూషణము చేయలేదు. ఆసమయమున మాయుచ్చరించినమాటలు విద్యావిషయములు గాని పండితదూషకములు కావు. అదియటులుండనిండు. ఇది పండితవిషయముగాని తమ విషయము కారు కావున నావిషయమై తమకు జ

క॥ మఱునాఁ*డుదయమ్మొకటియు, మరల నిశీథమున నొకటి మఱి యస్లై గొం
టరు లెవ్వరో చే వ్రాలిడి, పురపురఁ బంపియు జవాబుఁ బొందరు మాచే.

---

వాబు వ్రాయుట మాకనవసరము ప్రతివాదులగు పండితులచే వ్రాయించినచో దానికి సమాధానమీఁబడును.

3- 10- 1911
నరసారావుపేట

దివాకర్ల తిరుపతిశాస్త్రి.

---

Narasaraopet
3rd October 1911

*మహారాజశ్రీ తిరుపతి వెంకటేశ్వర్లు గార్లకు.

.........రావు వ్రాయునది యేమనగా? మిమ్మును కోరినవాంశమును మాత్రము తప్పించుకొనుచు మీలో తిరుపతిశాస్త్రిగారిచే వ్రాయబడిన జవాబును చూచి చాలా సంతసించినాము. "మీరు ప్రచురము చేయురీతిని విశేషములుగలపండితులు కా"రనే ఉద్దేశ్యముతో "మీరు తెలియపరుచుకొన్న సంగతులను సమర్థించుకోగలరా"యని మిమ్మును పండితసభకురమ్మని కోరగా అట్టిసందర్భమున సభకు వచ్చుటకు పూనుకొనదగిన పండితలక్షణమునకు విరుద్ధముగ "సభనునిర్మాణము చేయుటకు పూనుకొనినవారు పండితులైతే జవాబు నిత్తు"మని పండితలక్షణము గలిగినట్లుకనుపడని యూహానుపెట్టుకొని "వ్రాసినవారివిషయము కా"దని పండితలక్షణమునకు వెలియగుజవాబు నిచ్చినారు. ఆవిషయమును తమ కేపరదేవత తెల్పినదో తెలియదు. సమయము మీరుతరి ఈప్రకారము తప్పించుకొనుచు ఛందోలక్షణ అనభిజ్ఞులగు స్కూలుపిల్లలు మొదలగువారికి మాత్రము శతావధానము చెప్పచూ పరదూషణ చేయుచుండుట మాత్రము పండితలక్షణమా? అట్టివారేపండితు లని మీయభిప్రాయమా? వారితో ప్రసంగములు గలుగజేసుకొనుటయేపండితలక్షణమా? ఇట్టిసందర్భములలో మీరు పండితులనుట కెటులదగుదురో తెలియకున్నది. "పండితసభ చేయబూనుకొంటి"మని యొకరు వ్రాయగా యిట్లు తప్పించుకొనుటవలననే "మీరుపండితులు కా"రని మాత్రముస్పష్టమగుచున్నది. మాపాండిత్యవిషయమును మీరిటుల నిరాకరించిన మాత్రమున మాకుగల్గులోపమేమియును లేదు అందువలన మీకుయేవిధమైన

తే॥ గీ॥ శ్రీరామరాజుపత్రికలోన వ్రాలు చేసి, పంపుచో నుత్తరంబీయవలయు ననియు
పట్టి "శశ్వ్యేటి, గాంధతో వాదమేల, యనియు భావించి ప్రతి వంప మంజ ? యేము

శౌనృత్యమును కలుగ నేరదు. ఇంతటనైనను విజయదశమినాడు మాచే వ్రాయబడి న ప్రకారము స్వచన పోషణ సమర్థత్వము గలిగిన పండితస కు వచ్చెదరని తల చెదము.

(తెలుగుతో చేవ్రాలు)

---

నరసారాయునిపేట

3-10-11

శ్రీమహారాజశ్రీ తిరుపతి వెంకటేశ్వర్లగార్లకు

అయ్యలారా!

"పశ్యావశ్యానపశ్యతః" యనుసమస్య విషయములో రెండుదినములయందు ను "సమస్యలో తప్పు గలదుగాన పూర్తి జేయవీలులే,, దని మీరు దృఢముగా జెప్పియు న్నారు పండితులు సాధువని చెప్పినారని తెలియపరచుకున్నను పండితుల నగౌర వసూచకముగా నింద నల్పినారు సామర్థ్యము గలయెడల స్వవచన పోషకము చే యుడీయని బ్రహ్మశ్రీ........రాయులవారు మీకు వ్రాసిన నదుత్తరము లివ్వ బూనరైతిరని తెలియవచ్చినది పైసమస్యతప్పుగా నున్నదని మీరు పండితలక్షణ ముగ సిద్ధాంతపఱచినయెడల నూటపదియారు రూపాయలు మీకుతప్పకుండ నిచ్చుట కును సాధు వని సిద్ధాంత పఱచిన నట్టిమొత్తమే మీరుమాకునిచ్చు నట్లుగను మీారు వడంబడిక చేయునెడల నందులకు మేమంగీకరింతుము పైప్రకారము బూనెదరా, మీతరఫున జానపాటిపట్టాభిరామశాస్త్రిగారు వచ్చి మాట్లాడగా నీసంగతులకే మీతో కలసి మాటాడి జబాబునిత్తు మని చెప్పి కాలవిడంబము చేసినందున నీకాకిత ము వ్రాయవలసివచ్చినది వెంటనే జబాబు వ్రాయకోరినాము.

ఇట్లు

......శర్మశాస్త్రి.

......శర్మశాస్త్రి.

ఉ॥ ఉదయము సాప్రియాణ మక్కు "దూరున నేగఁగఁ జేతు" నంచు సొం
పొదవఁగ యత్నమున్ సలుపుచుండు నెడన్ "రయి" లేసు వేళకి
య్యది తుదముట్ట దేగవలె నక్కడ సింకొకచో నడస్సు మా
కొదవు కతాన "నంచు నలయుత్స్వవ మాఁగితి మంబ! యే మొగిన్ — ౨౦౭

శా॥ "ఊరేగిం పొనరించి తెచ్చితిమి మీ "మ్యోసారా" యన న్నేఁడు నిం
పారన్ బంపెద మల్లె" యంచు నరసింహరావు లోనైన యా
ధీమత్ వల్కఁ దొడంగి రెట్లొ యలసద్ధిమంతులన్ మాన్పి కా
ర్యారంభంబునఁ జేసి యేగితిమి మే మానాఁడు గుంటూరికిన్ ౨౦౮

చ॥ పతితుఁడు *"సత్యవాది" తరువాత నెటో లిఖియించె వాని కే
గతి పరమందుఁ గల్గెడినొ! కట్టఁడి సర్వ మెఱింగి, యునన్ సూ
నృతము నడంచి యాత్మను జయించి వృథా వదరు ల్లిఖించు నా
చతురుని సాహసమ్మునకు సల్పవలె న్నతు లెన్నియేనియున్. ౨౦౯

శా॥ అంబా! యిట్టి యసత్యవాదులకు నీ వాపంతయే నల్గ "కా
లంబింపం జన దీరసత్య మని వాఱాయం బెచేరీతి జ్ఞ
ప్తిం బుట్టింపుము, నీదు కోపమున కీ "దేవయ్య" లేపాటి! కో
పం బూనన్ బని లేద, పిచ్చుకల పై బ్రహ్మాస్త్రముల్ నింతురే. ౨౧౦

ఆ॥ రైలు కదలు వేళ రయమున నొకఁడొక్క, స్త్రీయుత్తరమ్ము తెచ్చియొసఁగె

---

*ప. రా:—ఈ 'సత్యవాది' తప్పుడు వ్రాఁతను గుంటూరిసీమ, పూర్వరంగము 53 వ పుటలోఁ దుట్టతుదను జదువి, దానిసత్యాసత్యములనుగూర్చి మ॥ రా॥ రా॥ వంగనామాల నరసింహారావుపంతులుగారికిఁగాని వేరొక సంపన్నగృహస్థునకుఁగాని యోగ్యుఁడని మీకుఁ దోఁచిన యెవరికిఁగాని వ్రాసి తెలిసికొనఁ గోరెదను,

---

శ్రీరంగదేవతాపతయే నమః

బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరుల గార్లకు.

బ్రహ్మశ్రీ ........రాయశర్మ వ్రాయునది.

అయ్యలారా! డైమండు జూబిలీ రీడింగురూం వారు నిర్ణయము చేసినటుల శ్రీ వంగనామల నరసింగరావు పంతులుగారు తమ నాహ్వానము చేయుటచే తామి

దానఁ, "బళ్ళ" గోలలేదు, వవళకే గుంటూరి కరిగినానికిడితిముంబఁ*జాబు.
కే॥ అంతతోఁ జల్లఁ బాజె నయ్యయ్యబుబాపు, పిదప "బాపట్ల" వారలపిలుపుకతన
నటకు నేగియప్పర వాస్తులలరిసెముసఁగు, సత్కృతులుగొని గుంటూరు చనిమువమున.

---

చ్చటికి విజయంచేయగా రీడింగురూం వారిలో నేనుకూడా మెంబరునౌటచే రీడింగురూం సంబంధము నాకుబోధపడకుండే మీరుశతావధానము చేయబూనితిరి నా కాహ్వానము లేనందున నేను రాసందర్భముగలుగదయ్యె అందుచే తమరుశతావధానులనుచు వచ్చినపుడు మీసామర్థ్యముచూచి సంతసించకుండుట న్యాయము గాదని తోచి మీరు యథావిధిని శతావధానము పృచ్ఛకప్రశ్నానుసారముగా సంస్కృతాంధ్ర భాషాద్వయములో చేయగలశక్తి మీకు గలిగినచో ఈఆశ్వయుజశు 15 స్థిరవాసరమునకు సరియగు 7-10-1911 తేదీన నేను శతావధానమును మీచే చేయించబూనితిగనుక యాప్రకారమున జరుగబడుటకు మీయభీష్టమును వెంటనే తెలుపగోరినాను ఆప్రకారము మీరు జరిపినచో నూటపదియారురూపాయలబహుమతి నిచ్చుటకు సిద్ధముగానున్నాను.

నర్సరావుపేట }
4-10-1911 } (ఇంగ్లీషుచేవ్రాలు)

---

4-10-11 తేదీని 3 గంటలు.

*శ్రీమత్పరదేవతాయైనమః.

మహారాజశ్రీ...... } గుంటూరు, క్రొత్తపేట
రాయశర్మగారికి } బ్రా॥ శ్రీ॥ శిష్టావానుమచాస్త్రిగారిలోగిలి.

ఆర్యా!

తమ 4-10-11 తేదీగల యుత్తరమందినది. ఇంతకుముస్తు ఇరువదియైదుసంవత్సరములనుండి సంప్రదాయసిద్ధముగాఁ బండిత సమ్మతముగా శతావధానాష్టావధానాదికములు సల్పుచున్నమమ్ము "యథావిధిని శతావధానము పృచ్ఛకప్రశ్నానుసారముగ యథార్థముగా సంస్కృతాంధ్రభాషాద్వయములో చేయగలశక్తి మీకుగలిగినచో" అనివ్రాయుటచే మమ్ముఁ బరీక్షించుతలంపుతో మీరీకార్యమునకుఁ బూనితిరని స్పష్టపడినది. కానిందు మీయభిమతార్థము తీర్చుము కాని మీవంటి

# బాపట్లశతావధానము.

ఆర్యులారా!

బాపట్ల పురవాసులగు బ్రహ్మశ్రీ కైవారం నరసింహముగారును నూరి వెంకటేశ్వరులుగారును తంగిరాల ఆంజనేయులుగారును ఎడవల్లి కామేశ్వరరావుగారును మున్నగు మహనీయులు పలుమారాహ్వాన మొనరింప గుంటూరుపురమునుండి బ్రహ్మశ్రీ కింకవీంద్రఘటాపంచాననాదిబిరుదాంకిత శ్రీతిరుపతి వేంకటేశ్వర మహాకవులు 8-10-11 దినమున బాపట్ల పట్టణమునకరుదెంచిరి. దిగంతవిశ్రాంతకీర్తులగు మహాకవుల రాక మహానందసంభరితులఁ జేయఁ పౌరులు స్వాగతంబొనర్ప రైలుస్టేషనుసొద్దకువచ్చి యెదుర్కొనిరి. కవిశరేణ్యులం బురప్రవేశంబుఁ జేయించి బ్రహ్మశ్రీ విష్ణుభొట్ల రామయ్యగారి మేడలో విడియఁజేసిరి. పదపడి ఆదినము మధ్యాహ్నమున మంగళవాద్యఘోష పురస్సరముగాఁ బౌ

---

మహావిద్వాంసుల దగ్గఱ "యథావిధిని పృచ్ఛక ప్రశ్నానుసారముగా యథార్థముగా సంస్కృతాంధ్ర భాషాద్వయములో శతావధాన మొనర్చిన కష్టమునకుఁ దామేర్పఱచిన వెలమాత్రము బొత్తిగాఁజాలదు. కావున మాకుఁ జెటియొక 1116 రు రూపికలేని యధమపక్షమీఁగల శక్తిగల్గియున్నచో నీసారి విస్పష్టముగాఁదెలిపితిరేని మీయభిమతార్థము నెఱవేర్చుట కేవిధమైన యభ్యంతరమునునుండదు. సాధ్యమైనంత త్వరలోఁ బ్రత్యుత్తర మంపుదురుగాక.

దివాకర్ల తిరుపతిశాస్త్రి. }
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి. } శతావధానులు.

☞ షరా:—చదువరులారా!

ఉదాహరించిన యుత్తరములలోని "(1) బ్రహ్మశ్రీ ......శాస్త్రులవారికి, (2) మహారాజశ్రీ... వెంకటేశ్వర్లగార్లకు, ఇత్యాదిసందర్భములంబట్టియేమి బ్ర॥ ......రావు" అని స్వయముగా వ్రాసికొనునూత్నాంశసందర్భముంబట్టియేమి, మఱికొన్ని పల్లవములంబట్టియేమి, 'బ్రహ్మశ్రీ, వ్రాయుచు నమస్కారశూన్యముగా లేఖవ్రాయుసందర్భముంబట్టియేమి, 'హంశము, లోనగు ప్రయోగశుద్ధింబట్టియేమి, యొకటిరెండుత్తరములను వ్రాసిన మానిసి తెల్వితేటలను దెలిసికొనుఁడు

రులచేఁ దోషోక్తులఁ బడి ఛన్నుకొంచెని కెంకాలులో నవధానం బొనర్చి పండి తజనహృదయాహ్లాదంబుఁ గావించిరి. .....మూఁడవ పాదమునుల వముగా నాల్గవ పాదము సంఖ్యనుడివి ఎవ్వరే పాదము చెప్పుకొనన్న నా పాదము చెప్పుచుఁ బూర్తి చేయుటచే వీరియద్భుతధారణాశక్తి సభ్యులకుఁ దెల్లమయినది. ... సభ్యులలో నెవ్వరో యొకరు పద్యములన్నియుం జదివినఁ గాని యవధానపూర్తి కాదని తమ యనుమానము ప్రకటించినను సభ్యులు కాలహరణమున కోర్వలేరైరి. కాని శ్రీ

---

ఇతనిపిమ్మట, నిరువురు 'శర్మశాస్త్రు' లు వ్రాలు గలయుత్తరములలోని. రెండవమారి సిద్ధరించిన, శర్మశాస్త్రి' బిరుదము, 'పండితునకుఁ గాని నేముత్తరమియ్య' మనుటచేఁ గల్పించినది. అతనినిమొదటియుత్తరమున 'బ్రహ్మశ్రీ అని మొదలిడి...అయ్య, అనునొకపృచ్ఛకుఁడు' అనియె యీకలహప్రవర్తకుఁ డగు "రావు" లిఖించెను. గానిసమయానుకూలముగానీ 'శర్మశాస్త్రి' భూమికనతఁడు వహింపవలసిన వాఁడయ్యెను. ఎట్టిమూర్ఖునకేని యీగుట్టునుగమనేమ యగుటచే గుట్టుమట్టు లెఱుఁగని వారమయ్యు మేమిది సుజీతింపఁగల్గితిమి, కావుననే యీ 'శశ్శోట్టులకు' మేము జవాబొసంగమైతిమి, ఆపిమ్మట నిదితోవ గాదని 'అవధానార్థమాహ్వానించువారువలె నిఁక నొకయుత్తరమంపిరి, అందలి 'పరదేవతాపతె'' శబ్దమును, మా 'పరదేవతా' శబ్దమును, విచారించినచో మఱికొంతవారితెల్వి బయలువెడలఁగలదు. అదియటులుండె, పాపము! ఏగ్రంథమునందుఁ గాని 'పశ్య'. శబ్దము సాధువు కాదని వ్రాయఁబడియుండ దనుదృఢనిశ్చయము రామారావుగారి కుండుటచే వారీ 'శశ్శోట్టులను బ్రేరేపియుందురనునది మేము వ్రాయకుండినఁగనే ప్రపంచము తెలిసికొనఁగలదు గాన విస్తరింపఁబనిలేదు సమస్య పంపినవారుగాన రామారావుగారు స్వయముగా మమ్మడుగ వచ్చును, చెప్పఁగలిగిన చోఁ దగుసమాధానమును, లేనిచో క్షమాపణమును మేము చెప్పనువచ్చును గాని 'చల్లకువచ్చి ముంతదాఁచిన' సామెతగా శ్రీరామరావుగారు, ఎందులకును గొఱగానివారినిముందిడి 'శర్మశాస్త్రి' బిరుదములను దగిల్చియుఁ దగుల్పకయు, అవమానకరములగు పత్త్రములను వ్రాయించుటనుగూర్చి విజ్ఞులే విచారించుకొందురుగాక. మాయుద్దేశమునుబట్టి వారిట్లు ప్రవర్తింపఁదగువారు కాకున్నను నట్లు ప్రవర్తించుట భావ్యపజయసూచకమనియు నందులకే దైవమట్లు ప్రేరేపియుండుననియుఁ బొడకట్టెడిని, ఇందునుగూర్చి, కొన్నిపుటలలో ముందు "బందరు" అనుశీర్షికగలచోఁ జదువఁదగు.

శాస్త్రులవారు మాత్రము కాలహరణమున కోర్వలేని సభ్యులు వెళ్లిపోయినను ఈ సందేహముకలవారు కూర్చున్నచోటనే తక్క అన్నిపద్యములను జదివెదమని రి కాని వారట్లుచేయక పోవుటచే ఆపని జరగలేదు. ......తరువాత ప్రశంసాపద్యములతోడను జయజయధ్వనులతోడను సభముగిసినది. ...... తరువాత మఱునాడు మూడుఘంటలకు సభప్రారంభింపఁబడినది. అందు శ్రీతిరుపతివేంకటేశకవులు లేటు శ్రీ విజయనగరము మహారాజా మొదలగు రాజోత్తములపై రచించిన పద్యములను, ప్రతిపదనీతిసారంబగు గీరతంబును గర్ణరసాయనముగ సానన్వయముగఁ జదివి సభ్యుల కానందంబమందంబుగం గల్పించిరి. .. .......,.

ఇట్లు, విధేయుఁడు

కైవారం వెంకటలక్ష్మీనరసింహాం.

## పౌరులొసఁగిన స్వాగతపద్యములు.

మ॥ జితనానావిధ బోధశోధనసమష్టి భూతపాకాద్యలం
కృతిశయ్యా మధురీతిగీతిఫణితి శ్రీమాధురీసాధురీ
త్యతిభాస్వత్కవితామహాఖురళికాహాంయు ప్రతిత్యౌచితీ
యుతులౌ తిర్పతి వేంకటేశకవి సింహుల్! స్వాగతం బీయదే.

మ॥ సితరాముస్స్మతి భృత్యుక వ్యధిప సిద్ధిదప్రతాపార్వజా
లతిరసుక్ర్వ దహీన వర్ష్మఖిల వేళాలోల సీరంధ్రపూ
రితవాఃపూర భరభ్రమభ్రమిత సీవృత్యుష్కలావర్తకా
యిత శ్రీతిర్పతి వేంకటేశకవి సంతీ! స్వాగతం బీయదే.

మ॥ అతిమాధుర్య రసావగుంఫన సమగ్రప్రారంభరంభాఫలా
ప్లుత సుస్వాదురసాయనప్రచుర విప్లుష్ప్రణాళీకినిర్
స్మిత సారస్వత మంజులాశ్రమవణ సమ్మిశ్లల్లతాంతాంతవ
ల్లిత శ్రీతిర్పతి వేంకటేశకవి కేకీ! స్వాగతంబీయదే.

మ॥ కృతవిస్తారమనోహర ప్రచుర నైపుణ్యప్రోదధారావిసా
రతళద్ధాళధళీవిలాసిసుషమాప్రాగ్భార గోదావరీ
కృతన వ్యావృత పారణోపమితనిష్కృష్టాసుధారాత్రసా
హాతరత్తిర్పతి వేంకటేశ్వరమరాళా! స్వాగతం బీయదే.

మ॥ చెఱకుఁదోఁటల జాట నట్టనడుమఁ జెన్నారి చెల్వారు బం
గరు పూఁదేనియ యేటికొత్తరఁగలఁగ్రంపుఁ జెందిప్పలం
బఱపై యేపగుమావికైతనడిదీవం గూడి యుయ్యాలహే
ళి రహిం బొల్చెడు కోయిలల్ కవులు! హాళిన్ స్వాగతంబీయరే.

బాపట్ల పౌరులు.

సీ॥ శ్రీమన్మహాకవి సింహాసనలరారు ఘనపుణ్యులార! స్వాగతము మీకు
కామేశ్వరీపదకమలసంసేవకమతియుతులార! స్వాగతము మీకు
అవధానమహిమచే నకలంకవిఖ్యాతి గను ఘనులార! స్వాగతము మీకు
తిరుపతివేంకట దివ్యనామాంచిత ఘనకీర్తులార! స్వాగతము మీకు
గీ॥ శారదామూర్తులై యొప్పి సాంద్రమైన, యశముదశదిశలందున నమర నిల్పి
నట్టి మిము శారదాకాలమందుఁ గాంచి, స్వాగతమునిచ్చు పుణ్యంబుశాశ్వతంబు

కర్లపాలెం సూర్యనారాయణ.

చ॥ సరసకలావిలాసయుతచాతురి మీఱ సురాంధ్రభాషలన్
గరమురసంబు లొలుకఁ గతిఁ గైత నమేయముగాఁగఁ జెప్పి సో
దరు లనమేటిమీరిమిభిధం బెసఁగం జరియించునట్టి యో
తిరుపతివెంకటేశ్వరసుధీవరులార! గొనుండు మానతుల్.

చంద్రమౌళి చిదంబరరావు.

శ్లో॥ శ్రీమత్తిర్పతివేంకటేశ్వర మహావిద్వత్కవీంద్రావుభౌ
నానాభూపసభాంతరాళవిలసత్సత్కీర్తితారావళీ
శ్రీమత్పాణినిగౌతమాదిమునిభిః ప్రోక్తేషు శాస్త్రేషు తౌ
సారజ్ఞౌ చ రసజ్ఞసభ్యసుజనవ్రాతౌ గిరీశోఽవతు

శ్లో॥ కింకవీంద్రఘటామధ్యే మృగరాజయశోన్వితం
పశ్యంతు సకలాధీరాః, శ్రీమత్తిర్పతి కోవిదం
శుకవీంద్రఘటామధ్యే తథా బిరుదసంయుతం
వేంకటేశ్వరనామానం కవిరాజం సుపశ్యత
మాతాపిత్రోస్తు తన్మ్నానం పూర్వజన్మతపః ఫలాత్
జజ్ఞే తిరుపతికవి ర్వేంకటేశకవి స్తథా

వేలూరివంశసంభూత శ్శివరామాభిధానకః
తయో శ్శిష్యత్వ మాపన్న స్తథా ఖ్యాతిం సమార్జయత్.
శంకర శ్శంకరో నిత్యం భక్తానుగ్రహతత్పరః
సచమాంసభ్యకాన్ రక్ష్యా దుమావామార్ధజానికః.
చంద్రమౌళికృపాలబ్ధా స్వచ్ఛస్ఫటికసన్నిభా
శివరామకవేః ఖ్యాతి ర్జీయా దాచంద్రతారకం
మంత్రవాదికులోద్భూత వేంకటాఖ్యేన ధీమతా
దత్తాని పద్యరత్నాని విద్వద్భ్యో నిర్ధనేన వై.

మంత్రివాది వేంకటశాస్త్రి.

---

గీ॥ అందమును వచ్చు కతన నా సంపగరిమ, గలుగుట యటుండ శ్రీ సూరికులము నాకు
గురులలో నొక్కరుండు వ్యాకరణవార్ధి, కూడ వచ్చె సుబ్రహ్మణ్యకోవిదుండు.

## నెలబాలుఁడు.

సీ॥ కొండవీటను నుండు కోమరాలి మోముపైఁ బొలుపారు పాపటబొట్టనంగఁ
బడమటి దెసబోటి పట్టుపైఁ బెనిమిటిఁ బనుపఁ దాల్చిన పూవుదండయనఁగఁ
దమ్మితీవ నెలంత యమ్మాయి నుంచ జాత్తిలిప గంపంపు పెత్తికయనంగఁ
బెరిమ నాకన మను 'పీర్లపంజా' ను, నిల్పిన "బాలసాహెబు పీ", రనంగ
తే॥ గీ॥ సంజమొలనాగ తన చేతి సందునందుఁ, జెలఁగు గాజులమొరిపిడి చేతఁ దెగిన
దోరమనఁగను లేఁత చందురుని రేక, వెలయుచుండెఁ జీ నమవసవిదియనాఁడు.

## చంద్రోదయము.

చ॥ కలువ లెసంగఁ దారకలు కాంతిఁ జెలంగ ననంగవహ్ని సాం
పులు గులుకంగ నంగనలు పొంగుచు మేను లలంకరింపఁగా
నలమదనాంతకాంతకపురాంతకమౌళిజటాటవీనదా
కుల మగు బాలరేఖగల కోవిదమాన్యుఁడు పుట్టువందెడున్.

## భారతయుద్ధము.

స్రగ్ధర — భీష్మో ద్రోణశ్చ కర్ణః కురుపతి రనుజాః పాండవా వాసుదేవ
స్సౌభద్ర శ్చేకితానో ద్రుపదధరణిరాట్ తస్య పుత్రో విరాటః

ప్రారంభం చాఽతిఘోరం సమర మమరదృక్ప్రేక్షదాయి ప్రవీరాః
క్షోణీశానాం శూన్యరూపా జని తదను మహాభారతానాం క్షయోఽభూత్.

## చంద్రకళంకము.

శ్లో॥ నాఽకాశోఽయ మపారవారిధి రిమా నోతారకా బుద్బుదా
శ్చంద్రో నాఽయ మనంతశేషఫణిరాడ్డేహా త్ప్రదంతర్గతః
యశ్శ్వేతేకిల తత్ర నీలజలదాకార స్తదంకో హరి
స్సోఽయం సాంద్రితచంద్రకాంతినిసరః పాథోధివీచీచయః

(రైలుష్టేషనువద్దఁ బ్రయాణసమయమునఁ జెప్పినవి.)

మ॥ సరసీజాలయ నీయెడ న్నిలువ నిచ్చల్ భావనారాయణ
స్థిరకారుణ్యరసాతిరేకమున వృద్ధిం జెందుచున్ మమ్ములన్
స్మరియింపంగదవమ్మ చూడఁగదవమ్మా? నీదయాపూరసం
భరితాంతఃకరణప్రచార మెపుడున్ మాపట్ల బాపట్లకో.

మ॥ చిరసౌభాగ్యము కల్గిప్రాగుదధివీచీమాలికాడోలికా
చరవాతార్భకసేవ్యమాననిజవత్సం బైన బాపట్లపూ
రరుణాంభోజదళాక్షి! మాకు నెలవిమ్మా? ప్రోవుమా? యెల్లవ
త్సరముల్ తిర్పతివేంకటేశ్వరనిభాతంబున్ జయస్తంభమున్. తి॥ శా॥

ఇతరులవధానాంతమునఁ జెప్పినపద్యములలోఁ గొన్ని

ఉ॥ సిన్నటికంటె నేఁడు మఱి నేఁటికి మించియు రేపు సత్కళా
భ్యున్నతి మీఱుమీకవనముల్ బుధకోటికి నింపునింపు నో
సన్నుతకీర్తులార? విలసద్భవదద్భుత సత్కవిత్వ మన్
గొన్నన బోణి నిర్జరతఁ గోమలతన్ దనరారు నిచ్చలున్.

ఉ॥ క్రొత్తమెఱుంగులన్ విబుధకోటి నుతింపఁగ నాఁడు నాఁటి క
త్యుత్తమ మౌచు మీకవన మొప్పసలారెడు కారణంబునన్
"క్రొత్తొకవింత ప్రాఁతయొకరోఁత" తనులోకులపల్కు లాకయున్
రిత్తలటంచుఁ బల్కు విపరీత మదేటి కగున్ వచింపరే॥

ఇట్లు,
కురుగంటి శ్రీరామశర్మ.
9-10-11.

శ్లో॥ శ్రీమత్ఫణీశ్వరవచోభిః కృతావతారా, విద్వత్ప్రవిస్తుతసమస్తగుణప్రపూరా
భాత్యప్రియుక్తముఖదోషగణాతిదూరా, శ్రీ శ్రీశవేంకటపీట్ప్రవితాశుధారా

సీ॥ అన్న! తెల్గులసొంపులెన్నఁ దిక్కన్న తిక్కన్న యంచపకీర్తి నందకున్నె
అన్న! యల్లికసొంపుగన్నఁ బెద్దన్న పెద్దన్న యంచొక దూఱు నందకున్నె
అన్న! గుంఫనము గన్గొన్న లింగన్న లింగన్న యం చెగతాళి నందకున్నె
అన్న! ముద్దులపల్కు లెన్నఁ దిమ్మన్న తిమ్మన్న యంచొక నింద నందకున్నె
తే॥ గీ॥ వీరికవితామహాసుధావారిరాశి, ననుచు జనులెల్ల వేనోళ్ల వినుతి సేయ
జగతి యశమున నింపిన సరసకవులు, ధరణిఁ దిరుపతివేంకటేశ్వరులుగారె.



గీ॥ అచట మఱికొన్ని నాళ్లుండియనఘులైన, వారలొనరించు విందులవలనఁ దనిసి
సెలవు పూర్తి చెందుటయు నాసీమవిడిచి, యెవరి యిండ్లకువారేగియెనక మొసఁగ.
గీ॥ ఉండుతఱిఁ గొప్పరపువారినొమదలఁచి, భంగపడిన బంధుగులు *దర్బారటంచు
పత్రికనొకండు మొదలిడిపాడునుడులు, గిలుకఁ దొడఁగిరి తమతెల్వి చులుకవడఁగ

మత్తకోకిల॥ మంగళం జయమంగళం శుభమంగళం జగదీశ్వరీ!
మంగళం నినుఁ గొల్చుమాకును మమ్ముఁ దిట్టెడి వాండ్రకున్
దొంగవ్రాఁతలు వ్రాయువాండ్రకుతూహలమ్మ్రనకున్ సదా
మంగళం జయమంగళం శుభమంగళం జగదంబికా. ౨౧౫

మత్త॥ “పోచిరా” జొకరుండు బూతులబుంగ సారెకు విప్పెడున్
“పేచిరా” జొకరుండు ప్రేలుడుఁ బెట్టి బైటికిఁ బెట్టెడున్
“చీచిరా” జొకరుండు చెన్నఁటిచీకుఁ గైతము గోఁకెడున్
కాచి కొప్రపువారి నెట్టులొ గట్టు నెక్కఁగఁ జేయఁగన్. ౨౧౬

మత్త॥ “త్రోసిరాజులు” కొంద ఱొక్కెడ దూలనాడుచు నుండఁగా
“వేసి రాజులు” కొంద ఱొక్కెడఁ వెక్కిరిం పలరింపఁగా
“తీసి రాజులు” కొందఱొక్కెడఁ దిట్లు బిట్టుగఁ దిట్టఁగా
వాని కై చదరంగ మావయి వైరులాడి రథీరులై ౨౧౭

---

☞ *ఈదర్బారునుగూర్చి పూర్వరంగమునఁ గొండొకచూపఁబడియె, ఇది యిసుకపాఁతజవంటిది దీనిప్రలాపనలు చూచి తీరవలయును.

మత్త॥ “పోతురాజులు,, విబ్బ వీఁగుచుఁ, “బోకిరీ,, నుడు లాడఁగన్
“బూతురాజులు,, మేరదప్పుచు బూతు లేకరు వెట్టఁగన్
“ఓతురాజులు,” మేవుమే” వని హుంకరింపులు నింపఁగన్
గోతు *రకక్రూటమి కోఁత లెన్నియొ కొవ్విపుంగవు లావయిన్. ౨౧౮

మత్త॥ బండలాక్రైడఁ బందలాక్రీడ బారు బూరులు నూఱఁగన్
మొండివ్రాఁతలవారు సారెకు మ్రోఁత లేమియొ మ్రోఁగఁగన్
పిండి లేకయొ రొట్టెఁగాల్చుచు బింకముల్ తెగబొంకుచున్
దండుబల్మిని కొవ్వరంబు వృథా ప్రగల్భము లాడెడిన్. ౨౧౯

తరల॥ తెలివి తక్కువ యీను రోనము తెల్లమోమును వ్రాఁతయే
తెలుపు నంచు నెఱుంగ కూరక తెల్లవాఁటిన దాదిగాఁ
బలుగువ్రాఁతలు మమ్ముఁ గూరిచి బండ్లఁ దోలుచు దాసిచే
గెలుపు కొప్రపువారి కీ గమకించి రాప్తులు కొల్లగన్. ౨౨౦

---

(*ఫిబ్రేవరి 10వ తేది1912 సం॥ దర్బారునుండి.)

4-9-1911 తేదీన, మాకును దిరుపతి వేంకటేశ్వరులకును వైషమ్యములువలదని యుద్దేశించి తదనుగుణమయిన పత్రిక నంపి అందు సంతకములుచేసిన ప్రజ్ఞానిధులకు వినయపూర్వకముగా నమస్కారములొనర్చి చేసిన విన్నపము....

సీ॥ ...గీ॥చేసిన ప్రతిజ్ఞఁదప్పకు చెప్పమితర,మార్పుఁడీ సంశయం బొనఁగూర్పఁడి
సభఁ,బంపుఁడీవార్త దిశలకునింపునింపుఁ,డో నరసుకారగుంటూర్నివాసులార!
గీ॥ పత్రికలఁ దెల్పికొనినట్లె ప్రతినలెల్ల, వీఁక నిగ్గించుకొందు మీలోకమందె,
యింతకేమూఁడులోకాలకేగనేలని, వేగ సభఁ గూర్పుఁ డో జగద్విదితులార!,

ఇట్లు

కొప్పరపు సోదరకవులు, శతావధానులు

☞ ఈసాటి కోఁతలు పేరు సంధిపత్రమందుకొనిన ఏమానసములకుఁ బిమ్మటివని యెఱుఁగుఁడు. సారమరయుఁడు, తి॥ వెం॥

మత్త॥ మంగళంబగు నాశుఘోషసమాఖ్యకుఁ బరపుష్పమున్
గంగ సేఁదఁగ నూఁతగాఁ గొను కాకవిద్విజపాళికిన్
మంగళంబు నిజం బెఱింగియు మాయశమ్మును మార్పఁగా
వెంగలుల్ పొనరించు నాయవివేకపుం జెడునోలకున్. ౨౨౧

సీ॥ ఎండగఁడినిఁబట్టి యొండుగండి, యటంచు వ్రాయఁజొచ్చిరి వృథా వాగ్వ్యయముగ
తమపాటిపోక లోకమెఱుంగుటయెఱింగియు నపమ్ము బాఱిరంచనఁదొడఁగిరి
మృదవుగా నేదేని మేము వ్రాయఁగ దుందుడుకు మీఱి తందనాలకుఁ గడంగి
"రవధానమును జేయక వధానులెటులైరి,, యనె కొనకొమ్ములాడఁదొడఁగి
గీ॥ రకటనిలోకమ్ము గుడ్డిదియంచు నెంచి, కుంచి చెలరేఁగి మమ్ము దూషించఁదొడఁగి
రేమి చెప్పఁగ వచ్చు నికాముకోప, దూషితములు కొప్రపువారిభాషితములు.

క॥ ఇది యిదిలుండెను వాదా, స్పదమగు నల" పశ్య " యనెడిశబ్దమ్మునకై
వదరులు వదరుచుఁ బ్రకటిం, పఁ దొడఁగిరొక కొంతమంది పత్రికలంతన్
క॥ 'కాశిక' యనుపేరెఱుఁగని, ధీశూన్యులుగూడ దాని దెగఁదిట్టుచు శా
ఖాశౌర్యప్రాగ్భారా, వేశమ్మునఁ దఱుచుఁ దాండవించిరి జననీ ౨౨౪
గీ॥ రామరావు వ్రాసెడిదనఁ బ్రాసరాద, యుత్తరంబనిమిన్నకయుంటిమేము
ఎట్లు వ్రాయనే మగునొకొ యీవివాద, మనుచు నాతఁడు పత్రికఁ బంపఁడయ్యె.
గీ॥ అపుడు పాయమ్ము దోఁచక యతని పేరు, గూడఁ జేర్చి శిష్యుఁడు వ్రాయు కొంటె* వ్రాఁత
చూచి యీ మన పేరిరణఁ దోఁచిపుచ్చ, రాక యాతనిబుల్పుదీర్పఁగఁదలంచి.

---

శ్రీ
శ్రీహయగ్రీవాయనమః.
*బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకు.

అయ్యా,

మీరు నరసారావుపేటలో యీ సంవత్సరము అక్టోబరు 1, 2 తారీఖుల శతావధానమను పేరుచే 40 మందికి సభఁ జేయునపుడొక పృచ్ఛకుఁడు "పశ్యా వశ్యానశ్యతః" అనుసమస్యనిచ్చి పూరింపుఁడనఁగా నాసమస్యతప్పని చెప్పి, పృచ్ఛకుఁ "డిది పండితః లొప్పికొనినదియే తప్పగా" దనిపలుకఁగా 'ఎవడాపండితుఁడు

తే॥గీ॥ కాశికా వృత్తిలోనున్న గ్రంథమల్ల, రామరావున కెఱుగంగ రానిదనుచు
నతఁడువ్రాయించు వ్రాఁతలకతన నెఱిఁగి, దానిచే మానుడిని నిల్పఁదలఁచి మఱియు
క॥ *కలహమునకుఁ బూర్వమ్మొక, యలఘుఁడు తచ్ఛిష్యుఁ డెలమి నంపెను దోష
మ్ము లగని యగు రామకవీ, ట్తిలకుని కావ్యమ్ము దాని దెఱచితి మంతన్.
మత్త॥ ప్రాజ్ఞుఁడయ్యును రామరాట్కవి భావియోగవశమ్మునన్
విజ్ఞు లెల్లరు నవ్వ కైతను వెల్లఁ బెట్టెను దానిలో
నజ్ఞు లత్తఱిఁ జేయునల్లరి కాతఁ డూఁతముగాపుటన్
దజ్ఞుఁడంచు నెఱింగి యుండియుఁ దప్పు లేరితి మంచికా. ౨౨౯

---

పండితుఁడైన నిట్టితప్పుసమస్య నేల నొప్పుకొను’నని పండితదూషణ చేసితిరి కదా. అందుపైఁ గొందఱు పండితులీ సమస్య తప్పుగాదని, మేము సమర్థింపఁగలమనియు మీరు తప్పని సమర్థింపఁగలరేని సభకు రావలసినదనియు మీరు తప్పని ధ్రువపఱచిన యెడల మేము నూటపదారు లిచ్చెదమనియు ధ్రువపఱప లేనియెడల మాకు మీరు నూటపదాఱు లిచ్చిపోవలయు’’నని యుత్తరము వ్రాసిపంపఁగా బ్రత్యుత్తరమీయక నరసారావుపేటనుండి గుంటూరునకు వెళ్లిరి ఇంతవఱకుఁ దగిన ప్రత్యుత్తరమిచ్చినవారు కారు. కావున నిప్పటికైన స్వవచనపోషణ సామర్థ్యమున్న యెడల వట్టియుక్తులు పన్ని కాలము వ్యర్థపుచ్చక తప్పని నిశ్చయపరచుట కొప్పుకొని తెలియపరచిన తత్క్షణమే పండితసభఁజేయించుటకును, ఆసమస్య తప్పుకాదని సమర్థించుటకునుఁ గృతనిశ్చయుఁడనై యున్నాఁడను. (యిందులకతి శీఘ్రంబునఁ బ్రత్యుత్తరం బొసంగనిచో మీరోడినట్లే తలంపబడుదురు.)

బ్రహ్మశ్రీ బెల్లంకొండ రామారాయ కవీంద్రుల శిష్యుఁడగు
1-11-11: ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రి.

☞ కుండలితమగు వాక్యము ప్రేషకుని స్వహస్తలిఖితము తక్కినదిఅచ్చు

---

*మహారాజశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి శతావధానిగారికి యిచ్చేది
రవాన్నా, బందరు, భైరవప్రెస్సు. 27-6-11 బండారుపల్లి.
నమస్కారములు.

తమక్షేమం యీమధ్య తెలియలేదు, గీరతము యెప్పుడు బయలువెడలునది తెలియలేదు, ప్రస్తుతం మా గురువుగారు బెల్లంకొండ రామారావు చేసిన కృష్ణలీలాత

మత్త॥ *తప్పులయ్యెడి బ్రహ్మకేనియు దాఁట రానివి యాటచేఁ
"బప్పులోనడు" గన్న సామెతఁ బట్టిపోఁదలంపు లో
చొప్పు చొప్పడెఁ దక్కువారలు శుద్ధశుంఠలు సారెకున్
బిప్పిచేతము పేరిబెడ్డలు వేయఁ జూచ్చిరి మాపయిన్. ౧౩౦

మత్త॥ "రామరా వెటులేని బైకిఁక రాఁగలేఁ"డని కొవ్వుపుం
గోము కైసకులంతటన్ దమ గుంపు గూడిరి మెల్లఁగన్
సాము సేయఁ డొడంగి రెందు నసత్యమే యొకవిద్దెగన్
వామ మార్గముఁబట్టి సారెకువాగ్వ్యయ మ్మొనరించుచున్. ౧౩౧

---

రంగిణిని మీవద్దకంపినాను. దానిని తాము చిత్తగించి గుణదోషములను వెల్లడింతురుగాక, నాశరీరము కొంచము నెమ్మదిగా నున్నది. యింకా పదిరోజులకు వారుచేసిన రుక్మిణీపరిణయ చెంపూప్రబంధమును పంపఁగలను. శ్రద్ధగాపరిశీలింరుగాక.
(మక్కికిమక్కినకలు)
జూపూడి.హనుమచ్ఛాస్త్రి.

---

(*శ్రీరామారావుగారి కృష్ణ లీలాతరంగిణి నుండి)

(1) శ్లో॥ ...స నందతనయః కరపంకజేన పస్పర్శ శి+ మ్...,,
(2) శ్లో॥ మయి మాతృణాయ సదనా ద్బహి ర్గతె,,
(3) శ్లో॥నవనీతచోర తవ శి+మాహరామి ... మమ శి+చుంబనమిదం...,,
(4) శ్లో॥ సుభగే త్వదీయ మయి శోభనంభ+o మమ దర్శయ ...,,
(5) శ్లో॥ అధిరుహ్య చైష శయనంశయానమ,త్తనయాశ్రుతౌనిహితవాన్నిజంపదం
(6) శ్లో॥ మమబాలికాభ+బిలేతవాత్మజో నిధథేకరాఁబురుహమధ్యమాంగుళిం
(7) శ్లో॥ ...ఆత్మమాతృవివృతా ననాన్తరే సమమూత్రయత్,,
(8) శ్లో॥ ...ఇతి బాలికాంగ మఖిలం విశాఽఽత్మనః పరిలిప్తవాన్...

☞ దిఙ్మాత్ర ముదాహరించితిమి ఇట్టివెన్నో కలవని యెఱుఁగునది ఇందునుగూర్చినవిచారణమునకు శలభాలభనము, చూడఁదగు 'ప్రమాదోధీమతామపీత్యత్ర అపిశబ్ద ఏవకారార్థకః, అతోనరామరాయ స్యైతావతా కించిదపి న్యూనతా సతు సర్వథా సమర్థ ఇతి శివమ్,

మత్త॥ రామరాయని కైతలోని దురర్థపున్ విరసప్రయో
గామయ మ్మది త్రిప్పరానిది యాట మిన్నక యుండి వి
ద్యా మహేంద్రులు "పశ్య" శబ్దముపైని నారెకుఁ గొంద చే
మేమొ వ్రాసిరిగాని నీదయ నేమె కొంటిమి గెల్పులన్.

గెల్పులు.

☞ పరా:— 'పశ్య' అనుశబ్దము తప్పనియు, ఉపసర్గపూర్వక 'పశ్య' శబ్దము సాధు వనియు, కాశికావృత్తిమతము, రెండును సాధువు లని కౌముదీమతము, మొదటిది ప్రాచీనమతము, రెండవది నవీనమతము, మొదటిదే మంచి దని మేము, రెండవదియే మంచి దని మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రులవారు లోనగుకొందఱుపండితులు, ఇందునుగూర్చి పత్రికావాద మొక సంవత్సరన్నరవఱకు జరిగినది, కాని యీక్షణమువఱకు మావాదమే స్థిరపడియున్నది. ఇందుఁ గౌముదీమతానుసారముగా వాదించినవారు (1) మంత్రవాదిసూర్యనారాయణశాస్త్రులవారు, (2) తాతా సుబ్బరాయశాస్త్రులవారు, (3) పురుషోత్తమరామశాస్త్రులవారు, ఇందు, తుట్టతుదివారు బెల్లంకొండ రామారావుగారిగురువులు, వీరు కడు శీఘ్రముగా నోడిపోయి రని చెప్ప వలసివచ్చినందులకుఁ జింతిల్లుచున్నారము, మొదటివారుతమశిష్యుపేరితోఁ బత్రికలు ప్రకటించినవారు వీరు శ్రీరాయఁడుశాస్త్రులవారిశిష్యులగుజయంతిభగీరథశాస్త్రులవారిచే నోడఁగొట్టఁబడిరి, ఆయీవిద్వన్మణులు వివాదమునకు దిగుటకుఁ గారణము మొట్టమొదట మేముప్రకటించిన 'పశ్యాంపుశ్యాం' అనుచిన్నిపొత్తము; వీరిలో వీ రిట్లు ఖండనమండనము లొనర్చుకొనుచుండఁగా మున్నుదాహరించిన మహామహోపాధ్యాయులవారు తటస్థులుగా నొకతీర్పును దీర్చి ప్రకటించిరి, దానిపై జయంతిభగీరథశాస్త్రులవారు వ్రాయవలసినవిధియున్నను సర్వాపవాదక మగుగురుశిష్యన్యాయము దానికి బాధక మయినది, అంతలో శ్రీరామారావుగారు తమవాదము గెలిచినదను సంతోషముతో నిట్లొకరిపేరఁ బ్రకటింపించిరి.

(నవంబరు 1వ తేదీ 1912 సం॥ దర్బారునుండి.)

## పశ్యాపశ్యానపశ్యతః

1 పాఘ్రాతి సూత్రములో పైసూత్రమునుంచి ఉపసర్గపదమును కాశికాకారుడుఅను వృత్తి చేసినాడు గానపశ్యశబ్దమసాధువు, కౌముదీకారుఁడు అను వృ

త్తి చేయక పోయినందున పశ్యశబ్దము సాధువుఅని కొందరందురు గానిఅదిసరి కాదు- కౌముదీ కారునికంటెకాశికా కారుడు ప్రాచీనుడుగాన ప్రాచీనమతమే సాధువు అని"పశ్యాం పుశ్యాం" గ్రంథకారుడువ్రాసినారు. 2దీనినిఖండించిమంత్రివాదిసూర్యనారాయణశాస్త్రిగారిశిష్యులు నల్లానిచక్రవర్తి వెంకటాచార్యులవారు జ్ఞానాదిగుణములచేనధికుడు గాన కౌముదీకారుడు చేసిన అననువృత్తియేబాగున్నది అందువల్ల వైదికప్రయోగములు మహాకవిప్రయోగములు కుదురుచున్నవని వ్రాసినారు. 3 ఇందుమీద మహామహోపాధ్యాయ తాతాసుబ్బారాయశాస్త్రిగారి శిష్యులయిన జయంతిభగీరథశాస్త్రిగారు జ్ఞానాదిగుణములచే కాశికాకారుడు తక్కువవాడుకాడు. ప్రాచీనుడు గాన నీతనిమతమే గ్రాహ్యమని వ్రాసినారు. 4 దీనిని ఖండించి వెంకటాచార్యులుగారు, కాశికాకారుడు ఉపసర్గపదమును కొందరను వృత్తిచేయరని వ్రాసినందున కౌముదీకార మతము కాశికాకార మతముకంటె ప్రాచీనమయినది. కాన అదేగ్రాహ్యమని వ్రాసినారు. 5 విజయనగర మహారాజ సంస్కృత కలాశాలా ప్రధానోపాధ్యాయులును మహామహోపాధ్యాయులు నగు తాతా సుబ్బారాయశాస్త్రిగారు ఉపసర్గపదమును అనువృత్తిచేసిన అన్నం భట్టాదులే పశ్యశబ్దసాధుత్వము నంగీకరించిరి, కాతన్త్రవృత్తికర్తయగు దుర్గసింహుడు కూడపశ్య శబ్దము సాధువని వ్రాసినాడు. సారసత్వ వ్యాకరణమునందుకూడ అనువృత్తి లేదు- గానపశ్యశబ్దముసాధు వేనని వ్రాసినారు. 6 (వాక్యార్థ చంద్రికా వ్యాకరణగ్రన్థకర్తలగు బ్రహ్మశ్రీ)భాగవతుల హరిశాస్త్రిగారి శిష్యులగు పురిఘెళ్లరామశాస్త్రిగారు సూత్రభాష్యకైయటములయందుపశ్యశబ్దము ప్రయోగింపఁబడి యున్నది గాన కాశికాకారమతము తద్విరుద్ధమైనదని వ్రాసినారు. 7 ఇవియన్నియు అచ్చుపడేయున్నవి. ఇక 'పశ్యాంపుశ్యాం'గ్రంథకారులకు తత్పక్షపాతుల స్వపక్షపాతమే గతిగా కనబడుచున్నది.

బెజవాడ. హితవాది.

పైప్రకటనము శ్రీరామారావుగారు వ్యాకరణవిషయమునఁ బరప్రత్యయనేయబుద్ధు లని చెప్పక చెప్పఁగలదు, అదియటులుండె. ఈహితవాది నామధారి కడువృద్ధు, శాస్త్రాభిమానమును బురస్కరించికొని మమ్ముఁ బరోక్షమున దుర్భాష లాడుటలోఁ దప్ప నన్యత్ర యితఁడు మంచిచెడ్డల నెఱిఁ

గినవాఁడు, ఈతని పేరఁబ్రకటింపఁబడిన పైపత్రిక యొక్క మాతృక మావద్దకువచ్చి యున్నది. బ్రాకెట్టులోనున్న 19అక్షరములనుహంసపాదముంచి రామారావుగారు వ్రాసినవి కాన రామారావుగారు కారణాంతరమునఁ దమపేరితో వాదమునకు దిగకయున్నను "నిందుజోక్యమే లేకయున్నా" రనువారివాదము సత్యదూరము, ఈ యంశము నేయీక్రిందిపంక్తులు బలపఱుపఁగలవు.

(అభినవసరస్వతినుండి.)

"...పైగ్రంథములు చూడనికతన రామారావుగారు "పశ్య" అనునది సర్వమతములను సాధువేయనువిశ్వాసముతో నరసారావుపుర వాస్తులు వ్రాయు నుత్తరములకు సమ్మతించిరి. పదపడి యథార్థమెఱిఁగి మిన్నకుండిరి. అది వారియోగ్యతను వేనోళ్ల జాటుచున్నది. అనవసరముగాదూషించి మనబోఁటులొనర్చు ప్రకటనలవలనఁ దేలఁదగు నంశమును నేను వేఱ వ్రాయనక్కఱలేదు. చేతనైనచోఁ బత్రికాముఖముననో సభాముఖముననో సమస్యనుగూర్చి పండితసమక్షమునఁ బెనఁగుటయుక్తము, లేదా? యింతటనేని మిన్నకుండుటయుక్తము- యథార్థము నొప్పికొన్నచో మనకప్రతిష్ఠ లేదు- జన్మాంతరమున కేని రామారావుగారు, సమస్యను నేను బంపలే,దని కాని, నరసరావుపేటసభకు వచ్చి వెళ్లిపోయి పదంపడియుత్తరములు వ్రాయింపలే,దని కానియందు రని నేననుకొనను సమస్యతప్పని నిరూపింపఁగలిగినచో నూటపదియాఱులు తామిత్తుమనియు లేనిచోఁ దమకీవ్వవలెననియు రామారావుగారు తిరుపతివెంకటేశ్వరులకు నాచేతనే చెప్పిపంపిరి. నేనబద్ధమాడుదునందురా?

సీ॥ రసికులు సుజనులై రాణించు పులిపాక పూర్ణయ్యగారెనా మొదటిసాక్షి
పణవిత్త మీ నిష్టపడిన రూపెనగుఁట్ల హనుమంతరావుగా రవలిసాక్షి
విప్పర్లపల్లాఖ్యవిపులాగ్రహారస్థ పండితద్వంద్వమా పైనిసాక్షి
వేమవరస్థుఁడౌ వెంకటకృష్ణాఖ్యమేదినీదేవుఁ డామీఁదిసాక్షి
తే॥ గీ॥ ఇంక నెందఱోయున్నవా రిందఱేల, రామరాయాఖ్యపండితరాజొకండె
"చెప్పిపుత్తెంచ లేదిట్టులప్పు"డనుచు, బలికిన జా నాకుఁజాలు నో ప్రౌఢులార.
రామారావుగారు స్వయముగా వాదమునకు దిగకుండుటకుఁ గారణము వా

---

రి శ్రీకృష్ణలీలాతరంగిణిలోని హేయప్రసంగము గాని వే కాదు, అదియటులుండె, పిమ్మట మేము 'పశ్యశబ్దవిచారము' అనువ్యాసమును వ్రాసి మహామహోపాధ్యాయులవారివాదమును ఖండించుచు, "గ్రామం గచ్ఛన్ తృణం స్పృశతి" గా రా

మరావుగారి/సుతవుగారి వాదమునుగూడ ఖండించితిమి. అంతతో నాయీపండితులు విరమించిరి, పిదప రామారావుగారే స్వయముగా వాదమునకు దిగవలసినవారైరి కాని స్వనామగోపనము మున్ను చెప్పిన హేతువున వారి కావశ్యక మయ్యెను. అట్లుగూఢరీతి నవలంబించివారు, (1) పశ్యశబ్దమీమాంస,(2) పంచాననపలాయనము (3) గుంజాగర్వభంజనము, అనుమూడువ్యాసములు మిగులఁబచ్చిగా వ్రాసి ప్రకటించిరి, ఇందు మొదటిరెండును 'పశ్య'కు సంబంధించినవి, మూడవది తమ లీలాతరంగిణిని, సమర్థించుకొనుట కేర్పడినది. ఈమూడును మాచే రెండువ్యాసములతో ఖండింపఁబడినవి, అందు మొదటిది పిష్టపేషణము, రెండవది 'శలభాలభనము, అంతతో నా'పశ్య'వాదము సమాప్తమైనది,ఆయీవాదమునుగూర్చినవిశేషాంశములు తెలియఁగోరువారుప్రత్యేక మందులకుఁగా నేర్పడిన 'పశ్యాంపుశ్యాం" లోనగుగ్రంథములు చదువఁగోరెదము, అవి యెల్ల నిందుసుదాహరింపవలసియున్నను, గ్రంథవిస్తరభీతిచే నందులకుఁ బూనమైతిమి, విద్వద్వాదము గాన నదియంతతో ముగిసినది, గాని యవిద్వద్వాద మింకను జాలుమూలములు లేక 'హితకారిణీ,మనోరంజనీ, పత్రికలలో డిద్ధబిద్ధడబిద్ధాదులవలనఁ బ్రకటింపఁ బడుచునే యున్నది. అందునుగూర్చి పీఠికలో సంగ్రహముగాఁజర్చింపఁబడును. శ్లో॥ మూర్ఖాణాం పండితా ద్వేష్యాః" (భారతముశాంతిపర్వము...)

తరల॥ తనదు వాదము న్యాయ్యమైనను దైవవంచన కల్గి నెం ౨౩౩
దునకు మాఱక సారె దుమ్మున దూళిగాఁ గనుపట్టు చో
వ్వనకు నక్కవి చింత నొందుచుఁ బోవు త్రోవ యొకంయునుఱ్
గనక విజ్ఞుఁడు గాన నేవియొ గ్రంథముల్ గనునంతటఱ్.

తరల॥ తిరుపతిఱ్ మఱి వేంకటేశునిఁ దిట్టి యత్తఱి నెవ్వఁడో
*"పరశురాము" లటంచుఁ బద్దెము వ్రాసె నొక్కఁడు యుక్తిమై

---

(అక్టోబరు 16 తేది, 1912 సం॥ దర్బారునుండి.)

ఉ॥ తామసవృత్తి వీడి యుచితస్థితి నిక్కము నాలకింపుఁడీ
భూమిపులందఱన్ దునిమి పుట్టెల నాకపు మెట్లుఁ జేసి యు
ద్దాముఁడునైన భార్గవుఁడు తప్పినుమంతయు లేనియట్టి శ్రీ
రాములఁ దూలనాడిమె పరాభవ మొందుట మీ రెఱుంగరే.

పరశురాముఁడు రాచపురుషులఁ బట్టి నేలకు వ్రాయు ట
త్తఱి మఱెందుకు సంభవించెనో? తత్త్వమంబరో యెఱుంగవే. ౨౩౪

మత్త॥ గోవు కోసము హైహయుం డొకకొంత కోపము చేసె నా
గోవిశేషపరీతుఁ బట్టుక కూలనేసెను రాముఁడున్
గోవు నా మఱివాకు గ్రన్నఁగదే? కోవిదుల్ పరికించినన్
దేవి? యిమ్మెడ దానికై కడ తేర్చి రెవ్వరు రాజులన్? ౨౩౫

మత్త॥ మేమె రాజుల మంచు కొందఱు మిన్ను ముట్టుచు వత్తురో?
నేమ మేగతిఁ గాంచ నేర్తురు? చెప్పు మట్లగు పట్టునన్
రాముఁ డుద్భవ మందునంతకు రాజు లేమయిరో కదే?
జామదగ్న్య కుఠారధారకు జాల్చుఁ డేమి యొతింగెడిన్. ౨౩౬

మత్త॥ రాముఁడే యలరామరావని రాజు లిప్డు వచింతురో?
మేము నొప్పెద మాతఁ డేగతి మించి నిల్వఁగ నేర్చెడిన్?
ఏమియందురొ? వచ్చి బూతుల నేరె చూపితి మంబరో?
రామరావు కవిత్వమందుఁ బరాభవం బవి కూర్చెడిన్. ౨౩౭

మత్త॥ కాన నాతఁడు రామరావగుఁ గాక నామసదృక్షమా
దానిఁ బూని యెదుర్ప నేరఁడు దైవవంచితుఁ డౌటచే
నీనఁ గావలె భూమి యీపయి నింక నొండొక రామునిన్.
లేనిచో పరరాజు లూరక లేవ రైబెడఁ గావలెన్. ౨౩౮

తరల॥ తిరుపతిన్ మఱి వెంకటేశుని దిట్టు నింకొకరుండు గ్ర
చ్ఛలను "రావణకుంభకర్ణు" లటంచు దుఃఖము దీఱఁగన్.
అరసి చూచిన నిదియు వెన్కటియట్లె రామునశక్తతన్
స్ఫురిఁగె రాముఁడు పుట్టుఁగావుత శూరుఁ డింకొకరుం డొగిన్. ౨౩౯

☞ ఆయీదర్బారు పత్రికలలోని ప్రతిపక్షీ పక్షీయుల ప్రలాపముల
కెల్ల మేమిచ్చినప్రత్యుత్తర మీక్రిందనుదాహరించుచున్నాము.

(అభినవసరస్వతినుండి.)

"పండితాయతే".

శ్లో॥ భిత్వా సర్వా ణ్యరణ్యా న్యతివిషమలతాగాఢదుర్గాణి భూమౌ
యాయాన్తం పక్షిణాన్తం భషకతతి రియం బుక్కనై ర్ధిక్కరోతి

లజ్జన్తే హన్త మేనాం మదకరటిఘటాభేదసంఘట్టరూఢ
క్రీడాధారేయధారా మమ ఖరనఖరాః కింకరోమి క్వయామి.

(పండితరాజశతకం.)

శాఖాభిమాని భ్రాతలారా!

తగిన ప్రత్యుత్తరమును లిఖింపనేరని "పండితాయతే" గారి ప్రేరణముచే డిథ్థబిద్ధాదులపేళ్లతోఁ దిట్టితిట్టి యానందించుమీయోగ్యత పండితరాయలుతప్ప నితరులు వర్ణింపఁజాలరు. "కృష్ణలీలాతరంగిణి" లోనిబూతులు గోపురాదులమీఁదిబూతులతోపాటు కోర్టువారు క్షమింతురని సంతసించెడిమీసంతోషము కడు వర్ణనీయము, బోలెఁడులక్షణగ్రంథము లుండఁగా దాని కీగతి పట్టినందులకు మీయంతట మీరేయొప్పుకొనుటచే దానియోగ్యత వెల్లడియైనది, కాశికను ఖండింప నేరక యేదో వెఱ్ఱిమొఱ్ఱిమాటలు వ్రాయుటవలన నేమి ప్రాజ్ఞులనూటరానియవాచ్యవచనములతో మమ్ము నిందించుటవలన నేమి మీ "పండితాయతే" గారిలోఁతు విస్పష్టమగుచున్నది. సరియైనయుత్తరము స్ఫురించినచోఁ దిట్లతోఁ బని యుండదుకదా! కాశిక ప్రకృతము పఠనపాఠములలో లేదనుట వట్టిపిచ్చిమాట. విశేషములు తెలియఁగోరువారు చూచుచునే యుందురు, సామాన్యులు కొందఱు లఘుకౌముదితోడనే తృప్తినంది సిద్ధాన్తకౌముదినే ముట్టరు. అంతతో దీనికిఁగాని దానికిఁగాని గౌరవము చెడదు. కాశిక నక్కడక్కడ దీక్షితులుగారు ఖండించిరని వ్రాసి దాని నప్రమాణ మనుట యుక్తముకాదు, ఎక్కడ నిప్పుడు దానిని మనము ప్రమాణముగాఁ బట్టుచున్నారమో అక్కడ దీక్షితులుగారు ఖండించినది యుక్తమా! కాదా! అనుసంశయము తేల వలసి యున్నది. అందులకు మీవారు పూనవలసియున్నది. కాశిక ననుసరించియే 'పదవాక్యప్రమాణపారీణు'లెల్ల వ్యాఖ్యానములను వ్రాసియున్నారు. అప్పటికి భాష్యమున్నను దీనిని వారంతగా గౌరవించుటచేనిది భాష్యతుల్యమని మేము వ్రాసితిమి, నైషధములో "ధయాం" అనుప్రయోగమును యథాకథంచిత్సాధ్యమయిన దానినిగా వ్రాసిన మల్లినాథసూరిగారేమి సోపసర్గములుగా "పాఘ్రాధ్మా" సూత్రమునకుదాహరణములు చూపిన మహావైయాకరణశిరోమణి భట్టియేమి మఱికొందఱు ప్రాచీనులేమి మావాదమును బూర్తిగా బలపఱచుచున్నారు, కాశికను గాని మమ్మునుగాని వారినిగాని తిట్టిన చో

దిట్టిన వారినోటికంపు బయలువడునే కాని వాదము నెగ్గదు- సమస్యాపూర్తిం గూర్చి చొప్పదంటుశంకలను బ్రకటించితిరిగదా; అందు డిద్ధబిద్ధాదులచే వ్రాలు చేయించితిరేమి? నానావిధముల మమ్ముఁ దిట్టియు వేఱొకరిని బొగడియు నెవరికి 'బ్రహ్మపట్టము, గట్ట నుంకించుచున్నారో వారివ్రాలే యందుఁ దగిలింపుఁడు- పస తెలియఁగలదు- ఏకకాలమునందు సర్వజగద్దర్శనయోగ్యత లేక పోవచ్చును గాని పర్యాయముగా నేల యుండఁగూడదు- మఱియు 'యః' అన్నచో 'జడపదార్థః' అనరాఁగూడదని యేపండితుఁడును బలుకఁడు- 'పండితాయతే,లుపలుకుట వింత కాదు "సర్వనామ్నాం బుద్ధిస్థత్వోపలక్షితధర్మావచ్ఛిన్నే శక్తిః" ఇది నిష్కృష్టసిద్ధాంతము- గత్యంతరమేదియును లేక వృథాగ బూతులు తిట్టుమీకేమాత్రమేని వ్రాయుట యనవసరమే- అంతేవాసులలోఁగూడ మీకుఁ దుల్యముగాఁ దిట్టువారు మాకుఁ జేకూఱమి నింతటితో నివ్వటికి విరమించితిమి. "మూర్ఖంఛందానురోధేన"

ఇట్లు,

తిరుపతి వెంకటేశ్వరులు.

మత్త॥ అంతదనక్కను మాప్రతాపమహత్త్వమే యలరారుతన్
చింత నొందుచుఁ దిట్టి పోయుచుఁ జేతిగాజుల మ్రోఁతతో
గొంతు బొంగురు వోవ రోఁజుచు గోఁకి కొంచు శిరమ్ములన్
మంతనమ్మునఁ గుట్రఁజేయుచు మార్తు రంకుత మంబికా. ౨౪౦

మత్త॥ "చాల దీయవతార మింకను జాలలోపము లుంటచేఁ
జాలువాఁ డుదయింపఁ గావలెఁ జాల నందులకై తపం
బొలిఁ జేయుఁడుఁ మీరలెల్లరు నూగకే యిటు మ్రోఁగుటల్
శీలవంతులు మెచ్చ,:రంచును జెప్పమంబరో వారికిన్. ౨౪౧

తరల॥ పరశురాముఁడు రాజవంశముపైన వారొనరించె నీ
పరశురాము లటుల్ పొనర్పమి ప్రాజ్ఞులెల్ల నెఱుంగరే
ఉరక తిట్టుట కట్టువ్రాయుచు నుంట నింతవచింపఁగాఁ
దఱి ఘటిల్లెను యుక్తిచెప్పమి తప్పు నక్రవి కంబికా. ౨౪౨

చ॥ కపితము గట్టు చుట్టములు 'గాడిద' లెద్దులు, మొద్దు, లంచు న
చ్చపుఁదమతెల్వి యంతయును శాశ్వతమై రవిచంద్రమోనభః

కుపదవు లుండునంతవఱకున్ వెలుఁగన్ గిలుకొంగఁ జూచ్చి రీ
కుపితులు గోఁకు పద్దెములకున్ దరి యంచును గాన మంబికా ౨౪౩

తే॥ గీ॥ అన్నితిట్లకు నాఁటి సహనమున, కేమ మోమోడమనుటయే హేతు వంబ?
వారిమోముఁ జూచినయంత వారిలోఁతు, స్వాంతమున కెక్కు కతన నాపన మునీము.

చ॥ ఇతరు లెఱుంగు బెట్టు లెవఁ డేపని సేయును దానిగుట్టు తా
నతఁడె యెఱుంగుఁగాక భుజగాంగ్రుల పద్ధతి నేఁ డెఱుంగు, నూ
ర్జితుఁడు మఱొక్క-చో నయినఁ జేసెడిదేమి మఱొక్క-పట్లు? నే
చతురుఁడు వీరి మెచ్చినను సత్సభ* స్వాంతము దాఁచియే సుమీ. ౨౪౫

---

| పోష్టుముద్ర | 4 సెప్టెంబరు 1911 ఏగ్లూరు. | లైబ్రరీ సోమవారం |
|---|---|---|

*... ఈవివాదమును గూర్చికొంతవ్రాఁత చూచిన నాటి రాత్రి 27 తేది... మీ కాగితములు వచ్చినవి, ఈస్థితిలోనున్న నాకు ఒడలు పులకలెత్తెను, మహోత్సాహానందములు కల్గెను, నేనుకూడ ఇప్పుడు గుంటూరు రావీలుండిన బాగుండును ...నాకరీవీలులేదు, .. కొప్పరపుంగవులు ఇక్కడ నవధానములు చేయుటలో అష్టావధానము పేరేగాని, లక్షణమింతేనియు లేదు, సమస్యలు ముందు చెప్పించుకొనుట...వ్యస్తాక్షరిలేదు... ఒకవేళ వివాదసభలు జరుగునేని ... అష్టావధానము ప్రధానముగా ముందుపరీక్షింపవలసినది, అందు వ్యస్తాక్షరిముఖ్యతమము, వారిఆశుధార గొప్పదేకాని ... వేలకొలదిపద్యములుతిరుగుచున్న మామూలు చక్రమే గాని క్రొత్తరీతిని దిరుగదు. ఈయూరనిచ్చిన కథవారు చెప్పనేలేదు ఇతరం వారి బాటను కొట్టిపోసిరి. వారి బాట తప్పించి (సంభవించెనేని) ఆశుకవిత చెప్పింపవలెను. మాలో శివరామశాస్త్రి కృతార్థతముఁడు, నాయానందమతనికిఁ దెల్పుఁడు. మీరావారితోఁ దులగా వాదింప నేనిచ్చగింపను. గెల్చినవచ్చెడు ప్రతిష్ఠయెంత? ఇఁక నీవాదము లేల? మీరువదలుటయే నాకోరిక. శివరామశాస్త్రియు వలదు, వారెట్టి పాండితికలవారని;...నాటి వివాద స్వరూపము, బీజము, ఎట్టిది? ఆయూర నిరువాగులను బ్రోవాను లెవరు. యావదంశము మీకు వ్యవధిలేకున్నను మనకుఁ బరమమిత్రులగు బ్రహ్మశ్రీ...గారిచేనయిన వ్రాయింపుడు...ఇంకను అచ్చులోనున్నరి కార్డుప్రూఫులయినను వెంటనే పంపుదురుగాక. వే. వ్ర.

ఉ॥ వచ్చెడి పండితుండెవఁడు? వచ్చినవచ్చుత వచ్చి సత్సభన్
మెచ్చెడి పండితుండెవఁడు? మే మఖిలంబు నెఱింగినార మీ
పిచ్చికవిత్వ మూఁతగొని పీఁకెదరంటు? దడాల్న మీద మీ
సచ్చరితుల్, వృథానుతులు సైఁచెదరంటి? స్వపక్షులంబికా. ౨౪౬

చ॥ ఎఱుఁగని యట్టు "వీరు కవులే" యని యొప్పినతప్పు సైఁపు మి
ట్టెఱిఁగితి మాన్యముం దెఱచుటే తడ వంతయు స్పష్టమయ్యె, నీ
శ్వరుఁ డొకసాక్షి వీ రున్నడువు వద్దెయులం దపు డెన్ని వీరు గూ
ర్తురొ మును పల్లి యెన్నియట దూర్తురొ యంబిక? నీవెఱుంగవే. ౨౪౭

ఉ॥ పత్రికవారి ఘోషయును బామరతన్ మొగమోడి మెచ్చు మా
మిత్రులఘోషయున్, దెలిసి మేలు ఘటింపఁగ నెంచి మెచ్చు మా
ఛాత్రునిఘోషయున్, గని ప్రశంస యొనర్చుచు నాఁడు యోగ్యతా
పత్రిక నంపుతప్పిదము పండితమండలి సైఁపఁ గాఁ దగున్. ౨౪౮

ఆ॥ వె॥ శక్తిలేక పూను 'సర్టిఫికెట్టు' లా,యువు లవమ్ము లేకయును దమంతఁ
బెండ్లివేళ నిచ్చుపెద్దలదీవనల్, పొందినార మనుచుఁ బొంగిపడుట.

క॥ అవసర మైనకతమ్మున, వివరించితి మంబ? ఘోషనితమెల్లను నీ ౨౪౯
సవిధమున నెఱిఁగి యనృతము, దవిలించితి మేని నీవ దండింపఁ దగున్.

శా॥ ఖడింపంగలశక్తి యున్నయెడఁ గాకన్యగ్రిణీవ్యగ్రితా
ఖండాహంకృతివారకం బయిన యీకబ్బంబు నేరేనియున్
ఖండింతుర్గద, సోదరుల్ వృథగ వాక్రుండూతి వోఁ గొట్టుకో
"నెండుంగండి, గ నేమొ దూఱుదురు మా కేమంతలోఁ బోయెడిన్. ౨౫౦

గీ॥ వారుమాటినకొలఁది నవారిగాఁగ, మాయశము లోకమునఁ బర్వమాకుఁ గీర్తి
కన్న నన్యలాభమ్ముల నెన్నఁ బూనిక్రి, లేదు ప్రకృతశేషమ్ము నాలింపు జనని.

ఉ॥ అంతట నయ్యె వేసవరమం దవధానము వైరు లెంతయున్
జింతలచేఁ గృశించి పరిశీలన చాలక సారెఁ దప్పుడుం
బుంతలవెంబడిం బడి ప్రభూతనయుల్ 'కడు రోయ దూయమా
నాంతరులై మఱేదియు నుపాయము గానక కుంద వొందఁగన్ ౨౫౧

సీ॥ తలుపోరగామూసి వెలవెల్లమోముతో నొక్కఁ "శశ్శోఛటి" మాదికుఁ జూచు
తనయింటి యెదుటి కందలము రావేగవే యొక్కఁ "శశ్శోఛటి", తలుపాఁచి వైచు
"పశ్య" వాదంబు'స్వప్నపుముల్లె' యయ్యో'నంచొక్కఁ "శశ్శోఛటి" సైరోడ్చఁగనుల
"కాశిక" నటుపాముగఁ జెఁగా'హు'మ్మంచునొక్కఁ "శశ్శోఛటి" పండ్లురకకొఱుకు
గీ॥ కాశికనుజూపి "నూజాప్లు" గట్టుఁ మనుచుఁ, గొట్టు కీడ్తురొ యేమొ నాకొంపదీసి
యంచునొక్కఁ "శశ్శోఛటి" లో నటమటించు, నరస రాట్పురిత్రోవ మేమరుగుతఁని

ఉ॥ "పాలిరి కృష్ణదాఁటి" యని వాగ్వ్యయము న్మను సారెఁజేయునా
కారణ మంతరంగము నగల్పఁగ వేమవరమ్ము మే మెటుల్
చేర భయమ్ముఁ గొంకు మటు చేకుఱఁ జెన్నఁటి సేఁత లెన్నినా
కూరిచి వ్యర్థులై చెడిరి కొప్పరపుంగవిశత్రులత్తఱిన్. ౨౫౪

చ॥ సకలము నీమనం బెఱుఁగు సత్యవిదుల్ పలుమం దెఱుంగుదు
ర్నికరము దేల్పఁ పూర్వమె మనీషిహితమ్ముగ ముద్రితంబునన్
బ్రకటితముం బొనర్చి నప్రబంధ మెఱుంగును గాన దానిఁ బ్ర
వ్వకయటఁ జూచికొం డనుచుఁ బ్రాజ్ఞులకున్ వచియింతు మంబికా. ౨౫౫

గీ॥ అంబ ? యంతకు మును చేసినట్టి చెట్ట, సేఁత లాకతల వేమవరాత్తాగ్ర
హారసత్పభాప్రత్యూహ మలవరింపఁ, బడ్డపాటు లింకొకతల పాపశమని ౨౫౬

ఉ॥ తప్పడు తోవలన్నియును దజ్ఞులు దగ్ధము సేయ నంతతోఁ
గొప్పర మూరకుండక ప్రకోపము చెంది* "రిజస్టరుత్తరం

---

*ఆశుకవి చక్రవర్తి, శతావధాని, కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ. కొప్పరముసంతమాగులూరుపోస్టు, గుంటూరుజిల్లా నొద్దినుండి.
} బ్రహ్మశ్రీ తిరుపతివేంకటకవులకు కాకినాడ, & బందరు.
(రిజస్టరుత్తరపు నకలు)

అయ్యా, మీరుప్రకటించిన 'గుంటూరుసీమ, పూర్వరంగము', అను పొత్త ను జూచితిని, అయ్యది 'సీ॥మాయమాటలకు నమ్మకమైన వ్యాఖ్యాత తులలేని వచ్చి బూతులకు బుంగ, అను మీశ్రవణానందమునందలి మదునలిబోగముదాని పద్దె మునకుదాహరణముగ నున్న దని చెప్పవలసివచ్చినందులకు జాలిపడుచున్నాఁడ ను. 'సత్యంవద' ధర్మంచర; అనువేదవాక్యములకు విరుద్ధముగా నసంబద్ధములై

ఇప్పుడు పంపెఁ "గే"సొకటి యావలఁ దెత్తు నటంచు సత్యమున్
దప్పి చరించువారలకు ధర్మములోఁ బని యేమి శాంకగీ. ౨౫౭

---

న యనృత వాక్యములతో మమ్మును, మమ్ములనుబట్టి మానియోగిశాఖను, ఈవిధము గనిచ్చవచ్చినట్లెల్ల నిందించుటకై మీకాలమును, మీపాండిత్యమును, వినియోగించి, ఇట్టినికృష్టోద్యోగమునకు, మీమిత్రులఁగూడ నియోగించి వారిచేఁగూడ, అసత్యప్రకటనములం జేయించి, యకారణముగ మాహృదమున కాయాసముం గలిగించితిరి.

2. ఏడనో యున్నవా రున్నట్లుండక మదీయాశుకవిత్వావధానములనుబద్యములతోఁ బ్రశంసించుచు ముందుగ మాకులేఖ వ్రాసి మాస్నేహమును సంపాదించుకొని పిదప మాప్రతిభయు, మాకీర్తియు, మారాబడియుఁ జూచిసహింపలేక వృధాభిమానులగుమీశాఖవారిదుర్బోధములకుఁగూడ లోనై యనవసరముగ నానన చర్చయొకటి గల్పించి యస్మత్కృతోపకృతి నేని స్మరింపక, కయ్యమునకుఁ గాలుదువ్వి మేము ప్రతిజ్ఞాపద్యములను వ్రాయవలసిన యవసరమును గల్పించి చివరకు సభకు రాక సాకులు పన్ని తప్పించుకొని బందరు కాకినాడలకు, వేంచేసితిరి.

3. అప్పటినుండియు విరామము లేనిమాయవ్రాఁతలకుఁ బూనుకొని మాఱుపేరులతో మాయలేఖలం గొన్నిటిని బ్రకటించి స్వజనముచేఁగూడ నట్టివే కొన్నిటిని బ్రకటింపించి యంతతోఁగూడఁదృప్తిలేక "హితోపదేశము" అనుపేరునఁ గొన్నియనుచితములు వ్రాసిప్రచురించితిరి, అప్పుడే మేము మీమీఁద గొంత చర్చ జరిగింపవలసియున్నను, ఎన్నటికేని మీతప్పులను మీరు తెలిసికొని పశ్చాత్తాపమును బొంది క్షమార్పణమును బ్రకటింతురను సదుద్దేశముతో గొంతహితమును గఱపనెంచి 'జ్ఞానోపదేశము' అనుపేరునఁ గొన్నిపద్యములు వ్రాసితిమి కాని మా'జ్ఞానోపదేశము' మీకడఁ జెవిటివానిముందు శంఖ మూదినట్లయిపోయినది.

4. తరువాత మీరు పరికృతవ్యవహారమునకుఁ గారణభూతమైనట్టియు, ననత్యముల ప్రోవైనట్టియు. "గుంటూరుసీమ, పూర్వరంగము"ను, వ్రాసిప్రకటించితిరి, అందు మొదటినుండి చివరవఱకును మీరువ్రాసిన యసత్యాంశములను వ్రాయించుకొన్న యసత్యపులేఖలను, నారాయణశాస్త్రమూలకముగా ఖండించి లోకమున నత్యమును స్థాపించుటకై మేము ధర్మదేవతచేఁ బ్రోత్సాహితులమై బయలుచే

ఉ॥ ఇట్టి వృథాప్రజల్పకులు నిట్టివిదావద సార్వభౌము లై
నట్టి రసత్ప్రాధికరణాన్యహృదంతరు లైన కొంగ్రసపుం

---

మిక్కిలి దారుణమైన యీక్రిందివిషయమును గూర్చి మాత్ర మిప్పుడు తెలియఁజేయుచుంటిమి.

5. మాకప్రతిష్ఠను గలిగింపవలెనను దురుద్దేశముతో "గుంటూరుసీమ, పూర్వరంగము 87వపుటలో" కొప్పరపువారితప్పవ్రాఁతలు" అనుశీర్షికక్రింద నొకకల్పిత(ఫోర్జరీ) లేఖను బ్రకటించి, అట్టిదానిని మేమెవ్వరికో వ్రాసినట్లును, దానిప్రతిమీకు లభింపఁగా, దానింబట్టి దీనిఁబ్రకటించినట్లును, నొకయసంబద్ధపుఁగథఁ గల్పించి యుదాహరించితిరి, ఈమీమాయవ్రాఁత మాకప్రతిష్ఠను గలిగించునది మాత్రమే కాక, మాగౌరవమునకుఁగూడ భంగము గలిగించునదిగానున్నది. అందులకైతగుచర్యజరిగించుట మాకుఁగర్తవ్యము కావున మీకీలేఖయందినది మొదలు 24 గంటలలోపల నాలేఖను మేమెవరికి వ్రాసినట్లు తెలుపనెంచితిరో, ప్రతిమెవ్వరివలనలభించినట్లు తెలుపనూహించితిరో' వారిపేరుల నెఱింగించుచు, అట్టిమాయలేఖను మీరే యధికారముమీఁదఁ బ్రకటించితిరో లిఖితపూర్వకముగా మాకుఁ దెలియఁజేయఁగోరుచున్నాఁడను, "అంతకింతైనది, ఇంతకెంతగునో" అనుసామెతకుఁ దారుణముగా మీవ్యవహారము పరిణమించుటంజేసి ముందుముందేమిసృష్టింతురో యనుభయముకూడ మమ్ముఁ జాలఁగా బాధించుచున్నందున నిట్టిచర్యలోనికి దిగవలసివచ్చినందులకై విచారించుచున్నాఁడను.

షరా :— ఈవిషయము మీరిదివఱకుఁ దేల్చికొనినదియే యగుట, మరల నాలోచింపవలసిన యవసరముండదు. లేనిపోనియుక్తులతోఁ గాలముగడపక సదుత్తరము త్వరగ నొసంగుఁడు.

| | |
|---|---|
| వ్రాసినది, ఆశుకవి చక్రవర్తి, శతావధాని కొప్పరపు వెంకటరమణకవి, ఱడుపులు 4, నాలుగు, పంక్తులు 55 ఏఁబదియైదు (మక్కికిమక్కినకలు). | ఇట్లు,<br>కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ,<br>శతావధాని. |

☞ చదువరులారా:—

పై రిజిస్టరుత్తర మెందుకుఁ బుట్టినది, ఎందుకేమిటి సోదరులు

దిట్టల మాకు వాదులుగఁ దెచ్చిన తావక తారతమ్య సం
ఘట్టన మేరు మెత్తురు జగాన వచింపఁ గదమ్మ శాంకరీ. ౨౫౯

---

చేయనిపని చేసినట్లు మీరు ప్రకటించినందుకుఁ బుట్టిన దందురా? అటు లేని వారిస్వహస్తలిఖితములగు నీక్రింది యక్షరములను దిలకింపుఁడు.

శ్రీరాములు.

4-4-13. కొవ్వరము. సంతమాగులూరు పోస్టు.

అస్మద్గురుమూర్తులైన బ్రహ్మశ్రీ రామకునుగు రామకృష్ణశాస్త్రివారి పాదపద్మముల సన్నిధికి.

భవత్ప్రియశిష్యుఁడు. నమస్కారపూర్వకముగా వ్రాయు విజ్ఞప్తి.

"...వృథాహంకార లాంఛనంబగు వేంకటశాస్త్రిగారి మీసమును దీయింతుమని ప్రతిజ్ఞ సేయునప్పుడును. "సింహమున్నదని తెలిసియుఁ గొవ్వరపుఁగవులు కాకినాడకు వచ్చెదరా!" అనిన తిరుపతిశాస్త్రిగారు నివసించిన కాకినాడకుఁ జను నప్పుడును, కాకినాడలోఁ బలుసభ లొనర్చి, సామర్థ్యమున్న యెడల మాకు శత్రుఁ డగువాఁడువచ్చి మమ్మెదిరించి జయింపవలసినదని ప్రతిజ్ఞాపద్యములం జెప్పనప్పుడును, ఎంతకఠినముగాఁ గాలుద్రవ్విననుఁ నెదుటికివచ్చి శత్రువులు మారొకనమి చేఁ గాకినాడలో సుకవిపండిత శిఖామణులు సంతసించి స్తుతింప జయస్తంభము నాటి వచ్చినప్పుడును,......" చిత్తగింపుఁడు.

ఇట్లు, భవత్ప్రియశిష్యుఁడు,

కొవ్వరపు వేంకట సుబ్బరాయశర్మ, శతావధాని.

☞ దీనివలనఁగాకినాఁడలో—తి॥ వెం॥కవులఁబరాభవించినట్లు సోదరులు ప్రకటించుకొనుచున్నట్లు విస్పష్టమే యగునేని దానినే విపులముగాఁదెల్పు వీరివేరొక లేఖయొక్క నకలును బ్రచురించినమాకు సోదరులు రిజస్టరుత్తరము వ్రాయుటకర్థమేమో? విచారింపుఁడు, "ధర్మదేవత చేతనఁట? వీరఁట? పోత్సాహపఱుపఁబడిరఁట?" "నాఽశ్లీలం కీర్తయేత్" "బుద్ధిః కర్మానుసారిణీ" శాంతం పాపం, ప్రతిహతమమంగళం, అస్తుస్వస్తి. సర్వే జనా స్సుఖినో భవన్తు".

ఉ॥ దానికిఁ దగ్గ*యుత్తరము తథ్యవచోభరితం బొకండు మే
మానరులఁ గుఱించి వెస నంపితి మయ్యది గాంచియున్ వృథా

---

(మా రిజస్టరు జవాబుయొక్క నకలు.)

*శ్రీమత్పరదేవతాయైనమః.

మహారాజశ్రీ కొప్పరపు వెంకట సుబ్బరాయ వెంకటరమణకవులకు·

అయ్యా,

29-7-13 సంII తేదీతో నొకటియు, తేదీలేకుండ వేఱొకటియు మీరు మాపేర వ్రాసిన రిజస్టరుత్తరములకు జవాబు వ్రాయునది యేమన ?

(1) మీరిజస్టరుత్తరములోని సంగతులు యథార్థములైనవియు, నమ్మఁదగినవియుఁ గావు,

(2) మేము ప్రకటించిన 'గుంటూరిసీమ, పూర్వరంగము'లోని సంగతులు సర్వమును సత్యములైనవియే గాని యందసత్యము లెవ్వియును లేవు

(3) మా 'గుంటూరిసీమ' పూర్వరంగము, అను చరిత్ర గ్రంథములోని సంగతులు మీకప్రతిష్ఠ కలిగింపవలెననుదురుద్దేశముతోఁ బ్రకటింపఁబడినవి కావు, అవి లోకమునకు సత్యము వెల్లడిచేయు సదుద్దేశముతోనే ప్రకటింపఁబడినవి,

(4) తక్కిన మీరిజస్టరుత్తరములోని సంగతులు ప్రస్తుతము జవాబీఁదగినంత యవసరము కలవి గాఁదోఁచవు. 'మాగుంటూరిసీమ' పూర్వరంగము 87 వ పుట మొదలుకొని "కొప్పరపువారి తప్పువ్రాఁతలు" అను శీర్షిక క్రిందఁ బ్రచురించిన లేఖ "ఫోర్జరీ" కాదు, మీరొక గృహస్థునకు వ్రాసిన లేఖయొక్క నకలునుబట్టియే "మక్కీకి మక్కీ"గాఁ బ్రకటింపఁబడినది,

(5) మాకీర్తికి భంగమ్మును, మాగౌరవమునకు హానియు, మారాబడికి లోపమ్మును, మాప్రతిష్ఠకు న్యూనతయుఁ గలుగఁజేయవలెనను దురుద్దేశముతో నసత్యములును జుగుప్సాకరములును నగు సంగతులు గద్యపద్యోభయ రూపంబులుగాఁ బెద్దమనుష్యులమొదుట వినిపించినందులకును, సంపన్న గృహస్థులపేర నటువంటి సంగతులనే పదిమందికిని వినిపింపుఁడనికూడ వ్రాయుచు మీరు వ్రాయు వ్రాఁతలకును, మీమీఁదఁ గ్రమమైన చర్య జరుపుటకు ముందాలోచించియు దానిని జరిత్ర గ్రంథమగు 'మాగుంటూరిసీమ'లోఁ బ్రకటించి దాని సత్యమును లోకులకుఁ దెల్లము

గా నలవారు *తప్పనుడికల్పన లెల్లెడఁ జేయఁ బూని రెం
దేని యమార్గగాములకు దేవునివల్ల భయమ్ము గల్గునే. ౨౫౯



☞ చదువరులారా:—

పై నుదాహరించిన రిజష్టరుత్తరప్రుఁడుందుకుప్రసంగము వేమవరావధానమునకుఁ జాలనిటీవలిది, ఇంకను నిట్టి వెన్నో జరగవచ్చును, ఇఁక నీచరితము ముగించుచుఁ జరిత్రాంశమునకు మాత్రము సంబంధించిన పద్యములు గొన్ని వేమవరావధానమునుండి యుదాహరింతుము.

---

గా వినిపించిన పిదపనే చర్య జరుపవలెనని యెంచి ముందువని ముగించి ప్రస్తుతము మేమాప్రయత్నములోనే యుండఁగా, మీరిజష్టరుత్తరము వచ్చినందున దానికి జవాబుగా నీయుత్తరము వ్రాయుచు నదరు విషయమై క్రమమైన చర్య జరుపఁబోవుచున్నామనికూడ నిందుమూలముగానే తెలియఁజేయుచున్నారము,

చిత్తగించవలెను.

(సమ్మతిని)(1) దివాకర్ల తిరుపతిశాస్త్రి, } శతావధానులు { బందరు,
(2) చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, } { ధైరవప్రస్సు.

15-9-13.

---

*ది 27-10-13 సంll......

అయ్యా!

సోదరకవులు కొద్దికాలము క్రిందట మీకు వకరిజష్టరునోటీసును 24 గంటలలో జవాబు యివ్వవలసినదిగాను అట్లా యివ్వనియడ్ల మీమీద డామేజి తేవడమగునని సదరు నోటీసులో వుదహరించినట్టున్ను అందులకు మీరు సోదరకవులను క్షమాపణకోరినట్టున్ను మాచుట్టుపక్కల గ్రామాదుల్లో విశేషవాదుకకలుగజేశినారు అయినప్పటికి యిదివరలో నేను మిమ్ములను యెరిగివుండి మీసామర్థ్యతను గుర్తెరిగి యుండుటచే అందుల నిజానిజములు ప్రత్యేకంమీచేత వినగోరి వ్రాసినాను తక్షణం జవాబు వ్రాయించకోర్తాను. దివ్యచిత్తముకు తేవలెను

విధేయుడు, వసుమర్తి లక్ష్మీకాంతం వ్రాలు.

ఇందుఁ దుట్టతుదనుదాహరింపఁబోవు శ్లోకము, నాఁటి యవధానమునకు మంగళశ్లోకమని యెఱుఁగఁదగు, ఈయవధానమునకు సంబంధించిన విశేషములు సమగ్రముగాఁ దెలియఁగోరువారు దానికై ప్రత్యేకించి యచ్చయియున్న వేమవరాగ్రహారశతావధానమునందే చూఁడవలెను. దానివెల పోస్టేజీతో రు 0-14-0. ( ఇది 200 పుటలు గలది.)

## వేమవరాగ్రహార శతావధానము నుండి.

ఉ॥ చెన్నపురంబుచేసె నొకచెన్నుఁడు, వేమవరంబు నేఁడ హా?
చెన్నపురంబుగాఁ దొడఁగెఁ జెన్నయగారియుదారతాప్తిచే
నెన్నివధానముల్ సలిపి యేమిఫల? మ్మిట్టువంటి యన్నదానో
న్నతి యిట్టితృప్తియును నెందొకటన్ గన మోమహేశ్వరీ. ౧

ఉ॥ ఎందఱు పెద్దలన్నిలిపి? తెందఱపాదరజంబుచేత ని
మ్మందిరమున్ బవిత్రగరిమమ్మున నించితి? వెంతమంది నా
నందమునందు ముంచితివి? నవ్వులు గొంద ఱదేమొ కాని నిన్
జిందఁగనాడువారఁట? యిసీ? యిసి? రోసిశతావధానమా ౨

ఉ॥ అన్నముకోస మామడల కామడ రేగెడికాల మన్ననో?
"సున్నయు వాళ్ళ"యయ్యె నినుఁ జూచుతలంపుఁ జేసి గాక యీ
యున్నతు లింద ఱిట్టి క్రియ నొక్కటఁ గ్రిక్కిఱియంగ నేల? మా
యన్న? శతావధానమ? కృతార్థమవైతివి వేయునేటికిన్. 3

తే॥ గీ॥ "భాగి" పదమివ్వటికిఁ బుణ్యభాగియయ్యె
"చెన్న"పదమిప్పటికి నుతిం జెన్నుమీఱె
వేమవర మగ్రహారంబు హేమవరపు
నగ్రహారంబుగా మాఱె నంబ? యిపుడు. ౪

చ॥ జననపులగ్నమం దలరు శక్రగురుండును శుక్రుఁడున్ గుజుం
డును నలరాహువున్ ననుఘనుం బొనరించెడినంతెకాని యే
నును నొకసత్కవీశ్వరుఁడనో "తిరప" య్యయు నొక్క పేటి యో
యనఘ కవిగ్రహంబులు గ్రహంబులు గవ్వమ జేయువజ్రముల్. వెం॥ శా॥

సీ॥ మరల నెప్పుడు మీరు మాకు లభింతురో వందనంబయ్య ? విద్వాంసులార ?
మంచిపద్యములు క్రమ్మఱ విను టెన్నఁడో జోహారులయ్య? యోసుకవులార?
కన్నులు చల్లఁగాఁ గాంచుటే నాఁటికో మీకుఁ బ్రణామముల్ మిత్రులార ?
మరల నెన్నఁడు కనంబడును మీకన్నీరు మీకు మంగళ మాయమిత్రులార ?
తే॥ గీ॥ మరల మాచేత శారదమాన్యచరిత, ఉరక యెన్నఁడు చేయించునో? శతావ
ధానమా! దివ్యకీర్తి కథావిధాన, ధానమా! నీకుఁ గూడ వందనములమ్మ.

సీ॥ విశ్వజనీనుండు వితతభాగ్యుండు భా, గ్యనస్వాయుండు చెన్నయ్యగారు
పరమసాధువు మేళ్ళచెఱువు వంశాంభోధి, చంద్రముఁడైన శేషయ్యగారు
యజ్ఞోపవీతాన్వయాంభోధి కబ్జుండు, వేంకటాచలపతి వితతయశుఁడు
భాగి వంశ్యుండు వెంపటివారికిం దత్తుఁ, డైన వెంకటసుబ్బయార్యవరుఁడు
గీ॥ అశ్వమేధంబొ? రాజసూయంబొ సత్ర, యాగ మోనాఁగ నవధానమలవఱిచిరి
సాటి వెల్నాఁటివారును సాటిలేని, వారు వారికిఁగూడ నావందనములు. తి॥ శా॥

గీ॥ ఇతరశాఖయటంచు లోనించుకేని, భేదమెన్నక ననుఁ దద్దఁ బేర్మిఁ జూచి
గౌరవించినమి మ్మెన్నఁగలనె యేను, సర్వపములార? వెల్నాఁటిచతురులార?

చ॥ తిరుపతి యేస్గ గాఁగ గడిదేఱిన శిష్యు లనేకు లొప్పనైఁ
బారిఁబోరి రోఁజుచుఁ దనదుపొంతను బెబ్బులిపిల్లలట్టు చూ
పఱులకు దోఁపఁ గేల నొకపాటిది శెత్తముఁబూని వేంకటే
శ్వరుఁడు శతావధానమను "సర్కసుఁ" జూపెడిఁ జూడుఁడో బుధుల్.
వెం॥ శా॥

చ॥ తిరుపతి వ్యాఘ్రమై బయలుదేఱిన శిష్యులు గున్న యేస్గులై
పఱలఁగఁ దేఱఁగాఁ దగినవారలు బెబ్బులిపిల్ల లెల్లమా
రు రు కపికుర్కురమ్ము లయి తోఁపఁగ వేంకటశాస్త్రి వీరకే
సరిగ శతావధాన మను "సర్కసు" చూపితివమ్మ శాంకరీ. తి॥ శా॥

సీ॥ "కాసుచొప్పన నింతగా నార్జనము చేసి; తెంత దెచ్చినను మాకింత లేదు
గడగడలాడి సభా గానఁగా నేతెంత్రు, గ్రాసఁబోయిన మమ్ము గాంచు టరిది
ప్రీతితో నీకు నర్పింతు రెంతైన మా, కింత యిచ్చియు నెంతు రెంతొ యనుచు
సేవించి నీకు వాంఛితములిత్తురు సేవ, గావించినను మాకుఁ గాసు నీరు"

గీ॥ అనుచు మును పెన్నఁడో యాడినట్టి మాట, కన్యభావత్వంబుగూర్చి సిగ్గందఁజేసి
తైన నేమయ్యె నీయుత్సవాదికమ్ము, లీవ తైకొమ్ము? యో వెంకటేశ దేవ.

ఉ॥ కాశికనుండి యొండెడకుఁ గాల్గదలింపని వానిఁ గాశివి
శ్వేశుని దెచ్చి యొక్కయెడ నింటికి దాపున నిల్పి నవ్యశో
రాశి భవత్పితామహుఁడు ప్రాజ్ఞుఁడు; తిర్పతివేంకటేశ సూ
రీశుల నీవు తెచ్చుటది యేమి విశేషము చెన్నయాగ్రణీ. వెం॥ శా॥ ౧౨

ఉ॥ ఎవ్వరు నిన్ గ్రహించిరో బుధేంద్రులు రాజులయొద్ద వారి నే
రివ్వసుధన్ జెలంగునటు లెంతయు నోమిన చెన్నయార్యులం
దెవ్విధినేనిఁ జేర్చి భరియించుచు మేల్ సిరినింపుమమ్మ మా
యవ్వరో? యింక మాకు నెలవా! యలవేమవరాగ్రహారమా. తి॥ శా॥

సీ॥ ఎక్కించితివిగదా? యేగుచో మేనాల, సర్వత స్సమవృష్టి సంకులముగ
పట్టించితివిగదా? బ్రహ్మరథముఁ గూడ, స్వస్తివాచన పురస్సరము గాఁగ
కల్పించితివిగదా? గాఢోత్సవమ్ముల, వారాంగనా కదంబములతోడ
తాల్పించితివికదా? తలలపైఁ బావడ, జంబు నాబాలవృద్ధంబు గాఁగ

గీ॥ దురభిమానగ్రహావేశ ధూమధూపి, తాఁ బ్రయోజక గర్త్వపురాంతర స్థి
తాత్మపద్ధతిపన్నాసుయాయి సుజన, సంకలిత నిత్యమూర్ఛ, ఆసనపుఁజర్చ.

సీ॥ పాదరజం బానపడక, యూరక వంక, వంక దండము పెట్టువారు లేరు
"బ్రాహ్మణత్వం బూడివడ్డదే యాకసం, బందుంటి" యనుకూళ లెందు లేరు
భక్తిసారస్యప్రపత్తిసత్తావిత్త్వ, మలవడకున్న బ్రాహ్మణులు లేరు
పరమపాతివ్రత్య పరిపాకగరిమఁ జె, న్నెసలారకున్న గేహినులు లేరు

గీ॥ ఒక్కపద్ధతి దౌర్భాగ్యముండుఁ గాక, అదియు హానదుపాయ సంపదకు నొదుగు
దూరగులెయింగరకట? నీసారసుకవి, వినుత సుఖధామ యోకొండవీటిసీమ.
వెం॥ శా.

సీ॥ ఏయింటఁ జూచినఁ బ్రాయికంబుగఁ జేతి, జిడ్డువాయని మంచిగడ్డపెరుగు
ఏపొలంబరసినఁ గాపుటాండ్రు చరించు, పలుకఁ బాఱిన చాలు పంటచేలు
ఏబావిఁ గనుఁగొన్న 'సేబా'సనఁగఁ జాలు, నమృతంబుతోఁ బోరునట్టి నీరు
ఏగ్రామ మేగిన నింతలంతలు గూడఁ, బదధూళిఁ దలఁ గోరు భక్తివారు

గీ॥ బ్రహ్మశబ్దంబుదాల్చిన పాడుదండి, కుజనులనుదాల్పు పద్ధతికొఱకుఁగాదె
పాదరక్షలు దాల్పంగవలయు నీదు, విధమెఱిఁగినామ యో కొండవీటిసీమ.

తి॥ శా॥

☞ ఆయాపద్యము లేయేసందర్భమునఁ జెప్పఁబడినవో యాయాసందర్భములకు, వేమవరావధానము చూఁడఁదగు.

మంగళశ్లోకః

శ్లో॥ కల్యాణం రసనే నమ స్సుకవితే భద్రం పదేభ్యో నమ
సాహ్రరః కాల్పనికోత్తమాయ మనసే వృత్తాని వో వందనం
అస్తు స్వస్తి శతావధానవిధయే విద్వజ్జనా యాంజలి
ర్వ్యక్తాయుక్త వివేకినే సుకవితా సారస్య సంగ్రాహిణే. ౧౭ తి॥ శా॥

గద్య

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన, విద్వత్కవి, బాలకలానిధి, బాలసరస్వతీ
శతావధాని, తిరుపతి వేంకటేశ్వరసంకలితంబును
అనృతపర్వత దంభోళినమ్మితంబును నగు
గుంటూరిసీమ, ఉత్తరరంగము
సంపూర్ణము.

శ్రీపరదేవతార్పణమస్తు.



# తప్పొప్పుల పట్టిక.

---

ముఖ్యముగా దిద్దవలసినవి.

| పుట. | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 13 | 20 | పంక్తిపూర్తిగా తొలఁగించి 19 వ పంక్తియందును, చే, అను నక్షరము,రో, అని చదువఁదగు. | |
| 27 | 14 | అగు | అగ. |
| 30 | 4 | లుద్దడు | లుద్ధతు. |
| 31 | 26 | నుపఁడగ | గనుపడఁ. |
| 32 | 4 | ఉవ్వెత్తుకా | ఉవ్వెత్తుగా. |
| 41 | 13 | జయిం | పయిం. |
| 68 | 1 | చుఁబండ | చుబండ. |
| 68 | 16 | దన్భ | దర్భ. |
| 68 | 20 | జాబు | బాటు |
| 71 | 6 | మూర్ధాల | మూర్ణాల. |
| 72 | 17 | హాషా | భాషా. |
| 75 | 9 | మయ్యనో | మయ్యెనో. |
| 102 | 2 | గలఁగ | గలంగ. |
| 103 | 16 | హేహాబు | హాబు. |
| 103 | 25 | భీషో | భీష్మ. |
| 105 | 1-3 | పంక్తులలోని, శ్లోకము, సీసము, ఇవి కాశీకృష్ణాచార్యులవారి వారివని యెఱుఁగఁదగు. | |
| 111 | 16 | సత్వ | స్వత. |
| 112 | 7 | వ పంక్తి, సీసపద్యము తుదివఱకును గల భాగము, జానపాటి పట్టాభిరామశాస్త్రులవారిది, సమాప్తి ద్యోతకమగు— ఇట్టిగీటు, సీసమాప్తియందుఁ జూచుకోఁదగు. | |
| 112 | 26 | వేకాదు | వేఱు-కాదు. |
| 116 | 8 | వచ్చినే | వచ్చిన్నే. |

ఇంతవఱకు స్థూలదృష్టిచేఁ బ్రధాన గ్రంథభాగమునఁజూపిన దిద్దుబాట్లు,గీటుక్రిందఁగూడ నట్టిస్వల్పలోపములు గలవు, సవరించుకొనఁగోరెదము, ద, డ, న, స, ప, వ, ÷, ఆ, ఁ, ం లోనగు స్వల్పవ్యత్యాసములు మీరే సవరించుకొనఁగోరెదము, మఱియు 52-101, పుటలలోని, స్వాగతపద్యములు చదివిన వారెవరో బాలకులుగాని, రచయితమాత్రము, అన్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి యని చదువరు లెఱుఁగుదురుగాక.